AMMA NUDI
Telugu Monthly
Vol. 1
Issue 4
Rs. 20
June 2015
Tenali, AP

తెలుగుజాతి పత్రిక

1993-2013 నడుస్తున్న చరిత్ర

# అమ్మనుడి

జూన్ 2015



## రెండో బుద్ధుడు నాగార్జునుడు

## తమిళనాడులో ఒక తెలుగు రాజకీయపార్టీ ఎందుకు ఉండకూడదు?

1970 నుండి ఆయుర్వేద
ఔషధ నిర్మాణ రంగంలో ప్రఖ్యాతి గాంచిన
జీవక® వారి విశిష్ట ఉత్పత్తి




GMP Certified

# జీవశక్తి

## కుటుంబానికి సంపూర్ణ ఆరోగ్యాన్నిచ్చే రసాయనం

### సహజమైన కాల్షియం, విటమిన్లు గల స్వదేశీ హెల్త్ డ్రింక్




అనారోగ్యకర కాఫీ, టీ, కోకో, కోలా డ్రింక్స్‌ను త్రాగటం మానండి !
సంపూర్ణ ఆరోగ్యాన్నిచ్చే "జీవశక్తి"ని కుటుంబమంతా నిత్యం సేవించండి !!

రోగనిరోధక శక్తిని పెంచుతుంది. శరీరాన్ని శక్తివంతం చేస్తుంది.
మలబద్ధకం పోగొట్టి, సుఖ విరేచనానికి దోహదపడుతుంది.
శరీరంలోని సప్త ధాతువులకు, శక్తి చక్రాలకు పుష్టినిస్తుంది.
సహజమైన, ప్రశాంతమైన నిద్రను ప్రసాదిస్తుంది.
పిల్లలకు మానసిక, శారీరక ఎదుగుదలను, చురుకుదనాన్ని కలిగిస్తుంది.

"జీవశక్తి" నిత్యం వాడదగిన రసాయనం - అంటే నిరంతరంగా శరీరాన్ని రోగాలకు దూరంగా, శక్తితో అన్ని పనులనూ నిర్వహించేందుకు, నిత్యమూ శరీరాన్ని సన్నద్ధంగా ఉంచేందుకు "టానిక్"గా వాడవచ్చు. వయస్సుతో పనిలేకుండా స్త్రీ, పురుషులందరు నిరంతరము సేవించవలసిన గొప్ప రసాయనం "జీవశక్తి".

మా ఉత్పత్తులన్నీ ఆంధ్రప్రదేశ్, తెలంగాణ అంతటా ప్రభుత్వ ఖాదీ షాపులు, ఆయుర్వేద అంగళ్ళలో లభిస్తాయి
100కు పైగా గల మా ఉత్పత్తుల వివరాలకు, వ్యాపార నియమ, నిబంధనలకు సంప్రదించండి

SINCE : 1970

## జీవక® ఆయుర్వేదిక్ & అలైడ్ ప్రొడక్ట్స్

8-386, సామల సీతారామయ్య స్మారక జీవక ఆయుర్వేద భవనం, జీవక నగర్
అంగలకుదురు - 522 211. తెనాలి. గుంటూరు జిల్లా.
☎ 08644 - 220998 Customer Care : 9494 88 44 22 (10 a.m. to 6 p.m.)

వివరాలకు - ఉచిత జీవశక్తి సీసా కొరకు పూర్తి చిరునామా, ఫోన్ నెంబరుతో కొరియర్ నిమిత్తం రు. 20/- లు మనిఆర్డర్ చేయండి.

**'అమ్మనుడి'** పత్రిక మీకు నచ్చితే,
దయచేసి వెంటనే చందాదారులుగా చేరండి.

చందా సొమ్మును

- మనియార్డర్ ద్వారా పంపవచ్చు.
- ఆన్‌లైన్‌లో పంపవచ్చు.
- బ్యాంకు డి.డి. / చెక్ పంపవచ్చు.

*వీటిలో మీకు ఎలా వీలయితే అలా పంపించవచ్చు.*
*చందా వివరాలు 4వపుటలో చూడండి.*
*ప్రతినెలా పోస్టులో పత్రికను పంపగలము.*

**తెలుగు** నేలపై పుట్టి - రెండో బుద్ధుడిగా, గొప్ప ఆచార్యుడుగా ప్రఖ్యాతి గాంచిన నాగార్జునుడు - మహాయానాన్ని తీర్చిదిద్దాడు. అమరావతి స్థూపాన్ని అపురూప శిల్పాల గనిని తీర్చిదిద్దించింది నాగార్జునుడే. నాగార్జునకొండ ఈయన పేరిటే నిలిచివుంది. ..**14వ పుట**




## లోపలి పుటలలో....




కైసేత: **అ. రాజ్యలక్ష్మి, శంకర్,** రేఖాచిత్రాలు: **బాలి**

పకపకలు: **సరసి, శేఖర్**


## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తుంది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.
2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.
3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

**రచయితలందరికి :** 1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్/ రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో గాని పంపవచ్చు. 3.రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.




**రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు : డాక్టర్ సామల రమేష్‌బాబు,** సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

తెలుగుజాతి పత్రిక
అమ్మనుడి
మాసపత్రిక
● నుడి ● నాడు ● నెనరు
సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1937 మన్మథ నామ సంవత్సర జ్యేష్ఠ
*(ఒల్లాపి) శుక్ల చతుర్దశి సోమవారము నుండి అధిక ఆషాఢ
*(కట్లాపి) శుక్ల త్రయోదశి మంగళవారము వరకు
* ఒల్లాపి, కట్లాపి = తెలుగు నెలలు

## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు

**'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.
AMMA NUDI - AXIS BANK, TENALI
అక్కౌంట్ నెం. **915020010550189**
**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆవెంటనే - పూర్తి చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను పిన్‌కోడ్‌తోసహా, జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా
**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, తెనాలి
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు తప్పనిసరి సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాఫీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

# 'నడుస్తున్నచరిత్ర' చందా ఉన్నవారికి సూచన

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్నచరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్నచరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటివరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

### వెంటనే చందాలు పంపండి

అమ్మనుడి తొలి రెండు సంచికలను (మార్చి, ఏప్రిల్) నడుస్తున్న చరిత్ర చందా మిగిలి ఉన్నవారికి, అయిపోయినవారికీ కూడా పంపించాము. ఈ సంచిక నుండి చందా మిగిలిఉన్నవారికి, కొత్తగా చందాలు పంపించిన వారికి మాత్రమే పంపిస్తున్నాము. పైన ఇచ్చిన సూచనను కొందరు గమనించి ఉండకపోవచ్చు. చూసినప్పటికీ పనుల వత్తిడిలో చందాసొమ్మును పంపించకపోయి ఉండవచ్చు. అటువంటివారు దయచేసి వెంటనే పత్రిక చందా పంపమని మనవి.

### శాశ్వత చందాదారులకు మనవి

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000 లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వతచందా రు. 5000 లకు గాను రు. 4000 లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. అలా చేయలేనివారికి ఏడాదిపాటు **'అమ్మనుడి'** పత్రికను పంపించగలం. అప్పటికీ చందాను కొనసాగించలేని వారికి పత్రికను పంపజాలమని మనవి చేస్తున్నాము. దయచేసి సహకరించగోరుతున్నాము.

### విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపిస్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తివంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరిప్రతి (శాంపుల్‌కాపి) ని కోరినచో వారికి ఉచితంగా పంపగలము.

– ప్రచురణకర్త



# 'అమ్మనుడి' పత్రికకు పద్మభూషణ్ డా॥ కె.ఐ. వరప్రసాద్‌రెడ్డి గారి విరాళం

తెలుగుజాతి చరిత్రలో తనకంటూ ఒక గొప్ప స్థానాన్ని స్వయంకృషితో సాధించుకొన్న డా॥ కె.ఐ. వరప్రసాదరెడ్డి (1948) 'అమ్మనుడి' పత్రికకు రు. 1,00,000లు విరాళం ఇచ్చారు. 'నడుస్తున్న చరిత్ర' పత్రికను చాలాకాలంగా చదువుతున్న వరప్రసాద్‌రెడ్డి గారు ఇప్పుడు తమంతట తాముగా పెద్ద మనసుతో ఈ విరాళం పంపించారు. వారికి మా ధన్యవాదాలు. శాంతాబయోటెక్ లిమిటెడ్‌ను స్థాపించి, భారతదేశంలో బయోటెక్ విప్లవానికి నాంది పలికిన సాహసి. స్వదేశీ పరిజ్ఞానంతో జెనెటిక్ వ్యాక్సిన్‌లను, హెల్త్‌కేర్ ఉత్పాదనలను అభివృద్ధిపరచి, అందుబాటు ధరలో సామాన్యులకు అందించి, భారత శాస్త్రజ్ఞుల ప్రతిభను ప్రపంచానికి చాటిన సామాజిక స్పృహ కలిగిన విజ్ఞాని, పారిశ్రామికవేత్త శ్రీ వరప్రసాద్‌రెడ్డి.

వీరిని 2005లో భారతప్రభుత్వం "పద్మభూషణ్" తో సత్కరించింది. శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ నుండి సైన్సులో, ఆంధ్ర యూనివర్శిటీనుండి ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్‌లో పట్టా పొంది, ఉస్మానియా యూనివర్శిటీ నుండి ఎంబిఏ, వెస్ట్ జర్మనీలోని బిబ్లింజెస్ యూనివర్శిటీనుండి కంప్యూటర్ సైన్సెస్‌లో పిజి డిప్లొమా పొందిన. సంగీత, సాహిత్యప్రియుడు. కళాపోషకుడు. "హాసం" సంస్థ ద్వారా హాస్య-సంగీతాంశాలపై పుస్తకాలను ప్రచురిస్తున్నారు. బహుముఖమైన ప్రతిభాపాటవాలు కలిగిన వరప్రసాద్‌రెడ్డి గారు తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంనుండి 2005లో, గీతం యూనివర్శిటీనుండి (2011)లో గౌరవ డాక్టరేట్‌ను అందుకొన్నారు. తెలుగువారికి గర్వకారణమైన వరప్రసాద్‌రెడ్డి గారి నుండి ఆశీస్సులను, సహకారాన్ని అందుకోవడమే మాకృషికి గుర్తింపుగా భావిస్తున్నాము. వారికి మా కృతజ్ఞతలు.

సామల రమేష్‌బాబు

# తెలుగుజాతి (ట్రస్టు)

## విన్నపం

ట్రస్టుకు ఈ క్రింది విధంగా విరాళాలనిచ్చి ప్రోత్సహించగోరుతున్నాము.

| | | | |
|---|---|---|---|
| ప్రోత్సాహకులు | రు. 10,000/-లు | పోషకులు | రు. 25,000/-లు |
| విశిష్ట పోషకులు | రు. 50,000/-లు | రాజ పోషకులు | రు. 1,00,000/-లు |

వీరికి ప్రతినెలా పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.
వీరి ఫొటోతో క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి.
యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068



'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివశిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగుతున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు ఈ దిశగా పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. కొన్ని కార్యక్రమాల్ని కూడా చేపట్టవలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును రిజిస్ట్రేషన్ చేయించాము. (92/2014).

తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక ఇతర రాష్ట్రాల్లోనూ, ఇతర దేశాల్లో వున్న తెలుగు ప్రజలకోసం ట్రస్టు పనిచేస్తుంది.

'నడుస్తున్న చరిత్ర' 2013 అక్టోబర్‌తో నిలిచింది. దానిని మరింత సమగ్రంగా **'అమ్మనుడి'** పేరుతో పత్రిక ప్రచురణను మొదలుపెట్టాము. **2015** మార్చి, ఏప్రిల్, మే సంచికలను ప్రచురించాము. ఇప్పుడు మీ చేతిలో ఉన్నది జూన్ నెల సంచిక. మీ అందరి తోడ్పాటుతో పత్రిక ప్రచురణ కొనసాగుతుంది. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'** విడుదల చేశాము. తక్కిన కార్యక్రమాలను కూడా కాలక్రమంలో చేపడతాము. ఇందుకోసం ఈ ట్రస్టును బలమైన పునాదులతో, వనరులతో ఏర్పరచాలని నిర్ణయించాము. ట్రస్టుకు మీ అందరి చేయూత కావాలి. 'తెలుగుజాతి' ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

**రు.పదివేలు చొప్పున విరాళమిచ్చి తెలుగుజాతి ట్రస్టు ప్రోత్సాహకులుగా చేరిన వీరికి మా మప్పిదాలు.**



**శ్రీ యర్రానాయుడు**

**విశాఖపట్టణం, ఫోన్ : 9000582436**

మూడు తరాల క్రిందటే బర్మా వెళ్లిన తెలుగు కుటుంబంలో 1950 డిసెంబరు 20న పుట్టిన నాయుడుగారు 1966లో అక్కడి సామాజిక పరిస్థితులవల్ల తిరిగి విశాఖ చేరుకున్నారు. ఇటీవలి కాలంలో తెలుగు భాషోద్యమసమాఖ్యతో చేరి, చురుకుగా పనిచేస్తున్నారు. తెలుగు-బర్మీస్-ఇంగ్లీష్ నిఘంటువు (400 పుటలు) రచించారు. తెలుగు అకాడమీ వారికి 'తెలుగు-బర్మీస్' వాచకం కూర్చి ఇచ్చారు.



**డా॥ లంకా వెంకటేశ్వర్లు**

**ఏలూరు, ఫోన్ : 9493890138**

ఏలూరులో సబ్-రిజిస్ట్రారుగా పనిచేస్తూ కవిగా, రచయితగా ముందుకు సాగుతున్నారు. 15ఏళ్లుగా 'నడుస్తున్న చరిత్ర' కు పాఠకులు. వీరి రచనలు నడుస్తున్న చరిత్రలో ప్రచురితమైనాయి. 'ఆధునిక సాహిత్యంలో వృత్తి చైతన్యం' అనే అంశంపై పి.హెచ్.డి. చేశారు. ఇప్పుడు ఎం.బి.సి. అధ్యయన వేదిక రాష్ట్ర కన్వీనర్‌గా వున్నారు.

**విశాఖపట్నంనుండి పేరు ప్రచురించడానికి ఇష్టపడని మరొక పెద్దాయన (విశ్రాంత ప్రొఫెసర్ - రచయిత) కూడా ప్రోత్సాహకులుగా చేరారు.**

సంపుటి : 1 సంచిక : 4
అమ్మనుడి
జూన్ 2015

సంపాదకీయం

# కలిసి ముందుకు సాగితేనే - పరువూ మర్యాదా...

ఆంధ్రప్రదేశ్‌ను రెండు రాష్ట్రాలుగా విభజించటంతో తెలుగుజాతి చరిత్రలో ఒక కొత్త అధ్యాయం మొదలైంది. రాజకీయ ప్రత్యర్థులకు ఆ రెండు రాష్ట్రాల అధికారం చేజిక్కింది. రాజకీయ నిర్ణయాలు పోటాపోటీగా సాగుతున్నాయి. ఆర్.టి.సి. ఉద్యోగుల జీతం పెంపుదల విషయంలో ఇది మరొకసారి ప్రస్ఫుటమైంది. విదేశాలనుంచి పెట్టుబడులను రప్పించడంలో, కొత్త పరిశ్రమలకు ఆహ్వానం పలకడంలో పోటాపోటీగా వారి ప్రయత్నాలు సాగుతున్నాయి. ప్రతి సందర్భంలోను వారి మాటలు, వాగ్దానాలు కోటలు దాటుతున్నాయి. కానీ రెండు రాష్ట్రాల ప్రజలకు గర్వకారణమైన వారి భాషా సంస్కృతుల వారసత్వాన్ని కాపాడడంలో కాని, పెంపు చేయడంలోకాని వారిమధ్య ఎటువంటి పోటీ లేకపోగా, ఇద్దరూ ఆవిషయాలను పట్టించుకోకుండా వదిలేశారు. ఉద్యమకాలంలో తెలంగాణ భాషాసాంస్కృతిక అస్తిత్వం, ప్రత్యేకతలపై రెచ్చగొట్టే ఉపన్యాసాలు చేసిన కె.సి.ఆర్. కాని, ఇతర ఉద్యమకారులు కాని ఇప్పుడు ఆ అంశాలపై నోరు విప్పటంలేదు. ఇటు ఆంధ్రప్రాంతానికి సంబంధించి ఆత్మగౌరవాన్ని రెచ్చగొట్టినవారెవ్వరూ, ఆంధ్ర రాష్ట్ర ప్రజల భాషాసంస్కృతుల గురించి ఏమీ మాట్లాడటంలేదు. బహుశా ఇరుప్రాంతాల నేతలు తమ పూర్వవైఖరినే కొనసాగించి ప్రజల ఆత్మగౌరవాన్ని వీలైనంతగా అణచివేసేందుకు, వారిలో చైతన్యాన్ని నశింపజేసేందుకు తమలో తాము ఒక ఒప్పందానికి వచ్చారేమోననిపిస్తుంది.

ఇరు ప్రాంతాల నేతలూ అభివృద్ధి గురించే మాట్లాడుతున్నారు. భాష లేకుండా సంస్కృతి వుండదు, సంస్కృతి లేకుండా పెరుగుదలా వుండదు. జాతి బహుముఖ వికాసం సాంస్కృతిక పునాదులమీదనే ఆధారపడి వుంటుంది. ఆత్మగౌరవం దానికి ప్రాణంగా వుంటుంది. ఇరుపక్షాల నేతలు ఆ మౌలికాంశాలను పట్టించుకోకపోవడమే కాదు, దెబ్బకొడుతున్నారు కూడా. కేసీఆర్ నిజాం నవాబు భజన, ఉర్దూ భజన శృతిమించి రాగాలు తీస్తుంటే, చంద్రబాబు విదేశీభాషల భజన వికృతధ్వనులను వినిపిస్తోంది. తెలంగాణకు ఉర్దూ కూడా మొదటి భాషేనని, నిజాం ఆరాధ్య దేవుడనీ కేసీఆర్ ప్రవచిస్తుంటే; చైనీస్, జపనీస్, జర్మన్, ఇంగ్లీష్ భాషల అభివృద్ధి గురించి చంద్రబాబు వాగ్దానాలు చేస్తున్నారు. ఇద్దరు నేతలూ తమ తెలుగును – తమ ప్రజల ఊపిరి నుంచి వచ్చే భాషను – ఎలా కాపాడదలుచుకున్నారో దానిని పాలనలో, విద్యలో ఏ విధంగా పూర్తి వినియోగానికి తేదలుచుకున్నారో మాత్రం చెప్పనే చెప్పరు. చెయ్యనే చెయ్యరు.

రెండు తెలుగు రాష్ట్రాల ప్రభుత్వనేతలు తప్పనిసరిగా చెయ్యవలసిన మరి రెండుమూడు అంశాలున్నాయి. ఒకటి పురావస్తు శాఖ అధీనంలో ఆంధ్ర, తెలంగాణాలకు చెందిన పురావస్తువులు, వాటికి సంబంధించిన పత్రాలు. వీటిని ఉమ్మడి ఆస్తిగా పరిగణించి ఒక ఉమ్మడి వ్యవస్థను ఏర్పరుచుకోగలిగితే జాతిశ్రేయస్సు దృష్ట్యా చాలా మంచి పని అవుతుంది. అలా చేయడం నాయకులకు చేతకాకపోతే వాటిని సామరస్య పూర్వకంగా పంచుకోవాలి. వాటిలో కొన్ని: 1. ఆయా ప్రాంతాల్లో జరిపిన పురావస్తు అన్వేషణలు, పరిశోధనలు, త్రవ్వకాల వివరాలపై అన్వేషణలు, 2. త్రవ్వకాలపై ప్రచురితమైన లేక వ్రాతప్రతులుగా ఉన్న నివేదికలు, ఫోటోలు, 3. రెండు ప్రాంతాల్లో జరిపిన త్రవ్వకాల్లో వెలువడి, హైదరాబాదులో, ఇతర చోట్లా గల మ్యూజియాల్లో వున్న పురావస్తువుల వివరాలు, 4. పాతరాతియుగం, కొత్తరాతియుగం, ఇనుపయుగపు స్థలాల్లో దొరికిన పనిముట్లు, ఇతర పురావస్తువుల వివరాలు, 5. నాణేలు, ముద్రలు, రాగిరేకు శాసనాలు, రాతిశాసనాలు, మట్టి బొమ్మలు, పూసలు, మూసలు, రాతి శిల్పాలు, కంచు, రాగి, పంచలోహ విగ్రహాలు, కొయ్య దంతాల బొమ్మలు, రాతప్రతులు (కాగితం, తాళపత్రాలు), 6. అన్నిరకాల గుప్తనిధులు, ఆభరణాలు, ఇతర వస్తువులు, వాటి వివరాలు, 7. చారిత్రక గుహలు, బౌద్ధ, జైన

సంపాదకీయం

క్షేత్రాలు, దేవాలయాల ఛాయా చిత్రాలు, పెయింటింగ్స్, 8. చారిత్రక తొలియుగం, చారిత్రక తొలిమధ్యయుగం, మధ్యయుగం, మధ్యయుగానంతర పురావస్తువుల వివరాలు, 9. శాఖాపరమైన ప్రచురణల్లో నిష్పత్తిప్రకారం పంపకం, 10. ప్రధాన కార్యాలయంలోని గ్రంథాలయంలోని పుస్తకాల్లో నిష్పత్తి ప్రకారం వాటా – ఇలాంటి అన్ని అంశాల్లో వస్తువుల్ని, రికార్డును పరస్పరం పంచుకోవడం, మార్చుకోవడం జరగాలి.

మరొక ముఖ్యమైన అంశం – విభజన చట్టం పదవ షెడ్యూల్‌లోవున్న 18 విద్యాసంస్థలకు సంబంధించి సామరస్యపూర్వకంగా పరిష్కారం చేసుకోవడంలో– ఇరురాష్ట్రాలనేతలు, అధికారులు–పరుల జోక్యం అక్కర లేకుండా కలిసి కూర్చుని పరిష్కరించుకోవాలి. వీటిలో తెలుగు అకాడమీ, అంబేద్కర్ ఓపెన్ యూనివర్శిటీల సంగతి ఇక్కడ చెప్పుకోవాలి. ఈ రెండింటికీ వాటి ప్రచురణలే ఆధారం. తెలుగు అకాడమీ 47 ఏళ్లుగా, అం.ఓ.యూ. 33 ఏళ్లుగా ఎన్నో పాఠ్యపుస్తకాలను విలువైన ఇతర పుస్తకాలను ప్రచురించాయి. వాటిని రెండు ప్రభుత్వాలు సంయుక్తంగా నిర్వహించుకునే వ్యవస్థను ఏర్పాటు చేసుకోవడమే మంచిమార్గం. వీలు కానట్లయితే, ఆ ప్రచురణలకు ప్రాణమైన కాపీరైటు హక్కులు వంటి అంశాలను జాగ్రత్తగా పరిష్కరించుకోవాలి. ఏ ప్రాంతానికీ అన్యాయం జరక్కుండా పరిష్కరించుకోవాలి.

అదేవిధంగా తెలుగు విశ్వవిద్యాలయం, దానిలో ఇప్పటికొక భాగంగా ఉన్న అంతర్జాతీయ తెలుగుకేంద్రం సంగతి. అదేవిధంగా కేంద్ర నిర్వహణలో రావలసియున్న ప్రాచీన విశిష్ట భాషా పరిశోధన ప్రాజెక్టువంటివి. ఇలాంటి విషయాల్లోనైనా తెలుగుజాతి అంతా ఒక్కటిగా ఉన్నదని, ఉంటుందని చెప్పగల శక్తి ఈ రెండు ప్రభుత్వాల నేతలకు ఉన్నదా?.

పాలనాపరంగా విడిపోయిన రెండు తెలుగు రాష్ట్రాలు తమతమ ప్రాంతీయ ప్రత్యేకతల్ని నిలుపుకొంటూనే, పెంపు చేసుకొంటూనే – భాషా సంస్కృతుల విషయంలో సమైక్యంగా ముందుకు సాగాలని, ప్రజలు అందరూ కోరుకుంటున్నారు. దీన్ని రాజకీయ నాయకులు గ్రహించి, ముందుచూపుతో వ్యవహరించాలి. అందువల్లనే ఈ ముఖ్యమైన సున్నితమైన అంశాలను ప్రస్తావించాము.

చివరగా ఒకమాట. ఆంధ్ర–తెలంగాణ రెండు ప్రభుత్వాలూ తమ రాష్ట్రాల్లో భాషాసంస్కృతుల గురించి తాము అనుసరించదలుచుకొన్న విధానాన్ని స్పష్టంగా రూపొందించుకోవాలి. ఇదే సంచికలో ప్రచురించిన వ్యాసం – తెలుగు అంతర్జాతీయ భాష ఎలా అవుతుంది? (వేల్చేరు నారాయణరావు, పరుచూరి శ్రీనివాస్) చదవండి. మన భాష పట్ల మనకు ఎలాంటి ముందుచూపు ఉండాలో నిర్ణయించుకోవలసిన అగత్యం వచ్చింది. తెలుగు పేరుతో రాష్ట్రాలను ఏర్పరుచుకొని, పరిపాలనను సాగించుకొంటున్నాం. ఆ తెలుగును మనం ఆధునిక అవసరాలకు తగ్గట్లుగా అభివృద్ధి చేసుకొనే సంగతే ఆలోచించం. దానితో క్రమంగా దాని అవసరం తగ్గిపోయి అది కనుమరుగవుతుంది. మనుగడకు, అభివృద్ధికి పనికిరాని భాష అది మాతృభాష అయినాసరే – అది కేవలం మనలోమనం మాట్లాడుకొనేందుకే పరిమితమవుతుంది– ఇతర రాష్ట్రాల్లోని తెలుగువారు తమ కుటుంబాల్లో మాట్లాడుకొంటున్నట్లు.అంతే. అప్పుడు అన్ని అవసరాలకూ దాని స్థానాన్ని ఇంగ్లీషో, మరొక భాషో ఆక్రమిస్తుంది. క్రమంగా మన చరిత్ర అంతా శిథిలాల్లోకి దిగజారి, వర్తమానం అంతా ఒక బానిస బ్రతుకవుతుంది. భాష నశిస్తే జాతి నశిస్తుంది. అది తెలుగువారిపట్ల నిరూపణ అవుతుంది. భాషలో వైవిధ్యం, మార్పు – ముందడుగులో భాగాలు. రాజ్యవ్యవస్థలు తమ తమ ప్రత్యేకతలను కాపాడుకొంటూనే. ఒకే భాషకు, చరిత్రకు, సంస్కృతికి చెందిన వారసత్వాన్ని కలిగి వుండవచ్చు. వాటిని పెంపొందించుకొంటూ కలిసి ముందుకు సాగవచ్చు. ఈ దిశగా ముందుకు సాగడానికి ఎదురయ్యే అడ్డంకులను అధిగమించడం అసాధ్యమేమీకాదు.

రెండు తెలుగు ప్రాంతాల నేతలూ మనసుపెట్టి ఆలోచించండి. కలిసి ముందుకు సాగితేనే – పరువూ మర్యాదా... రానున్న చరిత్రలో బంగారు అక్షరాలతో మీ అధ్యాయాలు వ్రాయబడాలనే మేం కోరుకుంటున్నాం.

**31-5-2015**

సామల రమేష్‌బాబు

సంపాదకీయం - ౨

# 'అమరావతి' పేరు సార్ధకం కావాలంటే...

**కొ**త్తగా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్‌కు రాజధానిగా గుంటూరు జిల్లాలోని తుళ్లూరు, మంగళగిరి, ఉండవల్లి మండలాలలోని గ్రామాలను ప్రభుత్వం ఎంపిక చేసింది. కొన్ని వేల ఎకరాల స్థలంలో కళ్లు చెదిరే కొత్త రాజధానిని అత్యాధునికంగా నిర్మించాలని తలపెట్టింది. సింగపూర్ నిపుణులతో ఒప్పందాలు కుదుర్చుకొని ప్రణాళిక తయారు చేయించింది. అక్కడ రాజధాని నిర్మాణాన్ని ప్రశ్నించే వాదాలకు సమయం మించిపోయినందున కొత్త ఆలోచనలకు ఇక తావు లేదు. కొత్త రాజధాని నిర్మాణానికి భూమిపూజ, శంఖుస్థాపనకు తేదీలు నిర్ణయం అయినందున ఇక దానిని స్వాగతిద్దాం. అయితే మనం కొన్ని ముఖ్య అంశాలపై పాలకుల చూపును సారింపవలసిన అవసరముంది.

కొత్త రాజధానికి అమరావతి అని పేరు పెట్టాలనుకోవడం చాలా గొప్ప సంగతి. అయితే పేరు వరకే వదిలివేయకుండా దాని వారసత్వాన్ని కూడా కాపాడవలసిన బాధ్యత ఇప్పుడు ప్రభుత్వంపై వుంది. 'అమరావతీ నగర అపురూప శిల్పాలు' అని పాడుకునే తెలుగుతల్లి ప్రార్ధనలోని ఆ శిల్పాలు ఇప్పుడు ఎక్కడున్నాయి? లండన్ మ్యూజియంలో, చెన్నైలోని ఎగ్మోర్ మ్యూజియంలో, కోల్‌కత్తాలోని ఇండియన్ మ్యూజియంలో పదిలంగా ఉన్నాయి. కాగా, ఇప్పుడు అమరావతిలో మనకు కనిపించేది మిగులూ తగులూ మాత్రమే. వాటి ప్రదర్శనతో అమరావతి కీర్తి, శిల్పశైలి ఎవరికీ బోధపడదు. అమరావతిని దర్శించే విద్యార్థులకు కాని, విదేశీయులకు కాని అంతుపట్టదు. ఇదంతా గతవైభవం మాత్రమే, ఆధారాలు చూపలేని ఒకనాటి కతగా మాత్రమే వారికి మన వారసత్వాన్ని చెప్తుతున్నట్లవుతుంది.

క్రీస్తుకు పూర్వమే అమరావతి శిల్పం రూపుదిద్దుకుని ప్రపంచంలోనే ఒక ప్రత్యేకమైన శిల్పశైలిగా ఖ్యాతి వహించింది. గాంధార శిల్పాలు కూడా ఇంచుమించు ఆ కాలానివే అయినా, అమరావతి శైలికి వున్న దేశీయత, సొంతదనం మరొక శిల్పశైలికి లేదని పెద్దలు అంటారు. కంబోడియా, ఇండోనేషియాలలో గల ప్రపంచ ప్రఖ్యాత బౌద్ధశిల్పాలకు అమరావతి శిల్పశైలే తల్లి. అక్కడి శిల్పులు కూడా తెలుగువారే. కనుక చెన్నై, కోల్‌కత్తాల్లోను, లండనులోను వున్న అమరావతి శిల్పసంపదను వెనక్కి రప్పించి, వాటిని చెప్పుకోదగిన స్థాయిలో అమరావతిలో నెలకొల్పవలసిన బాధ్యతను ఈ కొత్త ప్రభుత్వం నెత్తికెత్తుకోవాలి. నగర నిర్మాణానికి శంఖుస్థాపన సందర్భంగా ఈ సంకల్పాన్ని ప్రకటించగలిగితే చంద్రబాబుగారిపై గౌరవం పెరుగుతుంది.

రాజధానిని కొత్తగా నిర్మాణం చేస్తున్నాం గనుక అక్కడ అన్ని కట్టడాలను అమరావతీశైలిలో తీర్చిదిద్దాలి. అప్పుడే దానికొక ప్రత్యేకత వస్తుంది. అదేవిధంగా కట్టడాలకు, వీధులకు తెలుగు నేతల, ప్రముఖుల, సాహితీవేత్తల, త్యాగధనుల పేర్లనే పెట్టాలి తప్ప, భావదారిద్ర్యంతో అరువు పేర్లకై పరుగులెత్తరాదు. అమరావతిని ఒక తెలుగు రాష్ట్ర రాజధానిగా, ఇక్కడి ప్రభుత్వాన్ని తెలుగు ప్రజల ప్రభుత్వంగా విదేశీయులతో సహా అందరూ గుర్తించాలంటే అమరావతి నగరమంతటా తెలుగు కనపడాలి, వినబడాలి. అంటే ప్రతీచోటా ప్రభుత్వ, ప్రజారంగాలన్నిట్లోనూ ఎక్కడ ఏ పేరుపలక (సైన్స్‌బోర్డు) వున్నా, ఎక్కడ ఏ కార్యక్రమం జరిగినా తొలుత ప్రముఖంగా తెలుగులో అది కనిపించాలి. అక్కరనుబట్టి దాని తర్వాతే ఇంగ్లీషుకు చోటు ఇవ్వాలి. అక్కర వున్నా లేకపోయినా ఇంగ్లీషును నెత్తిన పెట్టుకుని మోయటం, సొంత భాషను కించపరుచుకోవటం తగదు. అప్పుడే ప్రజలకు అది స్ఫూర్తిదాయకం అవుతుంది. ఇక్కడి ప్రజల భాషకు గుర్తింపులేక, ఇక్కడి ప్రజల సంస్కృతికి, శిల్పసంపదకు ఎటువంటి వ్యక్తీకరణ లేక అది అమరావతి కాజాలదు.తెలుగు రాజధానే కాజాలదు. కనుక ఈ విషయంలో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారి ప్రభుత్వం ఒక విధాన నిర్ణయాన్ని తీసుకోవాలి.

'మా తెలుగుతల్లికి' గీతాన్ని రాష్ట్రగీతంగా తీసుకున్న ప్రభుత్వం అమరావతి మహానగర నిర్మాణం మొదలుపెట్టేముందే- శంఖుస్థాపన సమయంలోనే ఈ అంశాలపై స్పష్టమైన ప్రకటన చెయ్యాలి.

ఇందుకోసం భాషా సాంస్కృతికశాఖ, పురావస్తుశాఖ, సమాచారశాఖ, ఉన్నతవిద్యాశాఖలను, కొందరు నిపుణులను కలిపి ఒక కమిటీని నియమించి, సవివరంగా విధానాన్ని తయారుచేసి దానిని ఆచరణలో పెట్టాలి. ప్రజల సూచనలను, సలహాలను ఆహ్వానించి, వాటినికూడా పరిగణనలోకి తీసుకోవాలి.

మరో ముఖ్యమైన సంగతి. తెలంగాణ వేరే రాష్ట్రంగా ఏర్పడినందున మిగిలిన భాగం దాదాపు తొలి ఆంధ్రరాష్ట్రమే గనుక - ఆ రాష్ట్రానికి ఆ పేరే పెట్టడం సరియైనపని. గొప్పలకు పోయి ఇంకా పాత ఆంధ్రప్రదేశ్ పేరునే కొనసాగించడం ఏవిధంగానూ సరికాదు. కనుక చంద్రబాబుగారు ఈ విషయమై తిరిగి ఆలోచించి, రాష్ట్రానికి 'ఆంధ్ర' అనే పేరును ఖాయం చెయ్యాలి. ఆ మార్పుకు శాసనపరంగా తగుచర్యలను చేపట్టాలి. ఇందువల్ల అమరావతికి వున్న 'ఆంధ్రనగరి' అనే కీర్తికూడా మళ్లీ ప్రచారంలోకొస్తుంది. రాజధానికి 'అమరావతి' అనే పేరు సార్ధకం కావాలంటే ఈ అంశాలన్నింటినీ ప్రభుత్వ నేతలు అమలులోకి తేవాలని కోరుతున్నాం.

సామల రమేష్‌బాబు

31-5-2015

# తెలుగుకు మంత్రిత్వశాఖ ఏర్పాటు చేస్తూ ఇచ్చిన జి.ఒ.నెం.909/31-12-2013

(కొందరు పాఠకుల కోరికపై జి.ఒ.ను పూర్తిగా ఇక్కడ ప్రచురిస్తున్నాము.-సం)

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

**సంక్షిప్తి:** సచివాలయం - 'భాష మరియు సంస్కృతి శాఖ' నూతన ప్రభుత్వ శాఖ ఏర్పాటు - ఆదేశాలు - జారీ చేయడం.

---

సాధారణ పరిపాలనా (ఏఆర్ అండ్ టి.ఐ.)శాఖ

**జి.ఒ.ఎం.ఎస్.నెం.909** తేదీ: **31-12-2013**

ఆదేశం:

గౌరవనీయ ముఖ్యమంత్రిగారు 2012 డిసెంబర్ 27 నుంచి 29 వరకు తిరుపతిలో జరిగిన నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా తెలుగు భాష అభివృద్ధికోసం ప్రత్యేక శాఖ ఏర్పాటు చేయనున్నట్లు ప్రకటించారు.

2. ఇందు మూలంగా సచివాలయంలో 'భాష మరియు సంస్కృతి శాఖ'ను ఏర్పాటు చేయాలని, ఈ కింది విధంగా అందులో పదవులు పున:నియామకం జరపాలని ప్రభుత్వం ఆదేశిస్తోంది.
   కొత్తగా ఏర్పాటు చేస్తున్న 'భాష మరియు సంస్కృతి శాఖ' కు తరలిస్తున్న పదవులు.
   సాధారణ పరిపాలనాశాఖ నుంచి ప్రభుత్వ ఉపకార్యదర్శి (ఒ.ఎల్)....1
   సాధారణ పరిపాలనాశాఖ నుంచి ప్రభుత్వ సహాయ కార్యదర్శులు (ఎల్)....2
   సాధారణ పరిపాలనా (ఒ.ఎల్) శాఖ నుంచి సెక్షన్ ఆఫీసర్లు...3
   సాధారణ పరిపాలనా (ఒ.ఎల్) శాఖ నుంచి సహాయ సెక్షన్ ఆఫీసర్లు...5
   సాధారణ పరిపాలనా (ఒ.ఎల్) శాఖ నుంచి ఇన్‌స్పెక్టింగ్ ఆఫీసర్లు...3
   వైఎటి అండ్ సి శాఖ నుంచి ప్రభుత్వ ఉప కార్యదర్శి (సంస్కృతి)...1
   వైఎటి అండ్ సి శాఖ నుంచి ప్రభుత్వ సహాయ కార్యదర్శి (సంస్కృతి)...1
   వైఎటి అండ్ సి శాఖ నుంచి సెక్షన్ ఆఫీసర్ (సంస్కృతి)...1
   వైఎటి అండ్ సి శాఖ నుంచి సహాయ సెక్షన్ ఆఫీసర్ (సంస్కృతి)...1
3. కొత్తగా ఏర్పడుతున్న 'భాష మరియు సంస్కృతి' శాఖకు కార్యదర్శి (భాష మరియు సంస్కృతి) హోదాలో ప్రభుత్వ కార్యదర్శి (సంస్కృతి) అధిపతిగా ఉంటారు. యువత పురోభివృద్ధి, పర్యాటకం మరియు సంస్కృతి' శాఖ ప్రత్యేక ముఖ్య కార్యదర్శి సమగ్ర పర్యవేక్షణలో ఈ కార్యదర్శి పనిచేస్తారు.
4. నూతన 'భాష మరియు సంస్కృతి శాఖ' ఈ కింది విషయాలతో వ్యవహరించనుంది. వాటితోపాటు సాధారణ పరిపాలనా శాఖ పరిధిలోని అధికారభాష, యువత పురోభివృద్ధి, పర్యాటకం మరియు సంస్కృతి శాఖ పరిధిలోని సంస్కృతి తదితర అంశాలతోనూ వ్యవహరించనుంది.
   అ. సాధారణ పరిపాలనా (ఒ.ఎల్.)శాఖ నుంచి అధికార భాషా కమీషన్.
   ఆ. యువత పురోభివృద్ధి, పర్యాటకం మరియు సంస్కృతి శాఖ నుంచి ఏపి సాహిత్య అకాడెమి, ఏపి లలిత కళాఅకాడెమి, ఏపి సంగీత నాటక జానపద అకాడెమి మొదలు మూడు అకాడెమీలు.
   ఇ. సాధారణ పరిపాలనా (ఐ అండ్ పీఆర్) శాఖ నుంచి థియేటర్ (రంగస్థలం).
   ఈ. ఉన్నత విద్యాశాఖ నుంచి తెలుగు అకాడెమి.
5. సాధారణ పరిపాలనాశాఖ (ఒ.ఎల్.) / (ఐ అండ్ పీఆర్) శాఖ, యువత పురోభివృద్ధి, పర్యాటకం మరియు సంస్కృతి శాఖ, ఉన్నతవిద్యాశాఖలు ఈ విషయంపై తగు చర్యలు తీసుకోవాలని కోరుతున్నాము.
6. సాధారణ పరిపాలన (ఎస్ఓఎల్.ఏ)/ఏసీ.ఎఫ్)/(ఎస్‌యూ.2)/(ఎస్.యూ.2) శాఖ మరియు రెవెన్యూ శాఖలు పైన పేర్కొన్న పేరా 2 లోని అంశాల ప్రకారం తగు చర్యలు తీసుకోవాలని కోరుతున్నాము.
7. ఆంధ్రప్రదేశ్ కార్యకలాపాల నిబంధనలు, సచివాలయ సూచనలుకు చెందిన మొదటి షెడ్యూల్‌ను సవరించి, తగు చర్యలు చేపట్టవలసిందిగా సాధారణ పరిపాలన (కేబినెట్) శాఖను కోరడమైనది.
8. ఆర్థిక (ఎస్ఎమ్‌పీసీ) శాఖ (యు.ఒ.నెం.4102/1084/ఏ3/ఎస్ఎంపీసీ-1/13, తేది.24-12-1013, సమ్మతితో ఈ ఆదేశాలను జారీ చేస్తున్నాము.

(ఆంధ్రప్రదేశ్ గవర్నర్ ఆదేశాలకు అనుగుణంగా)

**డాక్టర్ పి.కె. మహంతి,** ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి

-ఆచార్య వెల్చేరు నారాయణరావు, పరుచూరి శ్రీనివాస్

# తెలుగు అంతర్జాతీయ భాష ఎలా అవుతుంది?

**తె**లుగు అంతర్జాతీయ భాష అవడం గురించి మనకి గత కొన్ని సంవత్సరాలుగా తరుచూ వినిపిస్తోంది. తెలుగువాళ్ల ప్రపంచంలో అభివృద్ధి చెందిన దేశాలన్నిట్లోనూ ఉన్నారు. అందులోను ఇంగ్లీషు దేశభాషగా వున్న అమెరికా లోను, ఇంగ్లాండులోను చాలా ఎక్కువమంది వున్నారు. ప్రపంచంలో చాలా చోట్ల మాట్లాడబడుతున్న భాష కాబట్టి తెలుగు ప్రపంచ భాషే!

అమెరికాలోని డెట్రాయిట్ లోను, న్యూజర్సీ లోను, డాలస్ లోను తెలుగు సాహిత్యం పట్ల చెప్పుకోదగ్గ ఆసక్తి ఉన్నవాళ్ళు దాదాపుగా ప్రతి నెలా సమావేశమై సాహిత్య చర్చలు, పుస్తక విమర్శలు ఉత్సాహంగా చేస్తున్నారు. ఈ ఔత్సాహికులు ప్రచురణ రంగంలో కూడా తమ సామర్థ్యాన్ని ప్రదర్శిస్తున్నారు. ఇది ఒక రకమైన అంతర్జాతీయత. కాని, ఈ సాహిత్య సమావేశాలు డెట్రాయిట్‌లో జరిగినా, ఇంకే ఊరిలో జరిగినా కూడా విజయవాడలో జరిగినట్లే ఉంటాయి. లేదా హైదరాబాదులో జరిగినట్లే ఉంటాయి. తమ చుట్టూ వున్న ఇంగ్లీషు ప్రపంచం మీద ఇవి ఏ రకమైన ప్రభావాన్నీ కలిగించవు. ఆ ప్రపంచ ప్రభావం కూడా వీటి మీద ఏమీ వుండదు. ఇది కాక ఇంకా పెద్ద యెత్తున కొన్ని లక్షల డాలర్లు ఖర్చుపెట్టి ప్రతి రెండు సంవత్సరాలకి ఒకసారి తానా, ఆటా లాంటి సంస్థలు ఉత్సవాలు జరుపుతాయి. వాటికి తెలుగుదేశం నుంచి పెద్ద రాజకీయ నాయకులు, మంత్రులు, తెలుగు సినిమా తారలు, మతాధిపతులు డజన్ల కొద్దీ వస్తారు. వీటిలో తెలుగు సినిమాలు, తెలుగు రాజకీయాలు, తెలుగు భోజనాలు, కూరలో కరివేపాకు లాగా కాస్త సాహిత్యము, ఇవే తెలుగుతనమైతే ఇవి ఈ సమావేశాల్లో పుష్కలంగా కనిపిస్తాయి.

అసలు విషయమేమిటంటే- ఇక్కడ తెలుగు కుటుంబాలలో తల్లిదండ్రులు తెలుగు వాళ్లు, వాళ్ల పిల్లలు అమెరికా వాళ్లు. వాళ్లు తెలుగు భాషని గుర్తించగలిగేది తెలుగు అంతర్జాతీయ భాష అయినప్పుడే.

ఈ సందర్భంలో ఒక భాష అంతర్జాతీయ భాష ఎలా అవుతుంది అనే ప్రశ్న వేసుకుని చూద్దాం. ఒక భాషలో వున్న విజ్ఞానం ప్రపంచ విజ్ఞానంలో భాగం అయి, ప్రపంచంలో విజ్ఞులు దానిని గుర్తించవలసిన అవసరం కలిగితే, అప్పుడు అది ప్రపంచ భాష అవుతుంది. ఆ రకంగా ప్రపంచ భాషలయినవి గ్రీకు, సంస్కృతం, రోమన్, లాటిన్, చైనీస్, జపనీస్, ఫ్రెంచ్, జర్మన్, ఇటాలియన్... ఇలాంటి భాషలు. తను పుట్టి పెరిగింది ఏ భాషలోనైనా సరే ఈ భాషల్లో వున్న విజ్ఞానం తన భాషలోకి అనువదించుకుని చదివి తీరాలి. సాధ్యమైతే ఆ భాషలు నేర్చుకుని, ఆ పుస్తకాలు మూలంలో చదివి ఆ విజ్ఞానం మీద పట్టు సంపాదించాలి.

**ఇలాంటి విజ్ఞానం తెలుగులో వుందా? తెలుగు నేర్చుకోవడం మూలంగా తెలుగులో వున్న పుస్తకాలు చదవడం మూలంగా ప్రపంచ విజ్ఞానాన్ని పెంచగలమా? అలా పెంచగలమని మన దేశపు విజ్ఞులు ప్రపంచానికి ప్రదర్శించగలరా? నువ్వు ఏ భాష వాడివైనా తెలుగులో రాసిన పుస్తకాలు చదవకపోతే ఇదిగో నీ విజ్ఞానానికి ఈ రకంగా లోపం వస్తుంది అని మనం చెప్పగలిగిన రోజున, ఆ మాట ప్రపం చంలోని విజ్ఞులు విన్న రోజున, ఆ మాట విని వాళ్లు తెలుగు నేర్చుకున్న రోజున, లేదా తెలుగు పుస్తకాల అనువాదాలు చదివిన రోజున, చదివి అందువల్ల వాళ్లు గ్రహించిన విజ్ఞానాన్ని ప్రపంచ విజ్ఞానంలో భాగం చేసిన రోజున- అప్పుడు తెలుగు ప్రపంచ భాష అవుతుంది.**

**తెలుగు ఇలాంటి ప్రపంచ భాష కావాలంటే తెలుగు వాళ్ళు పది మంది తెలుగు వాళ్ల మధ్య కూర్చుని తెలుగు చాలా అందమైన భాష అని, చాలా మృదువైన భాష అని, చాల తియ్యని భాష అని సరదాగా పొగుడుకుంటే చాలదు. అమెరికాలో ఉన్న తెలుగు సాంస్కృతిక సంఘాలు సమావేశమై, సరదాగా కబుర్లు చెప్పుకుని, తెలుగు భోజనాలు చేసి, ఇంటికెళ్లి తమ ఉద్యోగాల్లో పడిపోతే తెలుగు ప్రపంచ భాష అవదు.**

ఈ సందర్భంలో తెలుగు దేశంలో తెలుగు స్థితి ఎలా వుంది అన్నది ముందు ఆలోచించాలి. ఆంధ్రప్రదేశ్ లోను, తెలంగాణ లోనూ వున్న విశ్వవిద్యాలయాలలో తెలుగు శాఖలు ఏంచేస్తున్నాయి? నిష్ఠూరమైనా, నిజం చెప్పాలంటే వీరు పీహెచ్‌డీల పేరుతో గత యాభై యేళ్లుగా తయారు చేయిస్తున్న సిద్ధాంత వ్యాసాలలో ఏ రకమైన విజ్ఞానం కనిపిస్తుందో చెప్పడానికి పట్టుమని పది వాక్యాలు కూడా అక్కర్లేదు. తెలుగు రాష్ట్రాలలో వున్న ఈ తెలుగు శాఖలు దాదాపుగా నిర్జీవంగా వున్నాయి. వీళ్ల చెప్తున్న పాఠాలు, ఇస్తున్న పీహెచ్‌డీ డిగ్రీలు ఎవరికీ ఏ రకంగాను పనికిరాని స్థితిలో వున్నాయి. కష్టంగా తోచవచ్చు కానీ తెలుగు శాఖలకి అంతర్జాతీయ ప్రమాణాలలో పీహెచ్‌డీ సిద్ధాంత గ్రంథం రాయించగలగడం ఇప్పటికీ సాధ్యం కావడం లేదు.

విశ్వవిద్యాలయాలలో ఈ శాఖల ఆకారం పాశ్చాత్య దేశాల నుంచి అరువు తెచ్చుకున్నది. లాంఛనాల దృష్ట్యా, పరిపాలనా విధానాల దృష్ట్యా, నియమాల దృష్ట్యా కాగితం మీద ఇవన్నీ చాలా పకడ్బందీగా కనిపిస్తాయి. కానీ ఇదంతా ఆకారపుష్టి మాత్రమే. అందులో వున్న అంతస్సారం చూస్తే డొల్ల తప్ప మరేమి కనిపించదు. ఇలాంటి పరిస్థితుల్లో దేశంలో వున్న తెలుగు శాఖలు నిరంతర నిర్జీవస్థితిలో ఎన్నాళ్లు వుంటాయో అక్కడి వాళ్లు నిబ్బరంగా ప్రశ్న వేసుకోగలగాలి. ఈ

సందర్భాన్ని పురస్కరించుకుని ఇక్కడ కొన్ని సూచనలు చేస్తున్నాం. విశ్వవిద్యాలయాలకి, తెలుగు శాఖల్లో వుండే అధికారులకి ఇవి పనికొచ్చే ఆలోచనలవుతాయని మా ఆశ.

ఇప్పుడున్న విశ్వవిద్యాలయాలు పాశ్చాత్య వ్యవస్థలకి ప్రతిరూపాలే కాబట్టి అవి ఎలా పని చేస్తున్నాయో అక్కడి పరీక్షావిధానాలు, పఠన పాఠన పద్ధతులు, డిగ్రీల వ్యవస్థలు ఎలా నడుస్తున్నాయో సాధ్యమైనంత స్పష్టంగా అర్థం చేసుకోవాలి. మన రాష్ట్రాల్లో ఎన్నో విశ్వవిద్యాలయాలు ఎక్కువశాతం రాజకీయ అవసరాల కోసం యేర్పడ్డవి. అవి విద్యావసరాలకోసం పని చేసే పరిస్థితి కల్పించాలంటే ఆ పని లోపలి నుంచే జరగాలి. తెలుగు శాఖల్లో ప్రస్తుతం ప్రధాన స్థానాల్లో వున్నవాళ్లు ఒక స్వచ్ఛంద కూటమిగా యేర్పడి, ఏ ప్రభుత్వప్రమేయం, ఏ రాజకీయ ప్రబోధం అక్కర లేకుండా, ఇంగ్లండ్‌లోను, అమెరికాలోను, కెనడాలోను ఉన్న ఇండియన్ స్టడీస్ డిపార్ట్‌మెంట్లలో పని ఎట్లా జరుగుతోందో, వాళ్లు విద్యార్థుల్ని ఎలా ఎంపిక చేసుకుని చేర్చుకుంటున్నారో, ఆ విద్యార్థులకి ఏ రకమైన ప్రోత్సాహాలు కల్పిస్తున్నారో? ఆ సమాచారం సంపాదించాలి. ఆ విద్యార్థులు పిహెచ్.డి. కోసం పరిశోధన చేసే ముందు ఏ విధమైన శిక్షణ పొందుతారో, ఏ ఏ విధానాలు, భాషలు నేర్చుకుంటారో, వాళ్లు తమ పరిశోధన ప్రణాళికని ప్రతిపాదించడం కోసం ఏ రకమైన పరిశ్రమ చేస్తారో, ఎలా తర్ఫీదు పొందుతారో తెలుసుకోవాలి. పరిశోధన ప్రణాళిక తయారు చేసిన తరువాత ఆ విద్యార్థులు తమ పథకాన్ని అధ్యాపకుల ముందు ఎట్లా సమర్థించుకుంటారో, వాళ్ల ప్రశ్నలకి ఎలా సమాధానాలు చెప్తారో గమనించాలి. ఆ శాఖల్లో తెలుగు ఉండకపోవచ్చు. తరుచూ ఉండదు కూడా. కానీ వాళ్ల విధానాలు, శిక్షణలు తెలుసుకోవడానికి తెలుగే అక్కర్లేదు.

తెలుగులో ప్రచురణ సంస్థల స్థితి పరమ విషాదకరంగా వుంది. వాటి మీద ఆధారపడకుండా ఉండాలంటే ముఖ్యమైన విశ్వవిద్యాలయాలకి బలమైన ప్రచురణ విభాగాలు ఏర్పడాలి. పరిశోధన గ్రంథం విశ్వవిద్యాలయం ప్రచురిస్తే దానికి గౌరవం ఉంటుంది అనే సంప్రదాయం ఏర్పడాలి. అప్పుడు ఎవరి పుస్తకాన్ని వాళ్లే ప్రచురించుకునే ఇప్పటి పద్ధతినుంచి పరిశోధకులకి విముక్తి కలుగుతుంది. వ్యాపార గ్రంథాల ప్రచురణకర్తలకి, వైజ్ఞానిక గ్రంథాల ప్రచురణకర్తలకి, మన ప్రాంతంలో తేడా లేదు. ఆ తేడా ఏర్పడటానికి విశ్వవిద్యాలయాలు పరిశ్రమించాలి. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్, హార్వర్డ్ వంటి విశ్వవిద్యాలయాలు పుస్తక ప్రచురణలో ఏ పద్ధతులు అనుసరిస్తాయో గమనించి అవసరమైతే అక్కడ కొన్ని నెలల పాటు శిక్షణ పొంది రావడానికి తగినవాళ్లని పురమాయించి తమ ప్రచురణలని అంతర్జాతీయ స్థాయికి తీసుకురావాలి.

పాశ్చాత్య దేశాలలో ఒక విజ్ఞానానికి సంబంధించిన వాళ్లందరికి తమ తమ విశ్వవిద్యాలయాలతో, కళాశాలలతో సంబంధం లేకుండా ఒక వైజ్ఞానిక సంస్థ ఉంటుంది. ఉదాహరణకి, అమెరికన్ ఆంత్రొపాలజికల్ సొసైటీ, అమెరికన్ హిస్టారికల్ సొసైటీ, అసోసియేషన్ ఫర్ ఏషియన్ స్టడీస్, జెర్మన్ ఓరియంటల్ సొసైటీ, రాయల్ ఏషియాటిక్ సొసైటీ– ఇలా. ఇలాంటి సంస్థ ఒకటి తెలుగు పరిశోధన కోసం వేరేగా ఏర్పడాలి. ఇందులో ఆంధ్రప్రదేశ్ లోను, తెలంగాణ లోను, భారతదేశంలోని ఇతర ప్రాంతాలలోను తెలుగు చెప్పే ఉద్యోగాలు చేస్తున్నవాళ్లు అందరూ సభ్యులుగా చేరాలి. వాళ్లు కట్టే సభ్యత్వ రుసుముతో ఈ సంస్థ ముఖ్యంగా రెండు పనులు చేయాలి.

1. సంవత్సరానికొకసారి తెలుగు వైజ్ఞానిక సదస్సు నిర్వహించాలి. ఈ సదస్సుల్లో వివిధ విద్యాసంస్థల్లో తెలుగు చెప్పేవాళ్లు తాము చేసే పరిశోధనల మీద ప్రామాణికమైన పత్రాలు సమర్పించాలి. ఈ పని తెలుగు దేశంలో అప్పుడప్పుడు యు.జి.సి ఇచ్చిన డబ్బులతో జరగడం, అక్కడి పత్రాలు పుస్తకంగా బయటకు రావడం కనిపిస్తుంది. కానీ ఈ పని ప్రతి సంవత్సరం జరగాలనీ, ఆ సదస్సుల్లో ప్రొఫెసర్లు, రీడర్లు, లెక్చరర్లు అందరూ పాల్గోవాలని, అలా పాల్గొవడం వాళ్ల పరిశోధనా సామర్థ్యానికి ఒక ప్రమాణంగా ఏర్పడాలని మా సూచన.

2. దానితో పాటు ఈ సంస్థ సంవత్సరానికి మూడు లేదా నాలుగు సార్లు వెలువడే ప్రామాణిక పరిశోధన సంచిక నడపాలి. ఆ సంచికలో ప్రచురణార్థం వచ్చే వ్యాసాల్ని సమర్థులు చదివి, అవసరమైతే దానిలో సవరణలు సూచించి అది ప్రచురణార్హమని చెప్పిన తరువాతే ప్రచురించాలి. ఇలాటి పత్రికలను ఇతర దేశాలలో ఇతర వైజ్ఞానిక సంస్థలు ఎలా నడుపుతున్నాయో, వారు ఎలాంటి ప్రమాణాలు పాటిస్తున్నారో క్షుణ్ణంగా చూసి వాటిలో పనికొచ్చే పద్ధతులు మనం అనుసరించాలి. (ఇలాంటి పత్రికలు ఇండియాలో కూడా ఇంగ్లీషులో వున్నాయి. ఉదాహరణకి, ఇండియన్ ఎకనమిక్ అండ్ సోషల్ హిస్టరీ రివ్యూ (IESHR) ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ (EPW) , కాంట్రిబ్యూషన్స్ టు ఇండియన్ సోషియాలజీ (CIS) వంటివి. ఇవన్నీ అంతర్జాతీయ ప్రమాణాల్ని పాటిస్తున్నాయి. ఈ ప్రమాణాలలో తెలుగు పరిశోధన పత్రిక ఒక్కటి కూడా లేదు). ఇది కొనేవాళ్లు, చదివేవాళ్లు తక్కువ మందే వుంటారు. తెలుగు దేశంలో వున్న తెలుగు శాఖల అధ్యాపకులు అందరూ ఈ పత్రిక కొనాలని, చదవాలని, అందులో తమ పరిశోధన వ్యాసం ప్రచురించబడితే అది తమకొక అర్హతగా భావించాలని, అలాంటి అర్హతల ఆధారంగానే వాళ్ల పదోన్నతులు ఉండాలని ఒక సంప్రదాయం ఏర్పరచాలి. ఏమీ ప్రచురించని వ్యక్తికి ఉద్యోగంలో ఎదుగుదల వుండకూడదు.

ప్రపంచంలోని ప్రముఖ దేశాలలో, ముఖ్యంగా అమెరికా, ఫ్రాన్స్, ఇంగ్లాండ్, ఆస్ట్రేలియా, జర్మనీ వంటి దేశాలలో భారతదేశాన్ని గురించి చెప్పుకోదగ్గ పరిశ్రమ జరుగుతోంది. ఈ దేశాల విశ్వవిద్యాలయాలలో ఇప్పుడిప్పుడే తెలుగు గురించి జిజ్ఞాస మొదలవుతోంది. అమెరికాలోని ఎమరీ విశ్వవిద్యాలయంలో తెలుగుకి ఒక ఆచార్య స్థానం ఏర్పడింది కూడా. ఇది తెలుగుకి పాశ్చాత్య ప్రపంచంలో మొదటి ఆచార్య స్థానం. **మరికొన్ని సంవత్సరాలలో ఇంకా కొన్ని విశ్వవిద్యాలయాలలో తెలుగు ఆచార్య స్థానాలు ఏర్పడతాయి.** మన తానాలు, ఆటాలు తలుచుకుంటే ఇవి చాలా త్వరలోనే యేర్పడవచ్చు.

**అలా అక్కడ ఏర్పడబోయే ఆచార్య స్థానాలకి తగిన వారిని ఆంధ్రప్రదేశ్ లోను, తెలంగాణ లోను వున్న విశ్వవిద్యాలయాల తెలుగు శాఖల వారు పంపించగలరా?** తెలుగు దేశంలోని విశ్వవిద్యాలయాలు

అంతర్జాతీయ ప్రమాణాలకి అనుగుణంగా తయారు కాకుండా, ఒట్టి డొల్ల పీహెచ్‌డీలు ఇచ్చి కాలం గడుపుతామంటే, అటువంటి వారు ఈ ఉద్యోగాలకి అర్హులు కారు. అమెరికాలో వున్న తెలుగు ప్రొఫెసర్ స్థానానికి తగినవారు మా దగ్గర తయారయిన వారిలో ఎవరూ లేరు అనే స్థితిలో మన తెలుగు శాఖలు వున్నాయి!

కొన్ని సంవత్సరాలుగా తెలుగు ఆధునిక విద్యని తయారుచేసే స్థానం కోల్పోయింది. చేతనైనంతవరకూ ఆధునిక విజ్ఞానులకి సమాచారాన్ని అందించే స్థానంలోనే వుంది. ప్రపంచవిజ్ఞానం పశ్చిమ దేశాల్లో ఎలానూ తయారవుతోంది కదా, మనం దానిని ఎరువు తెచ్చుకుని వాడుకుంటే చాలు, అదే గొప్ప అనే స్థాయి నుంచి, మన దగ్గర ఆధునిక ప్రపంచం నేర్చుకోవలసిన ఆలోచనలూ, విధానాలూ ఉన్నాయని మనం వారికి చెప్పగలిగేలా ఎదగాలి. ప్రపంచీకరణ అంటే ఎరువు తెచ్చుకోవడమే కాదు, ఎరువు ఇవ్వడం కూడా అని తెలుగు విద్యార్థులూ, విశ్వవిద్యాలయాల తెలుగు శాఖలూ గుర్తించాలి. తెలుగు అంతర్జాతీయ భాష అవడానికి మనం చాలా దూరం ప్రయాణం చెయ్యాలి. ఆ ప్రయాణం విశ్వవిద్యాలయాల తెలుగు శాఖల్లో మొదలవాలి.

*(ఆంధ్రజ్యోతి దినపత్రిక (25-5-2015) సౌజన్యంతో...*

**ఆచార్య వెల్చేరు నారాయణరావు**

యు.ఎస్.ఎ. ఫోన్: 001 608-335-8979

## గ్రంథాలయం, సభలు-సమావేశాలు శీర్షికలు

మా కార్యాలయానికి సమీక్షకోసం వచ్చే పుస్తకాలను కనీసం గ్రంథాలయ శీర్షికన పరిచయం చేయగలం. వచ్చే సంచికనుండి ఈ శీర్షిక మొదలవుతుంది.

సభలు సమావేశాలు శీర్షిక కూడా వచ్చే సంచికనుండి మొదలవుతుంది. ఇందులో ప్రచురణకై పంపే ఫోటో వెనుక తేదీ, సమయం, స్థలం వివరాలను పేర్కొనాలి. ఆహ్వానపత్రికను కూడా జతపరచాలి.

## జనవాణి

వివిధ అంశాలపై మీ అభిప్రాయాలు, విమర్శలు, ప్రతిపాదనలు వ్రాయండి. పత్రికలో ప్రచురించని అంశాలపై కూడా వ్రాయవచ్చు. వీటిని జనవాణి శీర్షికలో ఇస్తాము. (ఈ సంచికలో 26, 27 పుటలు చూడండి.

## సందేహాలు, సమాధానాలు

సందేహాలను, ప్రశ్నలను సంపాదకుని ఉద్దేశించి పంపవచ్చు. వాటికి పత్రికలోనే సమాధానాలు ప్రచురిస్తాము.


డా॥ సామల రమేష్‌బాబు, సంపాదకుడు **'అమ్మనుడి'**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి,
మాచవరం, విజయవాడ-520004.
ఫోన్ : 9848016136, 0866-2439466
e-mail: ammanudi@gmail.com


**కవిత**

# నేల నెర్రెలనుండి ఓ సవ్వడి

మౌనం ఒక నిస్వన సందేశం
మనం నిశ్శబ్దంగా ఎన్నో దృశ్యాలు
మననం చేసుకొంటాం
మన జీవితాల్ని కదిలించినవి
మనం జీవితాల్ని కదిలించినవి
కొన్ని సౌందర్యమైనవి, ఆర్ద్రమైనవి
దుఃఖకరమైనవి, సంతోషకరమైనవీను...
ఎవరో నిరంతరం మనల్ని నిర్బంధిస్తున్నారు
ఊపిరిపీల్చుకోకుండా మన ముఖపటాల్ని మూస్తున్నారు
ప్రకృతి కూడా మనిషిని నిర్బంధిస్తుంది
సూర్యకిరణాలు ఓజోను పొరను చీల్చుకొని
భూమిని తాకుతున్నప్పుడు నేల నెర్రెలిస్తుంది
వృద్ధులు శిశువులు అసువులు బాస్తున్నారు
ప్రకృతి ఒడిలో పెరిగిన బిడ్డలే
ప్రకృతి ప్రకోపానికి బలవుతున్నారు.
చెట్టు వేరు నరుకుతున్నవాడికి ఇంత ఆలోచన లేదు
నేపాల్‌లో భూకంపం వచ్చిందంటే
'మనకు రాలేదుగా' అనుకుంటున్నారు
భూమికి పేర్లు తెలియవు భూగోళానికి హద్దులు లేవు
హద్దులు నిర్మించిన చోటంతా బీటలు వారుతున్నాయి
ఎవరిని ఎవరు నియంత్రిస్తున్నారు
ఒక ప్రేమ పావురానికి కులం గోడ హద్దు
ఒక జీవన సంస్కృతీ వికాసానికి
అస్పృశ్య భావన ఒక హద్దు
మీరు విగ్రహాలను అలంకరించినంతగా
మనుషులను అలంకరించడం లేదు
మీ కల్మషాన్ని కడగడానికి పూనుకొని
నదులు మురికి ప్రవాహాలవుతున్నాయి
ఇక మంచి నీరు ఎక్కడ? స్వచ్ఛమైన గాలి ఎక్కడ?
మానవతా స్పృహ తగ్గేకొలది
సూర్యుడొక్కడే తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు
ఎన్నో వికృతులు మన ముందు నృత్యం చేస్తున్నాయి
తొలకరి చినుకుల కోసం
భూమి నోరు తెరిచి చూస్తుంది
నేలనెర్రెల నుండి ఓ సవ్వడి
ఇదొక నిగమన ఆగమనాల ఘర్షణ.

**డా॥ కత్తిపద్మారావు**

ఫోన్: 9849741695

అట్టపైబొమ్మ

- శ్రీమతి డి.పి. అనూరాధ

# రెండో బుద్ధుడు నాగార్జునుడు

**భారతదేశ తత్త్వవేత్తలలో, బౌద్ధాచార్యుల్లో ఆచార్య నాగార్జునుడి తరువాతే ఎవరైనా... బుద్ధుడి తరువాత అంతటివాడిగా నాగార్జునుడు ప్రసిద్ధి చెందాడు. ఆనాడు నాగార్జునుడు ఎంత ప్రఖ్యాతుడయ్యాడంటే ఆ తరువాతి కాలంలో చాలా మంది నాగార్జునులు పుట్టుకొచ్చారు. జైనంలో కూడా నాగార్జునుడి పేరుతో ఓ ఆచార్యుడు ఉండడం విశేషం...**

“**రెండో** బుద్ధుడు...

నాలుగు సూర్యుళ్లలో ఒకడు...

బౌద్ధాన్ని పునరుజ్జీవింపచేసినవాడు-

శూన్యవాదాన్ని ప్రవేశపెట్టినవాడు-

చైనా... జపాన్ తదితర తూర్పు ఆసియా దేశాలలో ఈనాటికీ పూజ్యనీయుడు...

ఇవి ఆచార్య నాగార్జునుడి గురించిన విశేషణాలు...

బుద్ధుడు నిర్యాణం చెందిన 400 ఏళ్ల తరువాత పుట్టిన నాగార్జునుడు బౌద్ధాన్ని ఎలా శాసించగలిగాడు.

నాగార్జునుడు ఎవరు? ఎక్కడ పుట్టాడు?

బౌద్ధం గురించి ఎలా తెలుసుకున్నాడు? మహాయానానికి పీఠిక రాసేలా ఎలా ఎదిగాడు?

శిష్యులకు పాఠాలు చెప్పే ఆచార్యుడికి శిల్పకళలో కూడా ప్రావీణ్యం ఉందా?

ఆచార్యుడి జీవితంలో ఈనాటికీ అంతుచిక్కని విషయాలు ఎన్నో...

అమరావతి స్థూపం ఈ నాగార్జునుడి ఆధ్వర్యంలోనే అపురూప శిల్పాల గనిలా రూపుదిద్దుకుంది.

నాగార్జున కొండ ఈయన పేరిటే నిలిచిపోయింది.

కానీ నాగార్జునకొండ పురావస్తు తవ్వకాలలో ఈ బౌద్ధాచార్యుడితో సరిపోల్చగల శిల్పం ఒక్కటి కూడా ఎందుకు బయట పడలేదు!

అందుకే కొంత మంది ఆచార్య నాగార్జునుడు మిథ్య అంటారు. కల్పిత పురుషుడు అంటారు.

అంతటి గొప్పవాడైతే ఆర్కియాలాజికల్ ఎవిడెన్స్ ఒక్కటైనా లభించాలి కదా అంటారు...

ఆర్కియాలజీ... పురావస్తు శాస్త్రం అనేది మనిషికి అస్థిపంజరంలా చరిత్ర పునర్నిర్మాణంలో ఎంతో కీలకమైంది.

ఆచార్య నాగార్జునుడికి సంబంధించిన కథలన్నీ పుక్కిటి పురాణాలా?

మరి ఇతడు వ్రాసిన గ్రంథాల మాటేమిటి?

ఇక్కడ కథ మళ్లీ మొదటికే వస్తుంది?

నాగార్జునుడు రాసినట్టుగా పేర్కొంటున్న ఏ గ్రంథం కూడా ఇప్పటివరకూ భారతదేశంలో లభ్యం కాలేదు... ఆచార్యుడు వ్రాసిన గ్రంథాల తర్జుమాలు చైనాలో... టిబెట్టులో వారి వారి భాషల్లో ఉన్నాయి.

అంటే ఆచార్యుడి అసలు గ్రంథాలు మన ఈ నేల మీద ఇప్పటి వరకూ బయట పడలేదు.

కానీ నిజం నిప్పులాంటి ది... నిదానంగా అయినా బయటపడుతుంది...



నాగార్జున సాగర్ స్థూపం

నాగార్జునుడి జీవిత చరిత్ర ఈ మధ్యే వెలుగులోకి వచ్చింది.

ఈ గ్రంథం చైనా భాషలో ఉంది. దీనిని రాసింది కుమారజీవుడు...

ఇతడి గురించి తెలుసుకోవాలంటే మనం చైనాలోని కిజిల్ పర్వతాల్లోని రాతి గుహల దగ్గరికి వెళ్లాలి. థౌజండ్‌బుద్ధాకేవ్స్ అని ఈ గుహలకు పేరు. ఈ గుహల ముందు కుమారజీవుడి శిల్పం ఉంది.

ఈయన సంస్కృత భాషలో ఉన్న బౌద్ధ గ్రంథాలను చైనీయుల భాషలోకి తర్జుమాచేసి చైనాలో గొప్ప బౌద్ధ గురువుగా పేరుతెచ్చుకున్నారు. వాస్తవానికి కుమారజీవుడు పుట్టిన ప్రదేశం నేటి కాశ్మీర్... ఇక్కడి నుంచే అతడు చైనా వెళ్లాడు.

ఇప్పటి కిజిల్ ఆనాటి సిల్క్‌రూట్‌లో భాగం కావడం విశేషం... క్రీ.శకం 405 ప్రాంతంలో కుమారజీవుడు నాగార్జునుడి జీవితగాథను చైనాభాషలోకి అనువదించాడు. ఈ జీవిత గాథ ప్రకారం... ఆచార్య నాగార్జునుడు దక్షిణభారతదేశంలో ఓ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. వేదవేదాంగాలు అభ్యసించాడు. బౌద్ధ ధర్మ ప్రభావితుడై హిమాలయాలకు వెళ్లి, మహాయాన ధర్మం గురించి పూర్తిగా చదివాడు. తన జీవితకాలంలో ఎక్కువభాగం సిరిపర్వతంలో గడిపాడు...

నేటి నాగార్జునకొండే సిరిపర్వతం లేక శ్రీపర్వతం అని శాసనాలవల్ల తెలుస్తోంది.

శ్రీధాన్యకటకానికి పశ్చిమాన శ్రీ పర్వతానికి తూర్పున ఉన్న

గ్రామంలో నాగార్జునుడు జన్మించినట్టు టిబెట్ గ్రంథాలు తెలియజేస్తున్నాయి. ఇది గుంటూరు జిల్లాలోని వేదలి కావచ్చని కొంతమంది చరిత్రకారుల అభిప్రాయం... అతడు ఖచ్చితంగా ఏ ఊరిలో జన్మించాడు అన్నదానిపై మరిన్ని పరిశోధనలు జరగాలి...

నాగార్జునుడి పుట్టుపూర్వోత్తరాలు ఓ మిస్టరీ. కానీ అతడు బౌద్ధానికి చేసినటువంటి సేవల గురించి మాత్రం అందరిలో ఏకాభిప్రాయం ఉంది. సుమారు 1800 సంవత్సరాల క్రితం పుట్టిన ఆచార్య నాగార్జునుడు తన జీవిత కాలంలో 20 పుస్తకాలు రాశాడు... ఇవన్నీ నేడు చైనా భాషలో లభ్యమవుతున్నాయి.

వీటిని తిరిగి భారతీయ భాషల్లోకి తర్జుమా చేసుకోవడం వల్ల అతడేమిటో, అతడు ప్రతిపాదించిన అమూల్యమైన సూత్రాలేమిటో అర్థం అవుతుంది. ఓ శాతవాహనరాజు నాగార్జునుడికి మిత్రుడు... అతడిని ఉద్దేశించి సుహృల్లేఖ, రత్నావళి అనే గ్రంథాలు రాశాడు.

ఈ చక్రవర్తే ఆచార్యుడికి శ్రీపర్వతంలో మహావిహారాన్ని నిర్మించాడు. అయిదు అంతస్థుల ఈ విహారంలో దిగువన 500 గదులు.. ఒకటో అంతస్థులో 400 గదులు... రెండో అంతస్థులో 300 గదులు... మూడో అంతస్థులో 200... నాలుగో అంతస్థులో 100 గదులు... ఆపైన ఆచార్యుడి నివాసం గ్రంథాలయం ఉండేవట. కొండపైనున్న ఊటనీళ్లు ప్రతి అంతస్తులోని గదినుంచి పారుతూ కిందకువచ్చేలా ఈ విహారాన్ని నిర్మించారు. తన సుహృల్లేఖలో వ్యక్తి సామాజిక సుఖశాంతులకు దోహదంచేసే నీతి సూత్రాలను నాగార్జునుడు ప్రతిపాదించాడు.

ఇతరులకు పూర్తిగా మంచిని చేసేదే సత్యమని నిర్వచించాడు.

బలహీనులను బలవంతులు దోచుకునే ఆటవిక సూత్రాల్ని నిరసించాడు.

నీతిశాస్త్రంపై ఆధారపడిన రాజనీతి, కరుణపై, ఆధారపడిన న్యాయశాస్త్రం అవసరమన్నాడు.

జీవించడానికి మాత్రమే ఆహారం తీసుకోవాలనీ, జూదం సోమరితనం పనికిరావని పేర్కొన్నాడు.

దండన ఎప్పుడూ కఠినంగా ఉండకూడదని, దోషిని సంస్కరించే విధంగా ఉండాలని సూచించాడు.

అంటే అన్నివందల ఏళ్ల నాడే నాగార్జునుడికి మానవ హక్కుల గురించి ఖచ్చితమైన అవగాహన ఉందన్నమాట.

సుహృల్లేఖలోని అంశాలను ఆనాడు పిల్లలు కంఠస్థం చేస్తున్నారనీ పెద్దలు అధ్యయనం చేస్తున్నారనీ క్రీస్తు శకం 7వ శతాబ్దిలో చైనా యాత్రీకుడు ఇత్సింగ్ తన రచనల్లో పేర్కొన్నాడు.

ఈనాటికీ కూడా టిబెట్‌లో బౌద్ధానికి ప్రాథమిక నియమావళిగా సుహృల్లేఖను చదవడం విశేషం.

నాగార్జునుడికి రెండో బుద్ధుడిగా ఎందుకు పేరు వచ్చింది?

బౌద్ధానికి అతడు అందించిన సేవలుఏమిటి?

నాగార్జునుడి 'మాగ్నమ్ ఓపస్‌గా' 'మాధ్యమిక కారిక'ను పేర్కొనాలి.

మాధ్యమిక కారక సిద్ధాంతాన్ని ఒక్కమాటలో చెప్పాలంటే పైకి కన్పించే ఈ ప్రపంచం వెనక ఆధారంగా, పునాదిగా ఏదీలేదు. ఈ ప్రపంచాన్ని మోసే స్వభావసారం ఏదీ లేదు.

ఇదే శూన్యవాదంగా పేరుతెచ్చుకుంది.

బౌద్ధ సారస్వతానికి అరిస్టాటిల్ మాధ్యమిక దర్శనానికి జీసస్.. మహాయానానికి సెయింట్‌పాల్ లాంటివాడు నాగార్జునుడు.

మహాయానానికి సంబంధించి మూడు గ్రంథాలను నాగులనుంచి నాగార్జునుడు సంగ్రహించాడు.

ఆనాడు కృష్ణానది ముఖద్వారాన్ని దేశంలోనూ, విదేశీ సమకాలీన సాహిత్యంలోనూ నాగలోకం అనడం పరిపాటి.

మహాయాన గ్రంథం ప్రజ్ఞాపారమితకు వ్యాఖ్యానం రాశాడు నాగార్జునుడు.

అప్పటివరకూ అస్తవ్యస్తంగా ఉన్న మహాయానాన్ని క్రమబద్ధీకరించాడు నాగార్జునుడు.

మహాయానంలో బుద్ధుడు మానవమాత్రుడు కాదు. దేవుడు. అంతేకాదు, శాశ్వతుడు, లోకోత్తరుడు.

మహాయానం బౌద్ధులకు బోధిసత్వ ధర్మాన్ని లక్ష్యంగా చేసింది. ప్రతిఒక్కరూ కూడా ధార్మిక కృషితో బోధిసత్వులుగా మారవచ్చు. బోధిసత్వులు ఏర్పడడం వల్ల బౌద్ధం.. భక్తి సంప్రదాయమైంది.

బుద్ధుడికి రూపం ఏర్పడింది. ఆరాధనోత్సవాలు ప్రారంభమయ్యాయి. వైదిక, జైన మతాలు ఆధిక్యతతో ఉన్న సమయంలో ఆచార్య నాగార్జునుడు మహాయానానికి సరికొత్త భాష్యాన్ని చెప్పి బౌద్ధానికి పూర్వ వైభవాన్ని తీసుకువచ్చాడు.

బౌద్ధాన్ని పునరుజ్జీవింపచేశాడు.

అందుకే రెండో బుద్ధుడిగా పేరు తెచ్చుకున్నాడు.

ఇది భారతదేశంలోనే కాదు తూర్పు ఆసియా అంతటా ... ప్రాకింది. అసలు ఆనాడు శ్రీపర్వతం మహాయాన బౌద్ధ ప్రధాన కేంద్రం. ఇది బౌద్ధులందరికీ యాత్రచేసి దర్శించవలసిన పుణ్యక్షేత్రం. శాతవాహనుల కాలంలో దేశం మొత్తంలో తెలుగు నేల బౌద్ధానికి ప్రధాన కేంద్రమైంది.

మౌర్యుల తరువాత మగధను పాలించిన శుంగ, కణ్వ వంశజులు వైదిక ధర్మానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు.

ఆ కాలంలోనే మహాసాంఘికులు దక్షిణానికి ముఖ్యంగా మన తెలుగు ప్రాంతానికి వచ్చి ఇక్కడ బౌద్ధం వ్యాప్తి చెందేలా చేశారు.

దేశ విదేశాలనుంచి ఎందరో మన తెలుగు నేలకు వచ్చేవారు. బౌద్ధులకే కాదు, సామాన్యులకూ ఈ ప్రాంతం దర్శనీయ ప్రదేశం అయింది.

ఇత్సింగ్, యువాన్‌త్సాంగ్‌లాంటి చైనా యాత్రీకులు ఎందరో ఇక్కడికి వచ్చారు. అధ్యయనాలు చేశారు.

ఇక్కడినుంచి తిరిగి వెళుతూ వెళుతూ ఎన్నో బౌద్ధ గ్రంథాలను తమ పడవల్లో తీసుకువెళ్లారు.

అలా మన సంపద ఎంత తరలిపోయిందో...

❑ ❑ ❑

తొలి శతాబ్దిలోనే ఇంతటి ఘనకీర్తిని కట్టుకున్న మన తెలుగు నేల నేడు సాంస్కృతికంగా వెలవెలబోతోంది.

అమరావతి శిల్పాలన్నీ ఇతర దేశాలకు వెళ్లిపోయాయి.

అలనాటి శ్రీపర్వతం నాగార్జునసాగర్ నిర్మాణంలో మునిగిపోయింది.

ఆనాటి గ్రంథాలన్నీ విదేశాలకు తరలిపోయాయి.

ఇప్పుడు మనం నాగార్జునుడి గురించి తెలుసుకోవాలంటే టిబెట్, చైనాదేశాలవారి గ్రంథాలను తిరగెయ్యాలి.

ఒక్క నాగార్జునుడే కాదు బౌద్ధానికి మెరుగులు దిద్దిన ఎందరో గురువులకు మన తెలుగునేల పురుడు పోసింది.

కానీ వారి గురించి తెలుసుకోవాలంటే మాత్రం – విదేశీ నేలలపై ఆధారపడవలసిందే.

జెన్ బౌద్ధానికి మూలపురుషుడు బోధిధర్ముడు.

షావ్‌లిన్ మార్షల్ ఆర్ట్స్ రూపకర్త బోధిధర్ముడే.

తూర్పు ఆసియా దేశాలలో జెన్ బౌద్ధానికి ఆదరణ ఎక్కువ.

చైనా, జపాన్ తదితర దేశాలలో బోధిధర్ముడు ఆరాధ్యదేవుడు. పల్లవరాజు రెండో సింహవర్మకు మూడవ కుమారుడు బోధిధర్ముడు. క్రీస్తుశకం 440లో కాంచీపురంలో బోధిధర్ముడు జన్మించాడు.

బౌద్ధాన్ని స్వీకరించి మహాబలిపురం నుంచి మలై ద్వీపాలమీదుగా చైనా వెళ్లాడు.

శాక్యముని బుద్ధుడి తరువాత 28వ బౌద్ధగురువుగా బోధిధర్ముడు పేరుతెచ్చుకొన్నాడు. చైనాలో ఉన్న ఈయన సమాధికి ప్రజలు నీరాజనాలు అర్పించడం విశేషం.

శ్రీలంకలో గొప్ప ఆచార్యుడిగా పేరుతెచ్చుకున్న బుద్ధఘోషుడు మన తెలుగువాడు. బుద్ధఘోషుడి స్వస్థలం గుంటూరు జిల్లాలోని పల్నాడు అని చరిత్రకారులఅభిప్రాయం.

బుద్ధఘోషుడు ఇక్కడినుంచి శ్రీలంకకు వెళ్లాడు. అక్కడ అనురాధపురంలోని మోనాస్టరీలో తమ జీవితాన్ని గడిపాడు.

త్రిపిటకాలకు వ్యాఖ్యానం వ్రాశాడు. విసుద్ధమగ్గ అనే మహాకృతిని రచించాడు. సింహళ వ్యాఖ్యానాలను మాగధిలోకి అనువదించాడు.

బుద్ధఘోషుడికి భిన్నమైన కథనం ఆర్యదేవుడిది.

ఆర్యదేవుడు రెండో నాగార్జునుడిగా పేరు తెచ్చుకున్నాడు.

నాగార్జునుడి ప్రియశిష్యుడు.

శ్రీలంకలో మహాయాన బౌద్ధానికి ఆదరణ తగ్గటంతో శ్రీపర్వతం వచ్చాడట. గొప్ప మహాయాన కేంద్రంగా పేరుతెచ్చుకున్న శ్రీపర్వతంలో ఆనాడు సింహళ విహారం అని ప్రత్యేకంగా ఉండేది.

నాగార్జునుడిని కలుసుకున్న ఆర్యదేవుడు ఆయన శిష్యుడిగా మారాడు. ఆచార్యుడి మాధ్యమిక తాత్విక దృక్పథాన్ని మరింత ముందుకు తీసుకువెళ్లాడు. నాగార్జునుడి శూన్యవాదాన్ని సమర్థిస్తూ ప్రత్యర్థుల సిద్ధాంతాలను ఖండించాడు. ఇవన్నీ హుయాన్‌త్సాంగ్ రచనలవల్ల తెలుస్తున్నాయి.

అయితే దీనికి వేరుగా టిబెట్ గ్రంథాలు ఆర్యదేవుడు దక్షిణ భారతీయుడని పేర్కొంటున్నాయి.

అయితే ఆర్యదేవుడు ఎలా ఉండేవాడో తెలుసుకోవాలంటే మాత్రం టిబెట్ లేదా చైనా వర్ణచిత్రాలపై ఆధారపడవలసిందే.

బౌద్ధానికి సంబందించి ఆరు రత్నాలుగా ప్రసిద్ధి చెందిన గురువుల్లో నలుగురు – నాగార్జునుడు, ఆర్యదేవుడు, దిన్నాగుడు, ధర్మకీర్తి మన తెలుగువారు కావడం విశేషం.

వారిలో ఏ ఒక్కరి గ్రంథం కూడా మన తెలుగు నేల మీద లభించలేదు.

బౌద్ధంలో పద్దెనిమిది శాఖలున్నాయి. వీటిలో తొమ్మిది తెలుగు నేలకి సంబంధించినవి కావడం విశేషం.

ఆచార్య నాగార్జునుడు తన జీవితకాలంలో చేసిన మరో ముఖ్యమైన కార్యం అమరావతి స్థూపాన్ని పునరుద్ధరించడం. ఈ దశలో అందమైన శిల్పాకృతులు స్థూపఫలకాలపై వెలిశాయి.

బీహార్‌లోని బుద్ధగయలోని మహాబోధి ఆలయానికి కూడా ఆచార్య నాగార్జునుడు మరమ్మత్తులు చేయించాడు. ఆలయం చుట్టూ చిన్న చిన్న స్థూపాలను నిర్మించాడని టిబెటన్ గురువు తారానాథుడు పేర్కొన్నాడు.

ఆచార్య నాగార్జునుడి మరణం కూడా ఓ మిస్టరీ. అనేక కథలు వ్యాప్తిలో ఉన్నాయి. ఓ శాతవాహన రాకుమారుడు రాజ్యాధికారంకోసం ఆచార్యుడిని చంపించాడని కొందరు అంటారు. ఆచార్యుడే జీవితాన్ని త్యజించదలచి తన గదిలో తలుపులు వేసుకున్నాడని మరికొన్ని కథలు పేర్కొంటున్నాయి.

ఇలా పుట్టుక నుంచి మరణం వరకూ ఆచార్య నాగార్జునుడి జీవితం అంతా ప్రహేళికలే. ఇప్పటివరకూ భారతదేశంలోపుట్టిన మేధావులందరిలోకి గొప్పవాడు ఆచార్య నాగార్జునుడు అంటూ జవహర్‌లాల్ నెహ్రూ తన డిస్కవరీ ఆఫ్ ఇండియాలో కీర్తించారు.

ప్రాచీన రోమన్లలా... చైనీయుల్లా.. అరబ్బుల్లా ఆనాటి భారతీయులు చక్కటి చరిత్రకారులు కాదు. అందుకే గొప్ప తాత్వికుడు బౌద్ధానికి దిశానిర్దేశం చేసిన నాగార్జునుడి జీవితానికి సంబంధించి ఖచ్చితమైన వివరాలు ఈనాటికీ తెలియవు. అయినా బౌద్ధం ఉన్నంతవరకూ నాగార్జునుడి పేరు కూడా నిలిచే ఉంటుంది.

**ఫోన్: 9010016555**

పిట్టచూపు

- శ్రీ చలసాని నరేంద్ర

# పరిపాలనపై రెండు ప్రభుత్వాలూ చూపు సారించాలి

**రెండు తెలుగు ప్రభుత్వాలు ప్రతి రోజూ ఏదో విధంగా పత్రికల్లో పతాక శీర్షికల్లో ఉండే ప్రయత్నం చేస్తున్నాయి. అంతేకాని ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించడం పట్ల చూపు సారించడం లేదు. గత ఎన్నికల్లో చేసిన హామీల అమలు పట్ల నిర్దిష్టమైన ప్రణాళికలను ప్రజల ముందు ఉంచడం లేదు.**

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రెండు రాష్ట్రాలుగా విభజన జరిగి, కొత్త రాష్ట్రాలు ఏర్పడి ఒక సంవత్సరం జరిగింది. రెండు తెలుగు రాష్ట్రాల ప్రభుత్వాలు తొలి వార్షికోత్సవాలను ఘనంగా జరుపుకొంటున్నాయి. తాము ప్రజలకు ఎంతో మేలు చేస్తున్నామని, భూలోక స్వర్గం సృష్టిస్తున్నామని ప్రజలను నమ్మించే ప్రయత్నం చేస్తున్నారు.

తెలంగాణ ముఖ్యమంత్రి కె చంద్రశేఖర్ రావు అయితే 'బంగారు తెలంగాణ' సాధిస్తానని చెబుతున్నారు. అందుకు ఎన్నో భారీ కార్యక్రమాలను ప్రకటిస్తున్నారు. ప్రతి ఇంటికి త్రాగు నీటి పంపు, ప్రతి పేదవానికి అందమైన ఫ్లాట్, ప్రతి యువకుడికి ఉద్యోగం.... వంటి ఆకర్షణీయమైన కలలను ప్రజల ముందుంచుతున్నారు.

మరోవంక ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యన్ చంద్రబాబు నాయుడు చూపు అంతా ప్రపంచ స్థాయి రాజధాని నగరం నిర్మాణంపైనే ఉంది. ప్రజల ముందు రాజధాని నగరం గురించి ఒక మధుర స్వప్నం ఉంచుతున్నారు. సింగపూర్ ప్రభుత్వ సహాయంతో రాజధాని ప్రాంతం గురించిన ప్లాన్ ను తయారు చేయించారు.

తమ ప్రభుత్వాల తొలి వార్షికోత్సవం సందర్భంగా తెలంగాణ ముఖ్యమంత్రి జూన్ 7 న నూతన పారిశ్రామిక విధానాన్ని విడుదల చేస్తున్నారు. పరిశ్రమలకోసం దరఖాస్తు చేసిన వారికి పదిహేను రోజుల్లో అనుమతులు అందించే ఏర్పాట్లు చేస్తున్నట్లు చెబుతున్నారు. పెట్టుబడిదారులను 'రెడ్ టేపిజం' వేధించకుండా, వారికి ఎర్రతివాచీని పరచి విమానాశ్రయం నుండి స్వాగతం పలుకుతామని చెబుతున్నారు.

చంద్రబాబు నాయుడు నూతన రాజధాని నగరం అమరావతికి జూన్ 6 న భూమి పూజ చేస్తున్నారు. ఇప్పటికే రాజధాని ప్రణాళికను విడుదల చేసారు. అయితే నిర్మాణ కార్యక్రమం అక్టోబర్ లో విజయ దశమికి ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ చేత శంకుస్థాపన చేసిన అనంతరం ప్రారంభిస్తామని అంటున్నారు.

శాసన మండలి ఎన్నికల సందర్భంగా తె.రా.స. నిలబెట్టిన అభ్యర్థులు (శాసన సభ్యుల నుండి ఎన్నికలో) అందరూ ఇతర పార్టీల నుండి ఫిరాయించిన వారే కావడం గమనార్హం. తమకు బలం లేక పోయినా ఒక అభ్యర్థిని అదనంగా నిలబెట్టడం ద్వారా భారీ ఎత్తున ఫిరాయింపు దారులను ప్రోత్సహించే ప్రయత్నం చేస్తున్నారు. ఈ ఎన్నికలే ఈ ప్రభుత్వ ధోరణిని వెల్లడి చేస్తున్నాయి. తెలుగు ప్రజలకు గౌరవాన్ని కలిగించడం లేదు.

చంద్రబాబు నాయుడు పరిపాలన తీరుపట్ల జిల్లాల్లో జరిగిన పార్టీ 'మినీ మహానాడు' లలో ఆ పార్టీ సీనియర్ నాయకులు చేసిన కొన్ని వాఖ్యానాలు వారిలో పేరుకుపోతున్న అసంతృప్తిని వెల్లడి చేస్తున్నాయి. ఉప ముఖ్యమంత్రి కె ఇ కృష్ణమూర్తి కర్నూలు జిల్లా గురించి తాను ఏ పని కోసం వెళ్ళినా మీ జిల్లాలో ముగ్గురే కదా గెలిచింది అని చులకనగా చూస్తున్నారని పేర్కొన్నారు. అయితే అత్యధిక సీట్లు ఓడిపోవడం ఎన్నికల ముందు కాంగ్రెస్ వారిని తీసుకొని సీట్లు ఇవ్వడం వల్లనే అంటూ ఆయన విరుచుకు పడటం గమనించాలి.

విజయనగరం జిల్లాలో సీనియర్ నాయకులు పతివాడ నారాయణ స్వామి ప్రజలకు ఇచ్చిన హామీలు అమలు కావడం లేదని వాపోయారు. గత సంవత్సర కాలంలో రెండు ప్రభుత్వాలు యువతకు కొత్తగా ఉద్యోగాలు కల్పించనే లేదు. ఎన్నికల వాగ్దానాలు అమలు పరచడానికి ఆర్థిక సమస్యలను కారణంగా చూపుతున్నాయి. అయితే ఎన్నికలకు ముందు ఎన్నికల కమీషన్‌కు పంపిన సమాధానంలో తాము చేసిన ఎన్నికల హామీలను అమలు చేయడానికి అవసరమైన వనరులు పుష్కలంగా ఉన్నాయని చెప్పిన సంగతిని గుర్తుంచుకోవాలి.

ఇక పరిపాలన పట్ల సరయిన దృష్టి సారించడం లేదని, ప్రభుత్వ పనితీరు గురించి సరిగ్గా పట్టించుకోవడం లేదని ఆర్ టి సి కార్మికుల సమ్మె మనకు వెల్లడి చేస్తుంది. రెండు తెలుగు రాష్ట్రాల్లో ఆర్ టి సి కార్మికులు జీతాల పెంపు కోసం సమ్మె చేయవలసి రావడం, ఎనిమిది రోజుల సమ్మె అనంతరం వారి డిమాండ్లకు రెండు ప్రభుత్వాలు ఆమోదం తెలపడంతో కథ సుఖాంతం అయింది. అయితే వారి డిమాండ్లు అకస్మాత్తుగా తలెత్తినవి కావు. ప్రభుత్వ ఉద్యోగుల జీతాల సవరణ ఎప్పుడు జరిగితే అప్పుడే ఆర్ టి సి ఉద్యోగులకు సహితం సవరించవలసి ఉంటుందని అందరికీ తెలుసు. ఆ వెంటనే తగు చర్యలు తీసుకొనివుంటే ఇటువంటి పరిస్థితులు ఏర్పడి ఉండేవి కావు.

ఆర్ టి సి ఉద్యోగులు సహితం 43 శాతం జీతాల పెంపు

డిమాండ్ చేసినా, ఆర్ టి సి ఆర్థిక పరిస్థితి కారణంగా అంత పెంపు సాధ్యం అని భావించి ఉండరు. రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులే ప్రభుత్వ ఉద్యోగులతో పాటు సమానంగా జీతాలు ఇస్తామని హామీలు ఇవ్వడం ద్వారా వారిలో అటువంటి ఆశలు రేకెత్తించారు. ఆ మొత్తం అడిగితే మధ్యే మార్గంగా కొంత మేరకు పెంచగలరని అనుకొన్నారు.

మే 13 న ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గ ఉప సంఘంతో జరిగిన చర్చల్లో సహితం తెలంగాణ ప్రభుత్వం ఎంత పెంచితే ఆ మేరకు పెంచాలని మాత్రమే కోరారు. అది కూడా సాధ్యం కాదంటూ ప్రభుత్వం మొండితనం ప్రదర్శిస్తూ వచ్చింది. అయితే అంతలో ఏమయిందో అకస్మాత్తుగా ప్రభుత్వం 43 శాతం పెంచడానికి ఒప్పుకొంది. మరో కొద్ది సేపటికి తెలంగాణ ముఖ్యమంత్రి కె చంద్రశేఖర్‌రావు ఉద్యోగులు కోరిన దానికన్నా మరో శాతం ఎక్కువగా 44 శాతం పెంపుదలకు అంగీకరించారు.

ముందురోజు వరకూ రెండు ప్రభుత్వాలు ఆర్థిక పరిస్థితులు జీతాల పెంపుకు దోహదపడవని, జీతాలు పెంచితే చార్జీలు పెంచి ప్రజలపై భారం మోపవలసి వస్తుందని అంటూ వచ్చాయి. అంతలో అకస్మాత్తుగా జీతాలు అడిగిన మేరకు పెంచడంతో పాటు సమ్మె కాలాన్ని సెలవుగా పరిగణించడం వంటి ప్రకటనలు సహితం చేసాయి. సమ్మె కారణంగా ఆర్ టి సి కి రెండు రాష్ట్రాల్లో సుమారు రు.200 కోట్ల మేరకు నష్టం వచ్చి ఉంటుంది. ఈ నష్టానికి ప్రభుత్వాల నిర్వాకమే కారణం అవుతుంది.

రెండు ప్రభుత్వాల వ్యవహారాల్లో అసలు పారదర్శకత లోపిస్తున్నది. సంచలనం కలిగించాలనే ఆరాటమేగాని నిర్దుష్టమైన ప్రణాళికలతో పరిపాలన సాగించే ప్రయత్నం జరగడం లేదు. ప్రధాన మంత్రి నరేంద్ర మోదీ 'స్వచ్ఛ భారత్ అభియాన్' ప్రారంభించినప్పుడు కె చంద్రశేఖర్ రావు పెద్దగా ఆసక్తి చూపలేదు. తెలంగాణలో ఎక్కడా ప్రభుత్వ పరంగా ఈ కార్యక్రమంలో ఎవ్వరూ పాల్గొనలేదు. అయితే త్వరలో జరుగనున్న గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికల్లో వోటర్లను ఆకట్టుకోవడానికి ఉపయోగ పడుతుందని అనుకోగానే అర్ధంతరంగా 'స్వచ్ఛ హైదరాబాద్' కార్యక్రమాన్ని చేపట్టి పెద్ద హడావుడి చేశారు.

ఈ సందర్భంగా హైదరాబాద్ లోని పేదలకు రెండు లక్షల నివాస ఫ్లాట్‌లు నిర్మించి ఇస్తామని ప్రకటించి, ఉస్మానియా యూనివర్సిటీ భూముల్లో సహితం ఫ్లాట్స్ నిర్మిస్తానని చెప్పి ఒక వివాదం సృష్టించారు. ఈ ప్రయత్నాన్ని ప్రతిపక్షాలు వ్యతిరేకిస్తుంటే తాను పేదలకు ఏదో చేస్తామనుకొంటే వారు అడ్డు వస్తున్నారని అంటూ పేదల సానుభూతి కోసం ప్రయత్నాలు చేస్తున్నారు.

రెండు ప్రభుత్వాలు ప్రతి రోజూ ఏదో విధంగా పత్రికల్లో పతాక శీర్షికల్లో ఉండే ప్రయత్నం చేస్తున్నాయి. అంతేకాని ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించడం పట్ల చూపు సారించడం లేదు. గత ఎన్నికల్లో చేసిన హామీల అమలు పట్ల నిర్దిష్టమైన ప్రణాళికలను ప్రజల ముందు ఉంచడం లేదు.

---

**రచయిత ఫోన్ : 9849569050**

## ఇవీ ముచ్చట్లు...




తెలుగుదేశం పార్టీవారి మహానాడులో తమ పార్టీని జాతీయ పార్టీగా ప్రకటించటంపై అక్కడకు ప్రతినిధులుగా వెళ్లివచ్చిన ఇద్దరు మిత్రులు మాటలాడుకొంటున్నారు. అందులో ఒకాయన పార్టీలో తొలినుండీ ఉన్నవాడు కాగా మరొకాయన కాంగ్రెసునుంచి ఇటీవలే ఇటు వచ్చేసిన వాడు. ఇద్దరికీ సందేహాలేవో వున్నాయి. మన పార్టీ పేరులోనే తెలుగువుంది కాని, ఎక్కడా మన పార్టీ తెలుగుకోసం చేసిందీ, చేస్తున్నదీ ఏమీలేదు కదా! ఆంధ్ర, తెలంగాణలు దాటి చుట్టుప్రక్కల రాష్ట్రాల్లో పోటీచేస్తే మనం పార్టీ పేరు మార్చుకోవాలా అని ఒకాయన అన్నాడు. రెండో ఆయనైతే ఇంకాస్త ముందుకు పోయి, అయితే ఇక చంద్రబాబుగారు జాతీయస్థాయికి వెళ్తారన్నమాట. ప్రధానమంత్రో, మరొక పదవో ఆయన్ను వరించవచ్చునన్నమాట! అన్నాడు. ఈ సందేహాల్ని తేల్చుకోలేక ఒక సీనియర్ నాయకుణ్ణి ఇవే అడిగారు. ఆయన ఒక నవ్వునవ్వి తాపీగా వివరించాడు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌కే పరిమితమైన మన పార్టీ ఇప్పుడు ఆంధ్రాపార్టీ అయిపోయింది. తెలంగాణలోకూడా మేమే అధికారంలోకి రావాల్సిందే అంటున్నాడు బాబుగారు. కేసీఆరేమో ఆంధ్రాపార్టీకి తెలంగాణలో ఏం పని అంటూ మీ పార్టీ అంతు చూస్తానంటున్నాడు. ఈ పరిస్థితుల్లో ఇతర రాష్ట్రాల్లో తెలుగువారున్నచోట పోటీ చేస్తే కొన్ని ఓట్లు, వీలయితే రెండోమూడో సీట్లు వస్తాయి. అప్పుడు ఎన్నికల కమీషన్‌లో జాతీయపార్టీగా గుర్తింపు తెచ్చుకోవచ్చు. ఇదీ బాబుగారి ఎత్తుగడ! అంతేగాని తెలుగునో తెలుగువాళ్లను ఉద్ధరించడానికో చేస్తున్న ఆలోచన కానేకాదు అని అసలు సంగతేమిటో చెప్పేశాడు.

ఆ ఇద్దరికీ 'తత్త్వం బోధపడింది'.

సాహిత్యం శాస్త్రీయత

– ఆచార్య పులికొండ సుబ్బారావు

# భగవంతుడు సొంతంగా చిరునామా రాసుకున్న పద్యం అది..

**ఈ అనంత విశ్వం దీని సృష్టి దీని లయం దీని అంతటికీ వెనుక ఉన్న శక్తినే నేను భగవంతుడు అని అంటున్నాను, అని పోతన చాలా స్పష్టంగా ఈ గజేంద్ర మోక్షఘట్టంలో చెప్పడాన్ని చూడవచ్చు. బమ్మెర పోతన ఈ భావాన్ని చేసి నేటికి ఆరువందల సంవత్సరాలు దాటింది. ఆరువందల సంవత్సరాల తర్వాత కూడా సృష్టి రచన అనంత విశ్వనిర్మాణం వెనుక పని చేస్తున్న బ్రెయిన్ (శక్తిని) గురించే నేటికీ శాస్త్రవేత్తలు పరిశోధనలు చేస్తున్నారు.**

ప్రతి కవి తన కృతిలో తన చిరునామాను రాసుకుంటాడు. ప్రతిభావంతుడైన ప్రతి కవీ ఈ పని చేస్తాడు. ఇక్కడ చిరునామా రాసుకుంటాడు అంటే తనదైన ప్రతిభను ప్రతిష్ఠించుకుంటాడు అని. మహాకవి పోతన గురించి ఆయన శైలిని గురించి ప్రత్యేకంగా ఇప్పుడు చెప్పవలసిన కొత్త అంశం ఇక్కడ లేదు. ఆయనకే సొంతం అయిన ఆయన శైలిని ఏనాడో పరిశోధకులు గుర్తించారు. పోతన కృతి శ్రీమదాంధ్ర మహాభాగవతంలో కవి చిరునామాతోపాటు దేవుడి చిరునామా కూడా ఉంది. అదీ దేవుడి చిరునామా అని – కవి అయిన పోతన గారు రాయలేదు. స్వయంగా భగవంతుడే వచ్చి తన చిరునామా రాసుకొని పోయాడు. అది ప్రత్యేకత కదా మరి! దాన్ని గురించే ఇక్కడ రాస్తున్నాను.

మహాకవులకు సంబంధించిన చాలా జానపద కథలు ప్రచారంలో ఉన్నాయి. తెలుగు కవులకు సంబంధించి కూడా చాలా అలాంటి కథలు ప్రచారంలో ఉన్నాయి. ఇక్కడ కథలు అంటే చారిత్రకంగా నమ్మదగినవి కావు అనే. బమ్మెర పోతన, శ్రీనాథులకు సంబంధించిన చాలా కథలు బాగా ప్రచారంలో ఉన్నాయి. వీరిద్దరూ బావ బావమరదులు అని, శ్రీనాథుడు స్వయానా తన చెల్లిని పోతన గారికిచ్చారని. వీరిద్దరి మధ్య సర్వజ్ఞసింగ భూపాలుని కారణంగా జగడం వచ్చిందని. సింగభూపాలునికి భాగవతాన్ని అంకితం ఇవ్వమని బాగా బలవంతంచేశాడని – ఇలా చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి. శ్రీనాథుడు పోతనలకు ఇలా చుట్టరికం ఉండేదా అనే చర్చ వీరేశ లింగం గారి కాలంలోనే జరిగింది. దీన్ని ఆనాటి పరిశోధకులే కొట్టి పారవేశారు. ఆరోజుల్లో ఇంత దూరాభారం సంబంధాలు ఇచ్చేవారు కారని ఏతావాతా అది రాజులకే సాధ్యం అని భావించారు. పోతన శ్రీనాథులు ఇద్దరూ సమకాలికులు అన్నది నిర్వివాదాంశం. ప్రజలలో ఉన్న ఈ ఐతిహ్యాలకు మూల సూత్రంగా నిలిచే అంశాలు కొన్ని ఉండవచ్చు. కాల క్రమంలో చాలా కల్పన పేరుకుపోతుంది. జానపద కథల్లో ఉండే మోటిఫ్ లు (కథాంశాలు) వీటికి చేరి మంచి ఐతిహ్యాలుగా ఇవి నిలిచి పోతాయి. ఈ కథలు మౌఖిక మాధ్యమంలో కొన్ని వందల సంవత్సరాలు ప్రయాణం చేసి కూడా సజీవంగా ఉంటాయి. ఇక పోతనకి శ్రీనాథుడుకి మధ్య ఉన్న కథలు ఇక్కడ ప్రధాన చర్చనీయాంశం కాదు కాబట్టి దీన్ని ఇక్కడ వదిలేస్తే. దేవుడు స్వయంగా తన చిరునామా ఎక్కడ రాసుకున్నాడు. ఎలా రాసుకున్నాడు అనే విషయాన్ని ఇక్కడ చర్చ చేద్దాం.

దేవుడు చిరునామా రాసుకున్నాడు అనేది కూడా చరిత్ర నిరూపించిన సత్యం అని ఇక్కడ చెప్పడం లేదు. ఇది కూడా ఐతిహ్యామే. పోతన గారు తన మహాభాగవతం రచనా క్రమంలో గజేంద్ర మోక్షం ఘట్టాన్ని రాస్తున్నారు. ఒక చోటికి వచ్చి గంటం ఆగింది. ఆఘట్టంలో వైకుంఠంలో ఉన్న విష్ణుమూర్తిని గురించి రాయాలి. ఆయన ఉండేది వైకుంఠంలో అని అయితే పోతన గారికి తెలుసు. కాని ఆ మహా పట్టణంలో ఎక్కడ ఎలా ఏ వీధిలో నెలకొని ఉన్నారు. ఈ వివరాలు రాయడానికి ఊహ అందలేదు. గంటం ఆగిపోయింది. రాయలేకపోయారు. కాసేపు అలా బయటికి పోయి ఆలోచించుకొని వచ్చి రాద్దామనుకొని బయటికి, తనకిష్టమైన గోదావరి తీరానికి వెళ్ళారు పోతన. తిరిగి వచ్చారు. కూతురు కాళ్ళకి నీళ్ళు ఇచ్చింది. కడుక్కొని పూజా మందిరంలో ఉన్న తన తాటాకుల పుస్తకం దగ్గరికి వెళ్ళారు. పద్యం పూర్తి చేశారు. తిరిగి బయటికి వెళ్ళి పోయారు. ఇంతలో ఇంకో పోతన గారు వచ్చారు. లక్ష్మీ – రా, పద్యం పూర్తి చేద్దాం అని తన కూతురిని పిలుస్తూ కాళ్ళు కడిగే జాలారి బండ దగ్గరికి పోయారు. కూతురు కాళ్ళుకడిగింది. కాని, ఇదేంటి నాన్నా ఇలా అంటావు. ఇప్పుడే నీవు వచ్చి పద్యం పూర్తి చేసి బయటికి వెళ్ళావు కదా అన్నది. తాను రావడం ఏమిటి, పద్యం పూర్తి చేయడం ఏమిటి. నేను రాలేదమ్మా. ఈ చిత్రం ఏమిటో చూద్దాం రా. అని ఇద్దరూ పూజగదికి పోయారు. తాటాకు కట్టని విప్పి చూస్తే పద్యం పూర్తి చేసి ఉంది. పోతన ఆశ్చర్యానికి ఆనందానికి భక్తి తన్మయతకి హద్దేలేకుండా పోయింది. ఒక అనిర్వచనీయానందాన్ని పొంది. అమ్మా వచ్చింది నీ తండ్రి కాదమ్మా నీకు నాకు ప్రపంచానికి అంతటికీ తండ్రి అయిన శ్రీమన్నారాయణుడు. ఇది ఆయన మహిమే నమ్మా అని అన్నాడు. అలా దేవుడు తన చిరునామా స్వయంగా రాసుకున్న ఆ పద్యం ఇదే..

*అల వైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబు దా*
*పల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో*
*త్పల పర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి*
*హ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.*

పైన దేవుడి చిరునామా చూడండి. అది వైకుంఠ పురం, అంటే చాలా పెద్ద మహాపట్టణం, అందులో నగరి అంటే అంతఃపురం. దానిలో మూల సౌధం. మూల సౌధం అంటే మూలకు ఉండేది అని కాదు. మొత్తానికి మూలంగా ఉన్న ప్రధానమైన సౌధం. దానికి దాపులో మందార వనం, దాని పక్కన అమృతంతో కూడిన సరస్సు. అంటే అమృతాన్నే అంత పోశారని చెప్పక పోయినా, తియ్యటి తాగే నీరున్న సరస్సు అని చెప్పవచ్చు. దీని పక్కనే చంద్రకాంత శిలా వేదిక. దానిపైన కలువలు పరచిన పానుపు, సరిగ్గా అక్కడ శ్రీవారు స్వయాన తన పట్టమహిషి అయిన లక్ష్మీదేవి గారితో పాచికలు ఆడుతూ వినోదిస్తున్నారు. ఇది చిరునామా.

పోతన భాగవతాన్ని బాగా ప్రేమతో చదువుకున్నవారికి బాగా లోతుగా అధ్యయనం చేసిన వారికి ఒక సందేహం కలుగుతుంది. ఇది పోతన గారు రాయలేనంత క్లిష్టమైన పద్యమా. ఇది ఆయన రాయలేకపోతే, సాక్షాత్తు విష్ణువే వచ్చి రాసి వెళ్ళాడా. ఈ కథ నిజమేనా అని అనిపిస్తుంది. కాని ప్రజల్లోకి ఈ కథ వచ్చింది అంటే దీనికి మూలసూత్రమైన ఘట్టం చిన్నపాటిదైనా ఏదైనా జరిగి ఉండవచ్చని అనిపిస్తుంది. పోతన గారు ఎప్పుడూ చెపుతుంటారు. ఇది కేవలం వినయాన్ని ప్రకటించడానికి చేసేది కాదు ఆ ప్రకటన ఏమంటే ఇది నేను రాసేది కాదు. నేను రాసింది కాదు. ఇది స్వయంగా ఆ రామచంద్రుడే పలికేది ఆయన పలికిస్తే నేను పలుకుతున్నాను– అని చెప్పుకున్నాడు. ఈ కథలో ఇంకా నమ్మడానికి వీలు లేని క్రమం ఏమంటే. ఆ రోజుల్లో కవులు కూర్చుని గంటం పట్టుకొని రాయలేదు. వాళ్ళు పద్యాన్ని ఆశువుగా చెబుతూ పోయేవారు. అప్పటికప్పుడే కాని తర్వాత కాని శిష్యులు వినుకుంటూ గంటంతో రాసేవారు. ఈ క్రమాన్ని చెప్పే ఐతిహ్యాలు కూడా చాలా ఉన్నాయి మనకు. కవి పుస్తకాన్ని రాయడానికి మొదలు పెడితే సమయం అంతా దానికే పోయేది. మరో పని సాధారణంగా కుదిరేది కాదు. కారణం తాటాకు మీద గంటంతో రాయడానికి చాలా సమయం పడుతుంది. ఒక ఆకు పూర్తి చేయడానికి కనీసం రెండు గంటలు పడుతుంది అదీ బాగా అలవాటుగా రాసేవారికే. అందుకే కవులు వారి పోషణకు వేరే వారి మీద ఆధార పడవలసి వచ్చేది. అయితే పోతనకు కాస్త చెలక ఉంది. దాన్ని దున్నుకొని జీవిక పొందేవాడు. దేవుడిచ్చిన శరీరాన్ని పోషించుకోవడానికి చిక్కులేదన్న ధీమావల్లనే రాజాశ్రయాన్ని ధిక్కరించగలిగాడు. అధఃకరించగలిగాడు. ఇక్కడి విషయం ఈ పద్యంలో పోతన్నగారు బాగా ఆలోచించి ఆలోచించి రాయలేక, ఆలోచన రాక, లేచి పోవలసినంత క్లిష్టమైనది కాదు. వస్తువు పరంగా నిర్మాణపరంగా చాలా క్లిష్టమైన పద్యాలు పోతన గారు అలవోకగా రాశారు. కాని ఈ పద్యాన్ని భగవంతుడే రాశాడు అనే ఐతిహ్యం ప్రజల్లో నేటికీ చాలా బలంగా ఉంది. నా చిన్న తనంలో మా నాన్నగారు పోతన శ్రీనాథుడు– కథలన్నీ చాలా వివరంగా చెప్పేవారు. అది ఎలాగంటే ఇటీవలే చూచిన సినిమా కథను చెప్పినంత తేలిగ్గా అంత ఆసక్తితో చెప్పేవాడు. అంతేకాదు మా ఊర్లో చాలా మంది ఈకథ చెప్పేవారు. ఈ ఘట్టాన్ని ఇందులో చాలా పద్యాల్ని అలవోకగా చెప్పేవారు. ప్రజల్లో బాగా ప్రచలితంగా ఉన్న భాగవత భాగం ఇది. ఇక ఈ పద్యం తర్వాత విష్ణు మూర్తి బయలు దేరిన ఘట్టం, ఆతీరు అంతా చాలా వివరంగా వర్ణించడం ఉంది.

ఈ పద్యాన్ని కాని, ఈ ఘట్టాన్ని కాని రాయడంలో పోతన గారు చాలా ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నారని చెప్పడానికి చాలా ఆధారాలున్నాయి. భగవంతుడి చిరునామా చెప్పడమే కాదు, ఆయన మూల రూపాన్ని గురించి చెప్పాడు. ఈ అనంత విశ్వంలో ఆయన చిరునామా ఎక్కడ అని కూడా పోతన చెప్పాడు. భగవంతుడి చిరునామా చెప్పిన పద్యం ఇదొక్కటే కాదు. గజేంద్ర మోక్ష ఘట్టంలో ఇంకా కొన్ని పద్యాలున్నాయి. భగవంతుని భావనను పోతన చాలా ప్రతిభావంతంగా ఆవిష్కరించారు ఈ గజేంద్ర ఘట్టంలోనే. ఈ పద్యాలు ఆయన మౌలికమైన భగవద్భావనని పట్టిస్తాయి.

*లోకంబులు లోకేశులు*
*లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగు పెం*
*జీకటి కవ్వల నెవ్వం*
*డే కాకృతి వెలుఁగు నతని నే సేవింతున్.*

ఈ లోకాలు (గ్రహాలు) అన్నింటికి ఆవల పెన్‌జీకటికి ఆవల వెలుగు రూపంలో ఉండే వాడు దేవుడు అని చెప్పాడు. అతనిని సేవిస్తానన్నాడు. లోకాలు, లోకాలని పాలించే రాజులు, లోకస్థులైన ప్రజలు పోయిన తర్వాత ఉండే అలోకమే పెను చీకటి అని కూడా అంటాడు. ఈ రోజు మహా మహా శాస్త్రవేత్తలు కూడా ఈ విశ్వసృష్టి వెనుక –ఇంత ప్రకృష్టమైన నిర్మాణం వ్యవస్థలు కలిగిన ఈ విశ్వసృష్టి వెనుక –చాలా పెద్ద ధీశక్తి (బ్రెయిన్) ఉందని చెబుతున్నారు. నోబెల్ బహుమతి పొందిన శాస్త్రజ్ఞులు గ్రహాలను మింగివేసే కృష్ణబిలాల గురించి (బ్లాక్ హోల్స్) అంటే అనంతమైన చీకటి గురించి చెబుతున్నారు. 50 మంది నోబెల్ శాస్త్రవేత్తలు దేవుని గురించిన వారి భావన చెప్పే ప్రత్యేకమైన పుస్తకమే ఉంది. ఈ లోకాల తుదిన, పెనుచీకటికి ఆవల, అతీతంగా వెలుగు రూపంలో ఉన్నాడు భగవంతుడు అని పోతన గారు భగవంతుని శాశ్వత మైన చిరునామాని ఇక్కడ ఈ పద్యంలో చెప్పాడు. అంతే కాదు భగవంతుని స్వరూపాన్ని గురించి, ఆడా, మగా అనే విషయాన్ని కూడా ఇక్కడే చాలా వివరంగా చెప్పాడు పోతన.

స్త్రీ నపుంసక పురుష మూర్తియునుఁ గాక
తిర్య గమర నరాది మూర్తియునుఁ గాక
కర్మ గుణ భేద స దసత్ప్రకాశిఁ గాక
వెనుక నన్నియుఁ దా నగు విభుఁ దలంతు.

భగవంతుడనే భావనకి స్త్రీ పురుష భేదం లేదు. అది జంతువా మనిషా అనే భేదం కూడా లేదు. కర్మ గుణ భేదం కాని సత్ అసత్ అనే భేదంకాని లేదు. అన్నీ తానే అయ్యే ఆ విభుని తలచుతాను అని గజేంద్రుడు అన్నట్లు రాశాడు. ఇక్కడ పోతన భగవద్భావన స్పష్టం. విష్ణుమూర్తి అవతారాలు అన్నీ రాసే ప్రణాళికతో ఆయన కథలు ఆయన భక్తుల అంటే భాగవతోత్తముల కథలు రాసే ప్రణాళికతో భాగవతం రాసే పోతన ఈ అన్ని రూపాలకు మూలమైన భగవద్ భావన గురించి రూపం లేని గుణం లేని జండర్ లేని ఒక మూల భావన గురించి రాయడం ఈ విశ్వమంతా వ్యాపించి ఆయన ఉండడం ప్రతి జీవిలోను ఉండే శక్తి అది అని చెప్పడం ఇక్కడ గజేంద్ర మోక్షఘట్టంలోనే చాలా

వివరంగా చెప్పాడు పోతన.

ఈ జగత్తు ఎవ్వడితో పుట్టించబడుతుందో, ఎవడి కారణంగా లీనమౌతుందో తిరిగి ఎవ్వడికారణంగా సృష్టించబడుతుందో సర్వమూ తానే అయిన వాడు భగవంతుడు అని చెప్పడం గమనించాలి. బ్రహ్మ, ఈశ్వరుడు, విష్ణువు అంతా కూడా ఒకటే అని మరొక పద్యంలో చెబుతాడు. ఇక్కడ పురుష పరంగా వాక్య రచన సాగినా ఇది వాక్యరచనా సౌలభ్యం కోసం చెప్పడమే కాని, భగవంతుడు పురుషుడు అనే భావాన్ని ఇది ధ్వనించదు.

గజేంద్రుడు ఇంకా చాలా రకాలుగా చాలా భక్తితో ఆర్తితో చాలా పద్యాలలో భగవంతుని గురించి వేడుకుంటాడు. ఒక దశలో అందరూ ఉన్నావు అనే నీవు నిజంగా ఉన్నావా లేవా అని కూడా అనుమానంతో పిలుస్తాడు. దీని తర్వాత విష్ణువు వచ్చి చక్రాయుధంతో మొసలిని సంహరిస్తాడు. ఇంతలో ఆ మొసలి మాయమై అది ఒక గంధర్వుడిగా మారుతుంది. ఒక గంధర్వుడు శాపకారణంగా ఇలా మొసలి లాగా కొన్ని వేల సంవత్సరాలు ఆ కొలనులో ఉంటాడు. శాపవిమోచన తీరుకోసమే ఏనుగును పట్టడం, తర్వాత విష్ణువు రావడం జరిగింది. ఇది జానపద కథలో ఒక మోటిఫ్. కథా నాయకుడు ఒక కొలనులోనికి దిగడం, అక్కడ ఒక మొసలి అతనిని పట్టుకోవడం, అతను దానిని చంపగా అందమైన కన్యగా మారడం- లేదా దేవతగా మారి వరం ఇవ్వడం, ఇది కథాంశం. ఈ కథాంశం చాలా జానపద కథల్లో ఉంది. ఇక్కడ కూడా గజేంద్రుడు వేయి సంవత్సరాలు మొసలితో పోరాటం చేసి తర్వాత లావు ఒక్కింత కూడా లేదని చివరిసారిగా మొరపెట్టుకుంటాడు. ఈ మోటిఫ్ పాతాళ భైరవి కథలో ఉంది. ఇంకా చాలా కథల్లో ఉంది. కథానాయకుడు రాక్షసుని చంపితే, చావగానే, ఒక దేవత కాని దేవ కన్యకాని ప్రత్యక్షమై, కథానాయకుడికి వరాలివ్వడం కూడా ఇదే మోటిఫ్.

ఇక్కడ గజేంద్రుడు ఒక పాత్ర కావడం కేవలం ఒక మిష మాత్రమే. భక్తి భగవద్భావన అన్ని ప్రాణుల్లో ఉండవచ్చునని చెప్పే మరొక ఉద్దేశం కూడా ఇక్కడ ఉంది. భగవంతుని చిరునామా అంటే భగవద్భావన అనే అర్థం. భగవద్భావన పోతన చేసింది నేడు శాస్త్రజ్ఞులు చేసే భగవద్భావనకు చాలా దగ్గరగా ఉంది. ఒక చిన్న యంత్రం చేయడం వెనుకే ఎంతో ఆలోచనా క్రమం నిర్మితి ఉంటుంది. దీన్నే థాట్ ప్రోసెస్ అని అంటున్నాము. ఈ అనంత విశ్వం దీని సృష్టి దీని లయం దీని అంతటికీ వెనుక ఉన్న శక్తినే- నేను భగవంతుడు అని అంటున్నాను, అని పోతన చాలా స్పష్టంగా ఈ గజేంద్ర మోక్షఘట్టంలో చెప్పడాన్ని చూడవచ్చు. బమ్మెర పోతన ఈ భావాన్ని చేసి నేటికి ఆరువందల సంవత్సరాలు దాటింది. ఆరువందల సంవత్సరాల తర్వాత కూడా సృష్టి రచన అనంత విశ్వనిర్మాణం వెనుక పని చేస్తున్న బ్రెయిన్ (శక్తిని) గురించే నేటికీ శాస్త్రవేత్తలు పరిశోధనలు చేస్తున్నారు. దైవ కణాన్ని కనిపెట్టామని చెప్పడం లార్జ్ హెడ్రాన్ కోలిషన్, బిగ్ బాంగ్ సిద్ధాంతం, ఈ ప్రయత్నాలన్నీ కూడా ఈ విశ్వ నిర్మాణం గురించి ఆలోచించేవే. ఈ గజేంద్ర మోక్షఘట్టంలో ఇంకా చెప్పుకోవలసినవి చాలా ఉన్నాయి. మరొక వ్యాసంలో మరొక అంశాన్ని చెప్పుకోవచ్చు.

రచయిత ఫోన్ : 9440493604

జనవాణి

# గ్రంథాలయాలను కాపాడుకోవాలి

**రెం**డు రాష్ట్రాల పాలనకూ ప్రస్తుతం కేంద్రమైన భాగ్యనగరంలో అఫ్జుల్‌గంజ్‌లో సాలార్‌జంగ్ మ్యూజియానికి ఎదురుగా ఓ కేంద్ర గ్రంథాలయముంది. ఈమధ్య వచ్చిన నిధులతో భవనాన్ని దృఢపరచారు. క్రొత్తదనాన్ని తెచ్చారు. అందులో అడుగిడగానే బీరువాల్లో పుస్తకాలు మట్టిమశానంతో ఉంటాయి. గుడ్డిలో మెల్లగా తెలుగువిభాగం కొంత బాగానే వుంది. జ్ఞానమిచ్చే గ్రంథాలయాలలో ఏ భాష అయితేనేం? పాఠకులే పుస్తకాల్ని దులుపుకొంటూ తెల్లచొక్కాల్ని, నల్లచొక్కాలు చేసుకుంటూ చదువుకుంటూంటారు. బట్టల ఖరాబుకైనా అంగీకరిస్తారు కాని వారిలో ఇక్కడే డైరెక్టర్లున్నారు. వారిని కలుద్దాం. ఈ పరిస్థితిని చర్చిద్దాం అనుకోరు చాలామంది. ఒకవేళ అనుకుని వెళ్ళి మాట్లాడినవారికి అధికారుల జవాబు ఏకగ్రీవంగా "నిధులకొరత, సిబ్బంది కొరత" అని ఒకటి వస్తుంది. అయితే ఇంకా ఈ ప్రజాస్వామిక భారతదేశంలో ఎంతో శక్తిగల పౌరునికి తమ అభిప్రాయాన్ని ఆసేతుహిమాచలం పంపగల సత్తా ఒకే ఒక్క అర్థరూపాయి పోస్టుకార్డుకి వుంది. సంబంధిత మంత్రికో లేదా ముఖ్యమంత్రికో ఒక్క కార్డును పౌరబాధ్యతగా రాయవచ్చు కదా! మనతత్వం పట్టనితనమే అయితే, పాలనాతత్వం నిర్లక్ష్యమే అవుతుంది. కనీసం ఓ తెల్లకాగితం మీద సూచనల ఫిర్యాదుల పెట్టెలో మన అభిప్రాయాన్ని, అవసరాన్ని తెలపడంలో వెనుకబడివుండాలా?

### విజయవాడలోని ఒక ధార్మిక గ్రంథాలయం

విజయవాడలో బంగారుకొట్ల వీధి దగ్గర భ్రమరాంబా మల్లేశ్వర ఆంధ్రగ్రంథాలయం అని ఒకటి వుంది. ప్రధానంగా వైశ్యప్రముఖుల ఉదారసేవా వితరణల వల్ల ఆ పొత్తపు గుడి. భ్రమరాంబా మల్లేశ్వరుని గుడి దగ్గర – ఒకనాడు స్వర్ణయుగం వంటి దశల్ని చూసింది. ఇప్పుడు కొడిగట్టిన దీపంగా మసకమసక వెలుతుర్లో తెలుగు పొత్తా సరస్వతి దీనాతిదీనంగా వుంది. కాలనాళికల వంటి పాతకాలంనాటి ఆంధ్రపత్రికలు ఎక్కడో కాని దొరకనివి తెలుగువారి సాంస్కృతిక రాజకీయ చైతన్యచరిత్ర దీపికల్లాంటి ఆ ఆంధ్రపత్రికలూ మరికొన్ని బిలబిలమంటూ పెరిగిన చెదలు తినేశాయి. కమిటెడ్ సేవాపరులు తగ్గి నామమాత్రపు కమిటీలై ఆ గ్రంథాలయాన్ని పెంచరు, రక్షించరు లేదా సంరక్షణచేసే చేయగల సత్తా ఉన్న గ్రంథాలయాలకు గ్రంథనిధులు అప్పగించరు. తెలుగు పరిశోధకులకు పెన్నిధి అయి, విజయవాడ పెద్ద గ్రంథాలయాల్లో ఒకటైన జీర్ణాతిజీర్ణ దశలో ఉండడం ఎంత దారుణం. నాగరిక జనానికి విద్యావంతులకు బాధాకరం కాదా! భాషారక్షణలో సాహిత్యరక్షణ అందుకు గ్రంథాలయాల రక్షణ కూడా అవినాభావ సంబంధమైనదే. బంగారునగల కొట్లకు దగ్గర బంగారునగల్ని మించిన తెలుగువారి పత్రికలు, గ్రంథాలు మట్టిపట్టుకుకొట్టుకుపోతూంటూ తెలుగువారి అలసత్వమే కారణం కాని, ధనాభావం మాత్రం కారణం కాదు. ఒకవైపు గుడిగంటలు! మరొకవైపు నిర్లక్ష్యానికి గురౌతున్న పొత్తపు గుడిపంటలు.

**– సన్నిధానం నరసింహ శర్మ**
రచయిత ఫోన్: 9292055531

తెలుగు
కీర్తి పతాక

# పాలగుమ్మి పద్మరాజును మరచిన ప్రభుత్వం!

**- శ్రీ వేదగిరి రాంబాబు**



రాజమండ్రి సభలో మాట్లాడుతున్న వేదగిరి రాంబాబు. వేదికపై రాజమండ్రి ఎం.పి. మురళీమోహన్, కవి ఎండ్లూరి సుధాకర్, 'కళాగౌతమి' బులుసు ఎస్. మూర్తి, 'తెలుగు రథం' కొంపల్లి శర్మ

1951లో న్యూయార్క్ హెరాల్డ్‌ట్రిబ్యూన్ పత్రిక ప్రపంచ కథానికల పోటీని నిర్వహించింది. 23 దేశాలు ఈ పోటీలో పాల్గొన్నాయి.

మన రాష్ట్ర స్థాయిలో ఆంధ్రపత్రిక తెలుగు కథానికల పోటీని నిర్వహించి నాలుగు కథానికల్ని ఎంపిక చేసింది. ఇలా మనదేశంలోని ప్రతి భాష నుంచి, నాల్గేసి కథానికల్ని ఎంపిక చేసి, జాతీయ స్థాయి పోటీకి పంపాలి. జాతీయస్థాయిలో మొత్తం అయిదు కథానికల్ని ఎంపిక చేస్తారు. ఇలా 23 దేశాల కథానికల్ని న్యూయార్క్ హెరాల్డ్ పత్రికకి పంపారు. వాటిలో 'గాలివాన' కథానిక ద్వితీయ బహుమతి పొందింది.

రవీంద్రనాథ్‌టాగూర్ తర్వాత భారతీయ సాహిత్యానికి అంతర్జాతీయ పోటీలో బహుమతి తెచ్చిన రచన 'గాలివాన'. తెలుగు కథానిక వ్రాసిన పాలగుమ్మి పద్మరాజు గారికేకాదు భారతదేశానికే అంతర్జాతీయ స్థాయిలో ఎగురవేసిన కీర్తిబావుటా ఇది.

మరో సందర్భంలో ఓ విదేశీ ప్రచురణ సంస్థ పోలెండ్‌లో వున్న కె.సత్వర్‌సింగ్ సంపాదకత్వంలో భారతీయ గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబింపజేసే 13 కథానికలతో ఒక సంకలనాన్ని తేవాలనుకుంది. ఆ సంకలనంలో మొదటి కథానిక రవీంద్రనాథ్‌టాగూర్‌దైతే, పాలగుమ్మి పద్మరాజుగారి కథానిక పడవ ప్రయాణం (ఆన్ ది బోట్) చివరిది.

ఇవి చాలవా? తెలుగు కథానికకు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో పద్మరాజుగారు ఎంత కీర్తి తెచ్చారో చెప్పడానికి! బెంగాలీలో రవీంద్రనాథ్‌టాగూర్‌కి సమంగా తూగిన తెలుగు సాహితీవేత్త పాలగుమ్మి పద్మరాజు.

అంతర్జాతీయ స్థాయిలో తెలుగు కీర్తిని వ్యాపింపజేసిన పాలగుమ్మి శతజయంతి ప్రారంభమై పదకొండు నెలలు గడచిపోయినా చీమ కుట్టినట్లయినా లేదు - ఆయన జన్మించిన తెలుగు రాష్ట్రానికి. అసలు ఆయన గురించి ఈ మంత్రులు, అధికారులకు ఏమైనా తెలుసా? అనే అనుమానం కూడా కలుగుతోంది తెలుగు ప్రజలకు. వీళ్ళు ఓటు బ్యాంక్ కాదు కదా అని ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తోంది. కలం - విప్లవాల్ని లేవగలదు. ప్రభుత్వాల్ని కూల్చగలదు.



పాలగుమ్మి పద్మరాజు

రాజమండ్రి ఎమ్.పి. శ్రీ మురళీ మోహన్‌గారు పాలగుమ్మి పద్మరాజుగారు మా గురువుగారికి గురువుగారు, ముఖ్యమంత్రికి చెప్పి ఈయన శతజయంతిని ప్రభుత్వం తరపున జరిపిస్తానని రాజమండ్రిలో ఓ వేదిక మీద ప్రకటించారు. కొన్ని నెలల తర్వాత అక్కడే మరో వేదికమీద 'పాలగుమ్మి మంచి నాటక రచయితకూడా' కాబట్టి నాటక సప్తాహంలో ఓ రోజు ఆయన నివాళిగా జరుపుతామని మరో నీటిమూటని కట్టి ప్రజలమీదకి విసిరేశారు.

తెల్లబోయిన పాత్రికేయులు, రచయితలు ఆమాటే అడిగితే ఇది ప్రభుత్వ ఫంక్షన్ కదా.." అని తప్పించుకున్నారు.

ప్రభుత్వం అంత గొప్పవ్యక్తి శతజయంతిని జరపడమంటే తక్కువనేగా అర్థం!

మరోసారి రచయితలు కొందరు సెక్రటేరియట్‌లో మంత్రి పల్లె రఘునాథరెడ్డిగార్ని కలుసుకుని పాలగుమ్మి శతజయంతిని ప్రభుత్వం తరపున జరిపితే బాగుంటుందని కోరారట.

తప్పకుండా చేస్తామని ఆయన అన్నారుగాని ఆ రోజెప్పుడు వస్తుందో? జూన్ 24తో శతజయంతి ముగుస్తుంది.

అంతర్జాతీయ స్థాయిలో తెలుగుని మెరిపించిన పాలగుమ్మివారి శతజయంతిని ఆయన స్వంతజిల్లాలో అయినా జరిపిస్తే బాగుంటుందని పశ్చిమగోదావరి జిల్లా కలెక్టరుగారిని కొందరు రచయితలు సంప్రదించారు. మామూలే! ఆయన చేద్దామన్నారు. మాటమీద నిలబడనివారిలో రాజకీయ నాయకులకన్నా అధికారులేమైనా తక్కువ తిన్నవారా?

ఏం చేస్తారు మంత్రులు, అధికారులందరూ గోదావరి పుష్కరాల పనుల్లో వత్తిడిగా ఉన్నారు. పాపం వారెవ్వరికీ తెలీదు... గోదావరి ఒడ్డున పుట్టి పెరిగి, అక్కడినుంచే గోదావరికీ గోదావరి జిల్లాలకే కాదు. మొత్తం తెలుగు ప్రజలకూ - భారతదేశానికీ అంతర్జాతీయ గుర్తింపు తెచ్చినవారు పాలగుమ్మి పద్మరాజుగారు.

తెలుగువారు ఆరంభశూరులనేవారు. ఇప్పుడు తెలుగుదేశ ప్రభుత్వం అంటే - నేతి బీరకాయలోని నెయ్యనే నిరూపించుకొన్నారు.

## చెరగని స్ఫూర్తి
# తాపీ ధర్మారావు




సంపాదకులు:
**డా॥ నాగసూరి వేణుగోపాల్**
**డా॥ సామల రమేష్‌బాబు**

పత్రికల్లో సినిమాల్లో ప్రజల భాషను ప్రవేశపెట్టిన ఘనుడు
గొప్ప పత్రికా సంపాదకుడు, కవి, రచయిత, సంస్కర్త, విప్లవకారుడు
తాపీ ధర్మారావు (తాతాజీ) జీవితాన్ని, రచనలనూ విశ్లేషిస్తూ ప్రముఖులు
వ్రాసిన వ్యాసాల సంపుటి
ఎందరికో తెలియని సంగతులు, సమాచారం.

పుటలు : 212/-   వెల : రు.150 లు

పుస్తకం కావలసినవారు రూ.150 లను ఎం.ఒ గాని, బ్యాంక్ డ్రాఫ్టు గాని పంపాలి. సొమ్ము చేరిన వెంటనే పుస్తకాన్ని కొరియర్ ద్వారా గాని, రిజిష్టర్డ్ బుక్‌పోస్ట్ ద్వారా గాని పంపగలము. చిరునామా, ఫోన్ నెంబరుతో సహా తెలియపరచాలి.

**తాపీ ధర్మారావు వేదిక**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ - 520 004.
ఫోన్ : 9848016136  ఇ-మెయిల్ : taapivedika@gmail.com

పాలగుమ్మి శతజయంతిని ప్రభుత్వం జరపాలని రోజూ ప్రతి జిల్లాలోనూ ప్రజలు సభలు జరిపి కోరుతున్న వార్తలు రోజూ పత్రికలలో వస్తున్నాయి. అయినా ప్రభుత్వానికి తెలియడంలేదా? మంత్రుల, అధికారుల చెవులకు సోకటంలేదా? ఇదంతా ..... ముందు శంఖారావమేనా?

మాతృదేశాన్ని గౌరవించని మనిషి మనిషి కాడు, అక్కడి ప్రజల మాతృభాషని గౌరవించని ప్రభుత్వం ప్రభుత్వమూ కాదు. ఏ ప్రాంత ప్రజల సంస్కృతి సంప్రదాయమైనా, అక్కడి భాషలో నిబిఢీకృతమై ఉంటుంది. భాషను గౌరవించడమంటే ఆ ప్రాంత సంస్కృతీ సంప్రదాయాలను గౌరవించడమే.

మరో విషయం కూడా ఏ ప్రభుత్వమైనా గుర్తుంచుకోవాలి. సృజనాత్మక శక్తి కూడా మాతృభాషతోనే వృద్ధి చెందుతుంది.

మనకెన్నో రకాల సంపదలున్నాయి. వాటిలో సాహిత్యమూ ఒకటి. దానినీ ముందు తరాలవాళ్ళ కందించాలి.

భాషా సాహిత్యాలు జమిలిగా కలిసి ఉంటాయి. ఒకదాని ప్రభావం తప్పకుండా మరో దానిమీద ఉంటుంది. అందుకని ఈ రెంటినీ పరిరక్షించుకుని, ముందు తరాల వాళ్ళకందించడం మన బాధ్యత.

ఈ బాధ్యతలో ప్రజలందరూ తమ పాత్రని తాము జాగ్రత్తగా నిర్వహించాలంటే, ప్రభుత్వం ముందు పాత్ర ఎరిగి ప్రవర్తించాలి. సాహిత్యమంటే భాషకి సంబంధించింది, భాషంటే మన సంస్కార, సంప్రదాయాలకు సంబంధించింది అన్న స్పృహ - అసలు మన రాష్ట్ర ప్రభుత్వానికుందా? ప్రభుత్వం సాహిత్యాన్ని విస్మరిస్తే మనం ఎంతో సంపదని కోల్పోతాం. సాహితీవేత్తలని సముచితంగా గౌరవించని ప్రభుత్వం ప్రభుత్వమేనా?

తెలుగు భాషా సాహిత్యాలకి గౌరవం తెచ్చినవాళ్ళు మనకు గౌరవనీయులు. ఇదే విషయాన్ని అన్ని ప్రాంతాల ప్రజలూ గోల పెడుతుంటే - వినిపించుకోని ప్రభుత్వం ఎటువంటిది? అక్షరాస్యులందరూ ఆలోచించాల్సిన విషయం.

**రచయిత ఫోన్: 9391343916**



తెన్నాడు సంగతులు

- శ్రీ మార్టూరి వసంత్ నాయుడు

# తమిళనాడులో ఒక తెలుగు రాజకీయపార్టీ ఎందుకు ఉండకూడదు?

**అరవై ఏండ్లుగా తమిళనాడులోని ఏ ఒక్క రాజకీయ పార్టీకూడా తెలుగువారిని గుర్తించలేదు. ఆ పార్టీలలో పలుకుబడిలేని తెలుగువాళ్లు తమదైన రాజకీయపార్టీని ఏర్పరుచుకొంటేగానీ, తమ చిక్కులను తీర్చుకోవడం, తమ కోరికలను నెరవేర్చుకోవడం కుదరదు.**

'దేశం సగం తెలుగు సగం' అనేది తమిళనాట పెద్దలమాట. తెలుగుతావు చాలాపెద్దగా పరుచుకొని ఉన్నదని దీని తెల్లము. వక్కణాన వింధెమలనుంచి తెక్కణాన వానమామల (కన్యాకుమారికి 70 కి.మీ. పైన ఉంటుంది) వరకూ, పడమర పడమటి కనుమల నుంచి తూరుపున వంగకడలి వరకూ తెలుగువారు చిక్కగా పరుచుకొని ఉన్నారు. ఈ తెలుగు ఎల్లల నడుమ 8 రాజకీయ నాడులు ఉన్నాయి. అవి వరుసగా మహారాష్ట్ర, తెలంగాణా, చత్తీస్‌ఘడ్, ఒడిసా, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడు మరియు పుదుచేరి. 18 కోట్ల మందితో తెలుగే ఇండియాలో ఎక్కువమందికి తల్లినుడి. ఇప్పటి తమిళనాడులో మట్టుకే 3 కోట్లమంది తెలుగువారు ఉన్నారు.

ఇప్పటి తమిళనాటి మొత్తం మందిలో 42% తెలుగువారున్నారు. వాళ్లు నేలబిడ్డలు (Sons of the soil) గా ఈ తావులోనే వేలయేండ్లుగా నెలకొని ఉన్నారు. నిడుపైన ఏలుబడి చరిత్రతో, గొప్ప పనుబాటు (సాంస్కృతిక) కదలికతో, కొంగొత్త సాగుతీరులతో, పరిశ్రమల పెంపుతో ఈ తావు తెలుగువారు పేరు గడించి ఉన్నారు. తెలిసీతెలియని వారు కొందరు, చరిత్రను ఒప్పుకోలేని పిడివాదులు కొందరు అంటున్నట్లుగా – ఇక్కడి తెలుగువారు అందరూ ఆంధ్రనాడునుంచి వలసవచ్చి కుదురుకొన్నవారు కాదు. వింధె, వానమామలల నడుమ తావులో వేల ఏండ్లుగా తెలుగు వలసలు రెండువైపులా జరిగినాయి. తెలుగువారు ఇచ్చటి పలురంగాలకు చేసిన సేవలు ఎంతో గొప్పవి. తమిళనాడు గడించిన పెద్దపేరుకీ, పెను సంతోషాలకూ కారణమైన రంగాలన్నీ తెలుగువాళ్ల సేవలవల్ల వచ్చినవే.

**తమిళనాడులోని తెలివిపరులూ మీడియా ఎట్లయితే దూరదేశాల తమిళుల కోసం తమ గొంతులను వినిపిస్తారో, ఇక్కడి రాజకీయపార్టీలు వారికోసం ఎట్లా పాటుపడుతున్నాయో, అట్లాగే తెలుగు తెలివిపరులూ మీడియా రాజకీయపార్టీలూ, ఆంధ్ర, తెలంగాణలకు బయట ఉంటున్న తెలుగువాళ్ల గురించి పట్టించుకోవాలి. తెలుగు రాజకీయపార్టీలు కేవలం 9 కోట్ల మంది ఉండే ఆంధ్ర, తెలంగాణలకే గిరిగీసుకోకుండా, ఇంకొక 9 కోట్లమంది ఉండే తమిళనాడు, కర్నాటక, ఒడిసా, మహారాష్ట్ర, చత్తీస్‌ఘడ్ వంటి నాడులకు కూడా పరుచుకోవాలి. ఇతర దేశాలలోని తెలుగువారి ఒరిమలకోసం పాటుపడాలి.**

## గుమిక ఒడమి నిలవరం

తమిళనాడులో సాగుబడి రంగం అంతా దాదాపుగా తెలుగు కాపు కులాలైన కమ్మ, రెడ్డి, వెలమ, బలిజ, రాజు, కంబళం, ముత్తరాసల చేతుల్లో ఉంది. సాగుబడి రంగంలో కూలీవాళ్లుగా, తోలుపని వారిగా తెలుగు మాదిగల పని చాలా పెద్దది. కోమటి, బేరి, సాదు వంటి తెలుగు శెట్టి కులాలవారి కిందనే వ్యాపారరంగం ఇమిడి ఉంది. చిన్న చిన్న పేటల నుంచి పెద్దపెద్ద నగరాల వరకూ, తెరువులను ఊడ్చి కాలువలను తీసి మరుగుదొడ్లను కడిగే మంది మురికిని కడిగిపోస్తున్న మాదిగ, పియ్య ఒడ్డెర, పందిజోగి, దొమ్మరవంటి కులాలన్నీ తెలుగువారే. ఒడ్డెర అనే తెలుగుకులంవారి చెమటతోనే ఇక్కడ కట్టుబడి రంగం మొత్తం నడుస్తున్నది. చేనేత, కుమ్మరం, కమ్మరం, వడ్రంగం, మేదరం వంటి చేతిపనులలో తెలుగువారి పాలుగోలే ఎక్కువ.

పాడి, నంజర, పరిశ్రమలు, చిన్నాపెద్ద పరిశ్రమలు, గుడిసె పరిశ్రమలు, సాగుబడి ఆనుపరిశ్రమలు, బట్టల పరిశ్రమలు, చదువిలులు, ఆనిమిలులు (సాంకేతికసంస్థలు), ఆసుపత్రులు, నున్నురువు (సాఫ్ట్‌వేర్) పరిశ్రమలు ఇట్లా ఒక్కొక్క రంగంలోనూ తెలుగువారి ఇచ్చుగోలు పెనుదొడ్డది ఇక్కడ. ఇటీవల తమిళనాడునుంచి యూరప్, అమెరికా దేశాలకు వలసపోయిన వారిలో సగంకంటే ఎక్కువమంది తెలుగువారే. అమెరికాలోని తమిళసంఘం (FETNA) కు తమిళనాట తెలుగువారి తోడ్పాటే పెద్దది. ఆ సంగంలో సగానికిపైగా తెలుగువారే ఉన్నారు. వారు అందరూ అక్కడ కూడా తమిళ పెంపుకే పాటుపడుతున్నారు. అయితే తమిళనాటి

తెలుగువారు, తమిళగుమినుంచి తగిన మారువంతు (ప్రతిఫలం)ను గుమిక (సామాజిక) ఒడమి (ఆర్థిక) రాజకీయరంగాలలో పొందగలుగుతున్నారా అంటే, లేనేలేదు అని చెప్పాలి.

రిజర్వేషన్లలో కూడా తెలుగు కులాలు వేరిమికి గురవుతున్నాయి. మచ్చుకు చూస్తే తెలుగు కాపుకులాలైన రాజు, రెడ్డి, కమ్మ, బలిజ, వెలమవారు అందరూ ఒ.సి. పెడలో ఉన్నారు. తమిళ కాపుకులాలైన గౌండర్, దేవర్, వన్నియార్ వంటివారు మట్టుకు వె.త.లుగానో బాగా వె.త.లుగానో (B.C./M.B.C.) ఉన్నారు. ఈ విషయంలో తెలుగు దళితులైన మాదిగల నిలవరం దయనీయంగా ఉంది. తమిళ దళితులు, మాదిగలపై చేస్తున్న పెత్తనం గుండెల్ని పిండేసేదిగా ఉంది. ఈ సంగతులను తమిళ నానుడి (సాహిత్యం)కూడా ఎత్తి చూపడం లేదు.

## పనుబాటు నిలవరం (సాంస్కృతిక పరిస్థితి)

ఇప్పుడు తమిళనాడుకే సొంతమైన ఎన్నో పనుబాటు పాయలు అన్నీ తెలుగువారికి చెందినవే. మేలిమి భరతనాట్యం నుంచి నూటికిపైగా ఉన్న పల్లె కళలవరకూ, మదురమీనాచ్చి గుడినుంచి చెరువులూ, ఆనకట్టలూ వంటి సాగుబడి కట్టడాలవరకూ తెలుగువారి చెమటసొత్తే. చివరకు తమిళనాడు దొరగురుతు (రాజచిహ్నం) అయిన శ్రీవిల్లిపుత్తూరు గాలిగోపురం కూడా తెలుగువాళ్లు కట్టినదే. తమిళనాట అంగుళం అంగుళంలోనూ తెలుగువారి ఆనవాళ్లు కనిపిస్తూనే ఉంటాయి. ఒక్క నాంజల్‌నాడు (కన్యాకుమారి జిల్లా)లో తప్ప, తెలుగు కుటుంబాలులేని ఊరే తమిళనాట కనిపించదు. అయితే ఇంత తెలుగుదనమూ ఇప్పుడు తెలుగు పేరుతో కాక తమిళంపేరుతో తమిళుల గొప్పదనంగా మారుమోగిపోతున్నాది. ఇదంతా మాది అని చెప్పుకొనే దానికి కూడా ఇక్కడి తెలుగువాళ్లు వెనకడుగు వేస్తున్నారు.

## నుడి నిలవరం

ఇక్కడి తెలుగువాళ్లకి తమ తల్లినుడిని మాట్లాడడంలో, చదవడంలో, రాయడంలో తమిళులకు ఉన్నట్లుగా ఒరిమ (హక్కు) ఉందా? అట్లా అయితే తెలుగును ఎందుకు బడులలో నేర్పించడంలేదు. నేను చదివిన బడిలో 70% తెలుగువాళ్లం ఉండేవాళ్లం, అయినా మాకు తెలుగును చెప్పియ్యలేదు. నా బిడ్డలకైనా నా నుడిని నేర్పే తడవు వుందా? మా అవ్వ, ఒక్క తమిళమాట కూడా లేకుండా తెలుగులోనే మాట్లాడేది. ఆమె బతికిన 'దీపాలపల్లి' అనే ఊళ్లో అందరూ – చివరకు తమిళులుకూడా –తెలుగులోనే మాట్లాడేవారు. మా అవ్వకు తమిళం తెలవదు. మా అమ్మ రెండు నుడులనూ మాట్లాడేది. నాకు తెలుగుకన్నా తమిళమే బాగా తెలుసు. నా బిడ్డల సంగతి చెప్పాలనా? రెండు తరాలలోనే తల్లినుడిని పోగొట్టుకున్నాము, మా గుర్తింపును పోగొట్టుకున్నాము. అట్లాగే గుమికలో ఏమీ పొందలేని నిలవరానికి వచ్చేసినాము. నేను తెలుగుమీడియంను అడగడంలేదు. కనీసం ఒక పాఠంగా అయినా తెలుగును చదువుకోవడం మా తొలి ఒరిమ కాదా? తన తల్లినుడిలో రాయలేని చదువరి (లిటరేట్)గా ఉండడం క్రూరమైన శాపం కాదా? 3 కోట్లమంది తెలుగువారు ఈ శాపవిముక్తి పొందాలంటే, ఇప్పటికైనా తొలిబడినుంచి తల్లినుడిని ఒక పాఠంగా నేర్పించాలి. కానీ ఉన్మాద తమిళ రాజకీయాలలో ఇది కుదురుతుందా? తమిళనాడులోని హోసూరువాళ్లు తెలుగుబడిని నిలుపుకోవడానికి ఎన్ని తరాలుగా పోరాడుతున్నారో తెలిసిందే కదా.

## లెక్కలమాయ

2001లెక్కలను బట్టి తమిళనాడులో 5.65%మంది మట్టుకే తెలుగువారున్నారు. 2011 లెక్కల్లో ఇది ఇంకా తగ్గి ఉంటుంది. పదేండ్లకు ఒకసారి ఈ లెక్క తగ్గుతూనే ఉంటుంది. 2021 లెక్కలనాటికి తెలుగువారు బొత్తిగా కనుమరుగు కావడం తప్పదు. నుడిపేరుతో చీలి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత, ఇండియా నుంచి పాకిస్తానుకు పోయినట్లుగా వలసలేవీ ఇక్కడ జరగలేదు. ఒక్కటంటే ఒక్క ఉందూరు (స్థానిక) తెలుగు కుటుంబం కూడా ఆంధ్రప్రదేశానికి వలసపోలేదు. మరి ఇక్కడి తెలుగువాళ్లంతా తరువాత వంగకడలిలో దూకేసినారా?

దొరతనపు (ప్రభుత్వం) లెక్కలను బట్టి తమిళనాడులో 18% దళితులు ఉన్నారు. ఇందులో మూడోవంతు మంది మాదిగలు. అందుకే దళిత రిజర్వేషన్లలో తమకు 6% కేటాయించాలని మాదిగలు అడుగుతున్నారు. దీనివల్ల తెలుస్తున్నది ఏమిటి, తమిళనాడులో ఒక్క మాదిగల లెక్కే 6% ఉంది. దొరతనంవారు చెపుతున్న మొత్తం తెలుగువారి లెక్కకంటే, ఒక్క మాదిగల లెక్కే ఎక్కువగా ఉన్నప్పుడు, మిగిలిన తెలుగు కులాల వాళ్లనంతా కలిపితే ఎంత అవుతుంది? వీళ్లు అందరూ ఎక్కడికి పోయినట్లు? ఈ కుట్రల వెనక ఎవరు పనిచేస్తున్నారు?

నాడు నుడి కాకుండా ఇతర నుడి ఏదైనా ఒక తాలూకా లేదా జిల్లా మొత్తంలో, 10% కంటే ఎక్కువగా ఉంటే వారికి కొన్ని ఒరిమలను మన రాజ్యాంగం ఇచ్చి ఉంది. 25% కంటే ఎక్కువగా ఉంటే ఆ నుడిలో కూడా కొంత ఏలుబడి జరగాలి. ఒకవేళ ఆ ఇతరనుడే పెద్దదిగా ఉంటే, నాడు నుడికి ఉన్నంత పెత్తనం ఆ నుడికీ ఉండి తీరాలి. తమిళనాడులోని మొత్తం 234 చట్ట తొగుదు (నియోజకవర్గం)ల్లోని 120 తొగుదుల్లో తెలుగే పెద్దనుడి.

దీనిని నిరూపించడానికి మాదగ్గర లెక్కల రుజువులు ఉన్నాయి.

మటంగుంట (మడత్తుకుళం) నియోజకవర్గంలో నిలవరం ఇది.



మచ్చుకు నేను ఉంటున్న మటంగుంట (తమిళంలో దీనిపేరు మడత్తుకుళం) తొగిదిలో గడపగడపకూ తిరిగి తీసిన లెక్కలను కింద ఇస్తున్నాను.

## తమిళమయం

ఇక్కడి తెలుగువాళ్లు ఎదురుకొంటున్న పెద్ద ముప్పు ఏమిటంటే, ఒక ఎత్తుగడగా తెలుగు పనుబాటునూ, తెలుగు నుడినీ తమిళమయం చేయడం. వెరపుతోనో, బతుకు తెరువుకోసమో, మనుగడకోసమో గత ఏబయేండ్లుగా తెలుగువారు తమిళమయం అవుతూనే ఉన్నారు. వాళ్లు అట్లా చేయడాన్ని తప్పుపట్టలేము. నుడిపేరుతో ఆంధ్రనాడు ఏర్పడినాక, తెలుగూ తమిళం అనే పెను చిచ్చు రేగినాక, బతుకుతీపితో తమిళమనే పోటుముట్టును చేతికి ఎత్తుకున్నారు వాళ్లు. తమిళానికి వీరాభిమానులుగా మారితే పాదుగాపు (రక్షణ), గౌరవం ఉంటాయి అనుకొన్నారు. మొదట అట్లా జరిగింది కూడా. కానీ కాలంపోకడలో తెలుగువాళ్లపైన దాడులు పెరిగినాయి. ఒక్క తెలుగుమాటను కూడా మాట్లాడలేకపోయినా సరే, బతుకంతా తమిళానికి ఊడిగం చేసినా సరే, కులంపేరును చూపి, తెలుగువాళ్లుగా ముద్దరేసి అగడుగా చూడడం మొదలైంది. చివరకు పల్లెమట్టు (గ్రామస్థాయి)కు పడిపోయిన తెలుగువారి రాజకీయ నిలమ (అస్తిత్వం)ను కూడా నిలదీస్తూ, పంచాయితి ఎన్నికలలో తెలుగువారు పోటీ చేయకూడదంటూ గొడవలు మొదలైనాయి. ఇట్లాంటి నిలవరంలో తమిళనాట జీవించే తెలుగు కులాలు ఎట్లా మనుగడ సాగించగలవు? తెలుగుదనాన్ని ఎట్లా నిలుపుకోగలవు?

## రాజకీయ నిలవరం

మంది ఏలుబడి (ప్రజాస్వామ్యం)లో రాజకీయ బలమే పెద్దది. కేవలం నేలనూ, వ్యాపారాలనూ నమ్ముకొని ఉంటే, మనుగడ సాగించలేము. కనీసపు రాజకీయ బలాన్ని కూడా ఇక్కడి తెలుగువాళ్లు కలిగిలేరు. చట్టసభకు ఎన్నికైన వారి లెక్కలను చూడమని విన్నవించుకొంటున్నాను. 1920ల నాటి మద్రాసు మాగాణపు ఎన్నికలనుంచి ఇటీవలి ఎన్నికలవరకూ చూస్తే తెలుగువారి నిలవరం




తెలిసిపోతుంది. ఒకప్పుడు 60%పైగా ఉండిన చట్టసభ ప్రతినిధులు ఇప్పుడు కేవలం 10% ఎందుకు తగ్గిపోయినారు? తెలుగువారికి ఏం జరిగింది? తెలుగువారు లెక్కలో తక్కువ కాకుండానే – రాజకీయంగా మట్టుకు ఎందుకు కిందకు పడిపోయినారు.

అయితే నేటికి కూడా ఉందూరు ఎన్నికలలో తమిళనాడులోని అన్ని జిల్లాలలోనూ తెలుగువాళ్లే ఎక్కువ ఎన్నిక అవుతున్నారు. పార్టీ గురుతుతో పొత్తం లేనంతవరకూ తెలుగువాళ్లు నెగ్గుకొస్తున్నారు. పార్టీ గురుతులతో ఎన్నికలలో నిలబడాల్సి వచ్చినప్పుడు మట్టుకు తెలుగువాళ్లకు తావు దొరకడంలేదు. అన్నాడియంకె, డియంకె వంటి ద్రావిడ పార్టీలు ఒక్కొక్క తావులోనూ ఒక్కొక్క తమిళకులానికి పెత్తనం ఇచ్చేసినాయి, కొంగునాడులో గౌండర్లకూ, పాండెనాడులో దేవర్లకూ, తొండనాడులో వన్నియర్లకూ ఇట్లా. ఆయా తమిళకులాలే ప్రతి పార్టీలోనూ పెత్తనం చేస్తున్నాయి. తెలుగువారిని లోపలకు రానివ్వకుండా అడ్డుకుంటున్నాయి. దాంతో తెలుగువారు కేవలం పల్లె రాజకీయాలకే మిగిలిపోయినారు.

అరవై ఏండ్లుగా తమిళనాడులోని ఏ ఒక్క రాజకీయ పార్టీకూడా తెలుగువారిని గుర్తించలేదు. ఆ పార్టీలలో పలుకుబడిలేని తెలుగువాళ్లు తమదైన రాజకీయపార్టీని ఏర్పరుచుకొంటేగానీ, తమ చిక్కులను తీర్చుకోవడం, తమ కోరికలను నెరవేర్చుకోవడం కుదరదు.

ఇంతపెద్ద గుంపుగా ఉంటున్న తమిళనాడులోని తెలుగువారు, తమకోసం వారే ఎందుకు ఒక పార్టీని మొదలుపెట్టి, పెత్తనాన్ని చేపట్టకూడదు? అనే తలపోత కలగవచ్చు. అటువంటి పూనికలు అడపాదడపా జరిగినాయి కూడా. బలంగా వేళ్లు ఊనుకొని ఉన్న తమిళపార్టీలు బెదిరించో, బుజ్జగించో ఆ గొంతులను అణచివేసినాయి. తలెత్తకుండా తొక్కేసినాయి. మొదలుపెట్టిన ఒకటిరెండు పూనికలు – ఇట్లా అయిపోవడంతో, తెలుగువారు ఇంకాస్త వెనకడుగు వేసినారు. ఇప్పుడున్న నిలవరంలో ఇక్కడే ఒక తెలుగు పార్టీ పుట్టి నిలబడడం అయ్యే పనికాదు.

అందుకే ఈతరం తెలుగువారు, ఆంధ్రప్రదేశ్‌లోని తెలుగుపార్టీలవైపు చూస్తున్నారు. తమిళనాడులోని తెలివిపరులూ మీడియా ఎట్లయితే దూరదేశాల తమిళుల కోసం తమ గొంతులను వినిపిస్తారో, ఇక్కడి రాజకీయపార్టీలు వారికోసం ఎట్లా పాటుపడుతున్నాయో, అట్లాగే తెలుగు తెలివిపరులూ మీడియా రాజకీయపార్టీలూ, ఆంధ్ర, తెలంగాణలకు బయట ఉంటున్న తెలుగువాళ్ల గురించి పట్టించుకోవాలి. తెలుగు రాజకీయపార్టీలు కేవలం 9 కోట్ల మంది ఉండే ఆంధ్ర, తెలంగాణలకే గిరిగీసుకోకుండా, ఇంకొక 9 కోట్లమంది ఉండే తమిళనాడు, కర్నాటక, ఒడిసా, మహారాష్ట్ర, చత్తీస్‌ఘడ్ వంటి నాడులకు కూడా పరుచుకోవాలి. ఇతర దేశాలలోని తెలుగువారి ఒరిమలకోసం పాటుపడాలి.

ఇక్కడి తెలుగువాళ్లలో గూడుకట్టుకొని ఉండే బెదురును తొలగించి, గత పెనుపు (వైభవము)ను తీసుకొని రావడం – తమిళనాట ఇప్పుడు చారిత్రక అవసరం. అందుకు ఆంధ్ర, తెలంగాణల్లోని తెలుగు తెలివిపరులూ, రాజకీయపార్టీలూ, మీడియా ముందుకు రావాలి.

**రచయిత ఫోన్: 09442627001**

కరీంగనగర్ కత

# అమ్మ-వంటిల్లు!

సంకేపల్లి నాగేంద్రశర్మ

**అ**ది, పాతకాలంనాటి మా ఇంటి వంటిల్లు. అది పాతాళభైరవి చిత్రంలోని గుహ సెట్టింగ్‌లా పాతగా కనబడినా, ఎప్పుడు నలభీమ పాకంలా ఘుమఘుమలాడుతుంది. కమ్మటి వంటకాల వాసనలకు అది నిలయం. మా ఇంట్లో అన్నం, పచ్చిపులుసు, శాకాల తయారికీ ఆవంటశాలే మాకు అచ్చివచ్చింది.

మా అమ్మకు ఆ వంటిళ్ళంటే అదొక పవిత్రమైన భగవద్గీత పుస్తకం లాంటిది. అమ్మకు అది ముచ్చటైన ఆభరణంలాంటిది. అదొక చెరగని జీవితానుభవం. మరోమాటలో చెప్పాలంటే అమ్మకొలిచే శివయ్యతో సమానం. పొద్దున్నే బుడబుడ నీళ్ళుపోసుకోందే (స్నానం) ఆ వంటింట్లోకి పాదం ఆన్చే సంగతేలేదు. మా పొదరిల్లులాంటి మట్టిభవంతిలో అదొక ముఖ్యమైన చిలుకపంజరం లాంటిది. అమ్మకు వంటింటితో యాభై ఏళ్ళ విడదీయరాని అనుబంధం ముడేసుకుని పోయింది. మా అమ్మకు ఆరుగురు పిల్లలు, మా నాయనకు అన్ని రకాల తిండ్లను ఆ వంటింట్లో నుండే తయారుచేసిపెట్టేది. వచ్చిపోయే చుట్టాలకు, అతిధులకు, చివరకు బిచ్చగాళ్ళ కడుపులు కూడా ఆ వంటిల్లే నింపుతుండేది. అడపాతడపా జరిగే పబ్బాలు-కార్యాలకు ఆ వంటిళ్ళే నెలవు. మాఅమ్మ వంటింట్లో వుంటే ఆవంటింటికి, తయారుచేసే తిండ్లకు కమ్మటి సొగసులు, రుచులు వచ్చేవి. అమ్మ వండే వంటకాల గుమగుమ వాసనలు వ వా ముక్కుపుటాలను అదరగొట్టేవి. అమ్మ శాకం వేయడంకోసం పోనీ విత్తులు వేసి మూకుడు గిన్నెలో ఆడించిందంటే చుట్టుపక్కల ఇళ్ళకు కమ్మటి వాసనలు తగిలేవి. ఆకాశంలోకి పక్షులు గుంపులు గుంపులై ఎగిరినట్లు ఆహ్లాదంగా గుమగుమల వాసనలు దండిగా మా వాడలోకి వచ్చేవి. మా ఇంటి ముందరి కమ్మరి-అవసోళ్ళ సందులోకి అవి చొచ్చుకెళ్ళేవి. ఆ కమ్మటి వాసనలు సోకి, అందరినోట్లో ఊరిళ్ళు పుట్టించేవి. ఆవాలు, మినపప్పు, ధనియాల పొడి, ఎండుమిర్చి, కరివేపాకు, ఇంగు, కొతిమీర ఆకులు కలిపి వేసే పోనీ వాసనలే వాసనలు. అవి జనం మంచి సత్తెమ్మ వంటిళ్ళుపోనీ వాసనలేనని అందరికి ఇట్టే ఎరుకైపోతుంది.

ఆ రోజు ఎందుకో మా అమ్మ బాధతో కనిపించింది. మేమంతా కూడబల్కొని పాత ఇల్లు స్థానంలో కొత్త ఇళ్ళు వేసుకుందా మనుకున్నాం. పక్కనున్న కోమటి సావుకార్ల స్థలం కొనడం వల్ల, నాలుగు ఇళ్ళుగా విడదీసి ఎవ్వరికి వారే ఇల్లు కట్టుకోవాలన్న ఆలోచన వచ్చింది. తన వద్ద ప్రత్యేకంగా కూడబెట్టిన రొక్కం అంటూ ఏమీ లేదని మా నాయన చేతులెత్తేశాడు. మీచదువులు, పెళ్ళిళ్లు, ఇంటి సంసారం నిర్వహణకు ఖతమైపోయిందని అన్నాడు. కాని కొంతలో పది నయాపైసలం తైనా

**ఇంటినికూల్చే పదిమంది కూలీలు వచ్చి వంటింటి గోడపై గడ్డప్పారతో పోట్లు వేస్తుంటే, అమ్మ తట్టుకోలేక తెగ బాధపడిపోయింది. ఆపండి, ఆపండి అనికేకలేస్తు అరిచింది, ఎంత వారించినాలాభంలేకపోయింది. అమ్మ వంటింటి వైపే పిచ్చిపిచ్చిగా చూస్తు తెలివి తప్పి కిందపడిపోయింది. అమ్మ కళ్ళు వంటింటివైపే చూస్తున్నాయి. అమ్మ గుడ్లుతేలేసింది అంతె ఇగ లెవ్వలేదు.**



సాయపడతానని అన్నాడు. మీరంతా నౌకర్లతో ఉంటిరి, కాబట్టి మీరే సర్దుకోవాలని మంచిమాట చెప్పాడు. బ్యాంకి లోన్ల ద్వారానో, ఇతర మార్గాల ద్వారా సొమ్ము జమచేసుకోని కట్టుకోవాలని చెప్పాడు. తాను పదిలంగా దాచుకున్న యాభైవేల రూపాయలు ఇంటి పునాదుల కోసం ఇస్తానని మాట ఇచ్చాడు.

ఇల్లు కట్టడానికి సుమారుగా పదిలచ్చల రూపాయలు ఖర్చవుతాయని అంచనా. నాలుగు గుంటల స్థలంలో నలుగురన్నదమ్ములకు నాలుగు చిన్నపాటి ఇళ్ళు కట్టుకోవాలని అనుకున్నాం. నక్షాప్లాన్‌లు గీయించి, ఇళ్ళు కట్టుకోవడానికి గ్రామపంచాయితీ నుండి పూర్వానుమతులు తీసుకున్నాం. తెల్లారి పెద్దసుతారి గురవయ్యను పిలిచి వివరాలు అడిగి  తెలుసుకున్నాం. పదిలక్షలతోపాటు, తడిసి మోపెడైన ధరల దృష్ట్యా మరో నాలుగైదు లక్షల రూపాయలు అదనంగా అవసరం పడుతుందని చెప్పాడు. ఏది ఏమైనా వున్న బంగారు (ఎరుపు) నగానట్రా తీసివేసైనా ఇళ్ళు కట్టాలని అందరం అనుకున్నాం. మానాయన మాటల్లో చెప్పాలంటే, పాత మట్టి ఇల్లు సుమారు 120 సంవత్సరాల కిందటి పురాతన కట్టడం. అది పూర్తిగా పాతదై, ఏ క్షణమైనా ఒరిగిపోవడానికి సిద్ధంగా వుంది. వంశపారంపర్యంగా తాతగారినుండి ఈ పాత ఇల్లు వచ్చింది. రెండు తరాలవారు ఆ ఇంట్లోనే కాపురం చేశారు. మానాయన మెట్‌పల్లినుండి పెంపకంరావడంవల్ల, తన పెంపుడు నాయనను చూసే అవకాశం లేకుండాపోయింది. ఆయన ఎప్పుడో కైలాసంవెళ్ళారు. సాదుకున్న అమ్మ అన్నమ్మ.మెడనిండా రకరకాల గొలుసులు, ఓంట్లోపాందాన్, నోట్లోపాన్, అలా రాజసం వుట్టిపడే నలుబయ్యేదేళ్ల వయస్సులో ఆమె ఇంటి గద్దకాడ కూకుండి చుట్టుపక్కల వారితో మర్యాదగా, హుందాగా మాట్లాడుతుండె. ఇలాఎన్నో భూముజాగలున్న వారు ఎందుకో కొత్తగాఇల్లు వేసుకోలేకపోయారు.

ఒకటినుండి ఐదువరకు చదివే పోరలంతా ఒక చిన్న గదిలో కలిసిమెలిసి కిందనే కూర్చునేవారు. కూర్చోవడానికి తుంగ చాపలు వేసేవారు. వేమన పద్యాలు, ధర్మపురి శేషప్పకవి రాసిన శతక పద్యాలు, సుమతి పద్యాలు, దండకాలు, యక్షగానాలు, వివిధ దేవుళ్ళ స్త్రోత్రాలు, దసరా పాటలుపిల్లలు నోటికి బట్టిపెట్టేవారు. ఓనమాలతోపాటు, ఒంట్లు, జమలు, తీసివేతలు నేర్పేవారట. పంతులు వాగుకు తానం చేయడానికి, పూజ-పునస్కారానికై గుడికి గాని, బజార్‌కుగాని ఎళ్ళినపుడు పెబ్బగా బడిని మానాయనగారే జబర్దస్త్‌గా చదువుకున్న తర్వాత మా నాయనను నాయనమ్మ సంస్కృత పాఠశాలలో చేర్పించిందట. ఎములాడ రాజన్న గుడిమీద తీర్థపోల్లకు మొక్కులు చేయించే పురోహితపుకశిపికి (వృత్తికి) వెళ్లడం అలవాటు చేసిందట.

అలాంటి ఇంటికి మా అమ్మ కోడలుగా అడుగుపెట్టింది. మా అమ్మ తల్లిగారు వూరు అరవదేశంలోని తంజావూరైనా, సనాతన బ్రాహ్మణ ఆచార సాంప్రదాయాలకు వాళ్ళిళ్ళు పెట్టింది పేరు. బంగారానికి వెలిగారం అతికినట్లుగా, మా అమ్మకు మా నాయన తెగ నచ్చాడట. 8 వందల కిలోమీటర్ల దూరాన్నయినా కాదని, మా అమ్మ  మా నాయన కోసం వేములవాడకు రైళ్ళు, బస్సులు ఎక్కి వచ్చిందట. కులాచారాలు, సాంప్రదాయాలు కలిసినా, బాష వేరు, తిండ్లు వేరు. అరవ దేశంలో ఏ వంటైనా సాంబార్‌తో కలిపి చేస్తారు. తెలంగాణాలో ముద్దపప్పు, పులుసు, దప్పడం, బరడా, అంబలి, గంజి, గటుక, శాకం చేసుకుని తింటారు. సాంబార్‌ను చారు అంటారు. దీన్ని చేసుకోవడం తక్కువే. మసాలాలు వాడటం కూడా తక్కువే. మా అమ్మ చేసే సాంబార్ మా నాయన, నాయనమ్మకి మస్తుగా నచ్చేదట. అరవం వంటకాలు వండటం మాని, కాస్తో కూస్తో ఇక్కడి తిండ్లు నేర్చుకోవే... అని మానాయనమ్మ పదేపదే ఊదినట్లుగా మారం చేసేదట. పొరుగు దేశం కోడలాయె. చనువు, బాగా ప్రేమ, వందలమైళ్ళ దూరం నుండి వచ్చింది కాబట్టి  జాగ్రత్తగా ప్రేమతో చూసేదట. పైగా అరవదేశం ఆడపడచాయే. మా నాయనమ్మ కోసమైనా మా అమ్మ చుట్టాలింటికి వెళ్ళి తెలంగాణా వంటకాలుఎలా వండాలో నేర్చుకుందట. మా నాయనకు వారసత్వంగా వచ్చిన ఆ ఇల్లు పాతది. ఇరవై టేకు దూలాలు, పదిపన్నెండు మొగురాలు, ఆరేడు ఎనగర్రలు, చిన్నపెరడు, నాలుగైదు మూలవాసాలు, నాలుగు అర్రలతో (గదులు) రెండుగుంటల్లో మా పాత గూనపెంకుల ఇల్లు నిత్యదేవాలయంగా కనిపించేది. వంటిల్లు వెడల్పుగా, విశాలంగా వుండేది. తూర్పు దిక్కుముఖం కలిగివాస్తుకు రామసక్కగా (అనుకూలంగా) వుండేది.

మా అమ్మతో నాయన పెళ్లి ఘనంగా జరిగిందట. మా అమ్మకు పదహారేళ్ళు, ఆ వయసులోనే మా అమ్మపెళ్ళి మా నాయనతో వారంరోజులపాటు జరిగిందట. రాజన్న గుళ్ళోలోని వెనకాల వున్న నాగిరెడ్డి పెళ్ళి మండపంలో జరిగిందట. పోచమ్మలు, ఎదుర్కోలు, సుముహూర్తపు మూడుముళ్ళు, నాగవెళ్ళి, విందుభోజనాలు ఘనంగా జరిపించారట. కిరాయ పలాకి ఎక్కించి ఊరేగించారట. ఆనాటినుండి నేటివరకు యాభై ఏళ్ళు గడిచిన ఆ పాత ఇంటిలోనే వారి సంసారం సాగింది. మా పెద్దక్కయ్య, ఒక్క చెల్లె, మా నలుగురు అన్నదమ్ముల పెళ్ళిళ్ళు పతాకమన్నీ సుతారంగా ఆపాత ఇంటిలోనే  జరిగిపోయాయి. మానాయిన వారసత్వానికి, చెక్కుచెదరని ఆత్మవిశ్వాసానికి, కాందాన్‌కి మా పాత ఇల్లు నిషాన్‌గా (ప్రతీకగా) నిలిచింది. విశాలమైన వంటింట్లోని ఇల్లు చెక్కతలుపుల గూడు, ఎప్పుడు నోరు తెరుచుకుని వుంటుంది. దేవునిగూడు, చిన్న సందు పెరడు, శాయిమానా(వసారా), దొంతులర్ర (స్టోర్‌రూం) అన్నీ మా వంటింటిని అతుక్కొని వీడని చుట్టాల్లాగా కలిసి వున్నాయి. వంటిల్లు ప్రహరీ గోడ పక్కనే చేదబావివుంది. కటిక ఎండాకాలంలోనైనా ఊట నీళ్ళుండేవట. మా నాయన అక్కడే తానంచేసి, పంచె మడితో నీళ్ళుఇత్తడి చెంబులో పట్టుకుని సంధ్యావందనాలు, పూజలు-పునస్కారాలు చేసేవాడు. చేదబావికి ఎదురుగానే పాడిబర్రెను కట్టేసే చిన్నపాక వుండేది. దాని పక్కనే పాయఖాన వుండేది. మా నాయన వాకిట్లో తచ్చులాడే ల్యాగను కట్టేసి పచ్చిమేత వేస్తుండేవారు. మేతను తానే ప్రతిరోజు సాయంత్రం పొలానికి వెళ్ళి కోసుకుని, సైకిల్‌పై మోపుగా పెట్టుకుని తీసుక వస్తుండేవారు. ప్రతినిత్యం పెందలాడే నాలుగింటికి లేచి, చిక్కటిపాలు పిండుకుని టీ త్రాగి, అయిదు గంటల వరె రాజన్న గుడిలో జరిగే ప్రాతఃకాల పూజకు ఠంచనుగా పూజ పల్లెంతో హాజరవుతుండేవారు. మా ఇంటిని అనుకుని వుండే చిన్నింటిని కిరాయకు ఇచ్చాము. ఆ భాగాన్ని మేము పెద్దయ్యాకి మేమే వాడుకలోకి తెచ్చుకున్నాం. మా ముగ్గురు తమ్ముళ్ళకు పెళ్ళిళ్ళు కావడంవల్ల కిరాయ

వాళ్ళను ఖాళీ చేయించి, తమ్ముళ్ళుండటానికి సర్దాం. ఇందులోని ముందటి శాయమానాల్లో బొమ్మలపెట్టె టీవిని అమర్చి, పక్కనే 60 అడుగుల పొడవైన ఇనుప పైప్‌లతో వైర్‌లెస్ ఆంటీనాను పెట్టుకున్నాం. ఆ నల్ల, తెల్లని టీవిలో వచ్చిపోయే కదిలే బొమ్మలు మమ్ములను ఎంతో ఆశ్చర్యపరిచేవి. ఇన్నాళ్ళు రేడియో ద్వారా మాటలు విన్న మాకు, టీవి కొత్తగా అనిపించింది. మాటలతోపాటు, బొమ్మలు రావడం వింతగా అనిపించింది. దూరదర్శన్‌లో వచ్చే తెలుగు, హిందీ సినిమాలు, సినిమా పాటలు, వారం కొకరోజు వచ్చే ధారావాహికలు, నాటికలు కనురెప్పార్ప కుండా చూసేవాళ్ళం. నలుగురు కోడళ్ళు, వచ్చిపోయే చుట్టపోళ్ళ తాకిడివల్ల ఇల్లు గజిబిజిగాసత్రంగా వుండేది. ప్రతిరోజు పొద్దున్నే నౌకర్లకు వెళ్ళే మాకు ఛాయి-ఫలారాలు చేయడం, బువ్వడబ్బాలు మా అమ్మసదర్దడం వల్ల, మా అమ్మకు వంటింటిలో రికాం లేకుండా పని వుండేది. ప్రస్తుతం నేడది ఇరుకైపోయింది. ఒక విధంగా చెప్పాలంటే అది నాలుగిళ్ళ తిండ్లు, ఫలారాలకు సరిపోనిదై పోయింది. నలుగు రన్నదమ్ములకు పిల్లలు కలగడం వల్ల కొత్త ఇళ్ళ నిర్మాణం తప్పనిదైంది. ఉమ్మడిగా కలిసున్న పెద్ద కుటుంబం వేరుపడే పరిస్థితి ఏర్పడింది. మా చిన్నతనంలోనే మా బావ (పెద్దక్క భర్త సీతాపతి) రోగం బారినపడి అ-కాలం చేశారు. బావగారి అకాలమరణం అక్కను కుంగతీసినా తిరిగి నిలదొక్కుకునేలా మా నాయన చేశాడు. అక్కడ ఆగిన తన చదువును కొనసాగించి, తెలుగు పండిత పరీక్షలు రాయించి, అప్పుచేసి నౌక రీ ఇప్పించాడు. పొరుగున వున్న జడ్‌పి హైస్కూల్లో తెలుగు బోధించే పంతులమ్మగా నౌకరీలోకి చేరిపోయింది. వారాంతానికివచ్చి పోతుం డటం వల్ల ఆమెకు మా ఇంటిలోని ఓ గదిని కేటాయించవలసి వచ్చింది.

పాత ఇంటిని కూల్చి నాలుగు కొత్త ఇళ్ళకు శ్రీకారం చుట్టడం వల్ల మా అమ్మ బాధ వర్ణనాతీతం. పాత ఇంటిలోని వంటిల్లు ఘనావైభవం కూలిపోతున్నందులకు అమ్మ తెగ బాధపడింది. అమ్మ అంతఃపురం పట్టపు మహారాణిగా వంటింట్లో పెత్తనాన్ని సాగించింది. పాత సిమెండి, ఇత్తడి గిన్నెలు, బగోనెలు, పెద్ద తట్టలు, గంటెలు, సరాతాలు, మూకుళ్ళు, పెనాలు, గిలాసలు అమ్మ జ్ఞాపకాల్లో పదేపదే గుర్తుకు రాసాగాయి. కొత్తగాకొన్న స్టీలుపాత్రలలో అమ్మ బువ్వ వుడికించడం, కట్టెల పొయ్యిమీద పెట్టేముందు వాటికి మసిసోకకుండా మట్టిపూత రాయడం, పప్పు, శాఖం, చింతపండు పులుసు చేయడం జరిగేది. బొగ్గులపొయ్యిలో పప్పుకాటురాకుండా తుకతుక ఉడకడం, బొగ్గులు అంటుకోవడానికి విసనకర్ర వాడటం నాకిప్పటికీ గుర్తుంది. వంటింట్లో అమ్మవంటపని, అష్టావధానంచేసినంత పని అయ్యేది. వంటింట్లో ఊగులాడపడే రెండు ఉట్లంటే మా అందరికి వల్లమాలిన అభిమానం. ఉట్లపై పాలు, పెరుగులు దాచివున్న గిన్నెలు మమ్ముల్ని పలుకరిస్తుండేవి. వాటికి దొంగపిల్లుల బాధతప్పేదికాదు. చీమలు తగలకుండా ఉట్లు వాడేవారట. కట్టెల పొయ్యి, ఉసుకపొయ్యి, వేడినీళ్ళ కొప్పెర, చలికాలంలో ఉడుకునీళ్ళ తానంఅన్నీ అమ్మకు గుర్తుకు వచ్చాయి. ఉనక పొయ్యిపై కొప్పెర పెట్టి గొట్టంతో ఊది మంటవెలిగించడం, ఆ కట్టెల పొయ్యిమీదే వంట చేయడం అమ్మకు యాదుంది. ఆకాలంలో కిరోసిన్‌గాని, గ్యాస్ స్టవులుకాని అంతగా వాడుకంలోనికి లేకుండేవి. వడ్లుగిర్ని పట్టేటప్పుడు వచ్చే ఉసుకను మట్టిపొయ్యిలో మెత్త వాడేవారు. అడవులనుండి ఎడ్లబళ్ళలో అమ్మకానికి వచ్చే కట్టెల మోపుల్ని కొంటుండేవాళ్ళం. అందులో ఒకటి రెండు టేకు కర్రలు కూడా తగిలేవి. అవి కిటికీలకో, మంచాలకో, కుర్చీలకో ఇతరత్రా బల్లలు చేసుకోవడానికి అక్కరకు వస్తుండేవి. కొట్టించిన కట్టెలను వంటింట్లో మూలకు కుప్పలా వేసేవాళ్ళం. పైసలకు కట్టెలు కొట్టేకూలీలు దొరికేవారు. వంటకు పొయ్యిల్లో కట్టెలు వాడుతుండేవాళ్ళం. క్రమక్రమంగా అడవులు తరిగిపోవడం వల్ల ఎడ్లబళ్ళు ఆగిపోయాయి. కట్టెల పొయ్యిల స్థానంలో కిరోసిన్ స్టవులు కొత్తగా వచ్చాయి. వంటశాలలోని ఎదురుగావున్న రెక్కల గూడులో అమ్మ వంట వస్తువుల ఖజానా వుండేది. చక్కెర, చాపత్త, ఆవాలు, కారంపొడి, దొడ్డుప్పు, సన్నపప్పు, తినేసోడా, ఎండుమిర్చి, జీలకర్ర, పాలు, పెరుగున్న గిన్నెలు వుండేవి. వంటశాలలోనే పొయ్యిల పక్క సన్నపుమోరి వుండేది. అక్కడే అమ్మ వంటబోళ్ళను కడిగేస్తుండేది. ఉనుక, మట్టిని ఉపయోగించి కడుగుతుండేది. మాకుచిన్నతనంలో ఏవైనా చిల్లరపైసలు కావలసి వస్తే దూలాలపైన వెతికితే ఏదో డబ్బాకిందనో, గిన్నెకిందనో అమ్మ దాచుకున్నవి కనబడుతుండేది. పది పైసలో, ఐదుపైసల బిల్లలో, పావులా బిల్లలో, ఆఠాణా బిల్లలో లేదా ఒకటి, రెండు రూపాయల నోట్లు తీసుకుని వెళ్ళి, బఠానీలు, ఐసుక్రీమ్‌లు, ఉప్పుబిస్కట్లు, పిప్పరమెంట్లు కొనుక్కుంటుండేవాళ్ళం. అమ్మ ఆ తన చెక్కగూడుకు తాళం వేసి, మూలవాసంపైన తాళంచెవి వుంచుతుండేది. అలా ఆ తాళం చెవిని మేము ఎత్తుపీట వేసివెతుక్కుని, డబ్బులు ఎత్తుకపోయేవాళ్ళం. అదొక ఖుషీఖుషీగాబగ్గ సంబరంగా, సరదాగా వుండేది. అమ్మ పొయ్యి చెక్కపీట వేసుకుని గంటె తిప్పుతూ పొగతో కుస్తీపడుతూ కనపడుతుండేది. వంటిల్లు మొండిగోడ, రెండు కిటికిగూళ్ళు పొగపోవడానికి వీలుండేది. అమ్మకు కోపం వస్తే పొయ్యిలో కొర్రాయి చూపి వాత పెడతానిని బెదిరిస్తుండేది. లేకుండే కట్టెలపై నీళ్ళు చల్లి ఎక్కువ పొగపెడుతుండేడిది. పాపం అలా తన అసహనాన్ని, నిస్సహాయతను వ్యక్తం చేసేది. మేం ఆకలిత ఉన్నపుడు మాత్రం అమ్మ వంట హుషారుగా చేసేది. మేమంటేఎంతో ప్రేమ. వంటైయ్యిందని అమ్మపిలిస్తే, మేమందరం సంబురంగా, కిందే కూర్చుండి తినేవాళ్ళం. రకరకాలముచ్చట్లు చెప్పుకుంటూ తినేవాళ్ళం.

అమ్మ పెత్తనం, పెద్దరికం, పరువు-ప్రతిష్టలన్నీ మాసిపోయి, దెబ్బతినే కాలం వచ్చింది. ఇంటి యజమానురాలిగా తన పెత్తనానికి ముప్పు రాబోతుండడం అమ్మ సహించలేకుండా పోయింది. అమ్మను ఆ సందర్భం దహించి వేసింది. కోల్పోనున్న తనపాత వైభవం కోసం అమ్మ ఆరాటపడుతున్నట్లు కనిపించింది. తనలో వున్న ఏదో ఒక భాగం కోల్పోయినట్లు బాధపడింది. అదికాదమ్మా, మేమంతా మీకు అండగా వుంటాము, వేర్వేరు ఇళ్ళు కట్టుకున్నా కలిసికట్టుగానే వుంటాం. తాత్కాలికంగా తప్పని పరిస్థితుల్లో విడిపోయినా పండుగలు, పబ్బాలప్పుడు అంతా కలిసే చేసుకుంటాం. కష్టం, సుఖంలోనూ కలిసి మెలిసి వుంటామని హామీ ఇస్తు, నచ్చజెప్పాం. అలా అమ్మ తాత్కాలికంగా మాకోసం శాంతించినట్లు తెచ్చుకున్న నవ్వునవ్వింది. అమ్మ వంటిళ్లంతా కలియ తిరిగింది. మసి పట్టిన గోడల్ని వంటవండే సామాన్లతో పదిలంగా

*మిగతా 38వ పేజీలో....*

జనవాణి

## రాజకీయ నేతలారా, మెలకువ తెచ్చుకోండి

# ఇప్పుడైనా రైల్వేజోన్‌ను కావలసినంతమేర తెస్తారా?

రాష్ట్రం విడిపోతున్నప్పుడు ఒక తెలుగు నాయకుడు కూడా ముందు చూపుతో పని చేయలేదు. రాష్ట్రం రెండుగ తప్పక అవుతుంది అని తెలిశాక కూడా ఎక్కడ ఏమేమి ఇబ్బందులుంటాయి అని తలపోసిన నాయకుడు లేకపోయాడు. వెంకయ్యనాయుడు మాత్రం కొంత నయం. అంతా అయిపొయ్యాక, ఇప్పుడు లబోదిబోమంటూ, తమ తెలివితక్కువతనాన్ని చాటుకొంటున్నారు.

ఇప్పుడు కొత్త రైల్వే మండలం విశాఖలో కాని, బెజవాడలో కాని వస్తుంది అని అందరికీ తెలుసు. కాని అందులో ఈ ప్రాంతాలు వుండాలి అని ముందుగ అడిగే తెలివి వున్న ఒక రాజకీయ నాయకుడు కాని, ఒక పత్రిక కాని, చర్చపెట్టే ఒక టి.వి. చానల్ కాని మనకు కనపడటం లేదు.

మొదటినుంచి రైల్వే లైన్ల విషయంలో తెలుగువారికి అన్యాయం జరుగుతూనే ఉంది. ఒకసారి దేశపు రైల్వే పటం చూస్తే ఈ సంగతి కొట్టొచ్చినట్లు కనపడుతుంది. ఉత్తరాదిలో, తమిళనాడులో లైన్లు చిక్కగా ఎక్కువగా కనబడతాయి. తెలుగునాట ఎక్కడో ఒకటీ అరా కనపడుతాయి.

తెల్లవాళ్ళు వెళ్లిపొయ్యాక ఈ అన్యాయం మరింత ఎక్కువైంది. 1947 నుంచి దాదాపు కొత్త రైల్వే దారి ఏదీ ఇక్కడ ఏర్పడలేదు. తమిళులకు, ఉత్తరాదివారికి సౌకర్యంకోసం మన దగ్గర ఉన్న లైన్లను జంట లైన్లుగా మాత్రం మార్చారు. ఒక్క బీబీనగర్-నడికుడి లైను మాత్రమే వచ్చింది. అదీ చెన్నైనుంచి హైదరాబాద్‌కు దారి పొడవు తగ్గటానికి పనికి రావడం వల్లనే.

స్వాతంత్ర్యం వచ్చినప్పుడు 54,000 కిలోమీటర్ల లైన్లు మన దేశంలో ఉండేవి. ఇప్పుడు 68,000 కిలోమీటర్ల దాకా పెరిగాయి. మన దగ్గర మాత్రం ఉన్న లైన్లనే తీసేశారు. కాకినాడ నుంచి కోనసీమ వైపున్న లైను అలాగే సమసిపోయింది. మన వాళ్ళు రైల్వే మంత్రులు అవటమే చాలా తక్కువ. ఒకటీ అరా ఉప మంత్రి అయినా రాష్ట్రాన్ని గురించి పట్టించుకున్న గుర్తులేమీ లేవు. ఇతరులు మాత్రం తమ రాష్ట్రాలకు మాత్రం అడ్డంగా మేలు చేసుకుంటూ పోయారు. లాలూప్రసాద్ తన పుట్టిన ఊరినుంచి అత్తగారి ఊరికి ఒక ప్రత్యేక లైనునే వేసుకొన్నాడు. మమత కూడా అలా చేయడమే కాకుండా పేర్లు కూడా బెంగాలీ పేర్లనే పెట్టింది. ఇలాంటివెన్నో ఉన్నాయి, చెప్పుకోదలచితే మన పొరుగు రాష్ట్రాలు కర్ణాటక, తమిళనాడులకైతే ఆ రాష్ట్రాల రైల్వేమంత్రులు, అధికారులు చేసిన మేళ్లు అన్నీ ఇన్నీ కావు.

**ఇప్పుడు మన నిక్కచ్చులు (డిమాండ్లు) ఇవి:**

1. గూడూరు నుంచి చెన్నై వరకున్న ముక్కలో ఎక్కువదవ్వ ఆంధ్రప్రదేశ్‌లోనే ఉంది. దానిని మనకు ఇవ్వమని అడగాలి.
2. మనం దీనిని తెచ్చుకోలేకపోతే ఇంకోదారి ఉన్నది. కాళహస్తి నుంచి గుమ్మడిపూడివరకు లైను వేయమనాలి. ఒక దశలో అలా వేయాలనే ఆలోచనను కూడా కేంద్రం వెలిబుచ్చింది. అక్కడ ఒక బి.హెచ్.ఇ.ఎల్ పరిశ్రమ వచ్చింది. సత్యవేడు, సిరి స్పెషల్‌జోన్ లాంటివి పుంజుకోవటానికి వీలు అవుతుంది.
3. వైజాగ్‌నుంచి కొత్తవలస మీదుగా కిరండల్ వరకు ఉన్న ముక్కను మనం తెచ్చుకోవాలి.
4. ధర్మవరం నుంచి యలహంక వరకు వున్న ముక్కను కూడా మనం కోరాలి.
5. హిందూపురం నుంచి చికబల్లాపూర్ వరకు వేరే లైనును వేయమని అడగాలి. అప్పుడు హిందూపురంను జంక్షన్‌గా చూపించి, ధర్మపురం నుంచి హిందూపురం ముక్కను అడగచ్చు.
6. రేణిగుంట నుంచి అరక్కోణం వరకు ఉన్న ముక్కను కూడా తెచ్చుకోవాలి. ఇందులో కూడ చాలా ఎక్కువ దవ్వ (70శాతం కన్నా ఎక్కువ) ఆంధ్రప్రదేశ్‌లోనే ఉన్నది.
7. విజయనగరం - సింగపురం ముక్కను కూడా కొత్త జోన్లో కలపాలి. అందులో ఓ 15 కి.మీ.లు మాత్రమే ఒరిస్సాలో ఉన్నది.

వీటిని ఎలాగైనా సాధించుకోవాలి. ఇందుకు ముఖ్యమంత్రి, ఇతరనాయకులు, ముఖ్యంగా పార్లమెంటు సభ్యులు పూనుకోవాలి. కేంద్రంపై బాగా వత్తిడి తేవాలి.

జోన్ సంగతి ఇలా ఉండగా, రైల్వే ఉద్యోగాల్లో తెలుగు వారికి జరుగుతున్న అన్యాయం వంటి సమస్యల్ని కూడా నాయకులు పట్టించుకొని, వాటిని సరిదిద్దాలి.

ముందుగా మేల్కొంటే మంచి మాటలతో మనం సాధించగలిగినవాటిని- తరువాత కేకలు, కొట్లాటలు ద్వారా కూడా సాధించుకోలేము.

**- శ్రీ పొరుపల్లి కోదండరామయ్య, మిత్రులు,**
**హైదరాబాదు, ఫోన్: 9505298565**

– శ్రీమతి పూదోట శౌరీలు

# ఉడుమలపేటలో తెలుగువారు

**త**మిళనాడులో 42శాతం తెలుగువారే. అక్కడున్న తెలుగువాళ్ళు, తెలుగుభాషపట్ల వారికున్న మమకారం, తమిళం దాడినుండి తెలుగును కాపాడుకోవటానికి వారు పడుతున్న ఇక్కట్లు, వారి ఆచార వ్యవహారాలు గురించి 'నడుస్తున్న చరిత్ర' పత్రిక ఎప్పటికప్పుడు వెలుగులోకి తెస్తూనే ఉంది. ఆ పత్రిక ద్వారానే నేను హోసూరు ప్రాంతపు తెలుగువారి గురించి తెలుసుకున్నాను. 2011 నవంబరులో హోసూరుకు వెళ్ళి కొన్ని పల్లెల్ని తిరిగి వారి నోటినుండి అలవోకగా వస్తున్న అచ్చ తెలుగు భాషకు, వారు తెలుగు బడిని నిలుపుకోవటానికి పడుతున్న తపన చూసి అచ్చెరువొందాను. అప్పటినుండి తమిళనాడులో ఎక్కడెక్కడ తెలుగువారున్నారు, వారు ఎలా ఉన్నారు, ఏ భాష మాట్లాడుతున్నారు, వారి ఆచార, వ్యవహారాలు ఎలా ఉన్నాయి అని తెలుసుకోవాలనే ఆసక్తి పెరిగిపోయింది. గత నెలలో "అమ్మనుడి" పత్రిక ద్వారా తెలుగుసంస్థ తిరుపూరు జిల్లాలోకి దాదాపు 100 పల్లెలలో తెలుగును నేర్పించబోతున్నదని గత నెలలో "అమ్మనుడి" పత్రిక ద్వారా తెలిసింది. ఆ తెలుగు పల్లెలను చూడాలనీ, వారితో మాట్లాడాలనీ ఎంతగానో ఎదురు చూస్తున్నాను.



రచయిత్రితోపాటు బోధన్‌నుండి ఉడుమలపేట వెళ్లి ఆ ప్రాంతం పర్యటించి వచ్చిన బృందం

స.వెం. రమేశ్, వసంత్– కవిత దంపతుల ఆహ్వానంపై తిరుపూరు బయలుదేరాను. నాతోపాటు, నా భర్త దాస్, అక్క అన్నా మేరి, స్నేహితురాలు రత్న కలిసి మేనెల 12వ తేదీ పొద్దున నిజామాబాద్ జిల్లా బోధన్‌లో బయలుదేరి నడిపొద్దు 12.00 గం॥లకు సికింద్రాబాద్‌లో "శబరి ఎక్స్‌ప్రెస్" ఎక్కి మరునాడు పొద్దున 7.30 గం॥లకు తిరుపూరులో దిగాము. రైలు దిగీదిగగానే వసంత్‌గారి ఆత్మీయమైన పలకరింపులో ప్రయాణ బడలికనే మర్చిపోయినాము. వారి కారులో 9 గం॥లకల్లా ఉడుములపేటలోని వారింటికి చేరినాము. ఇంటి ఇల్లాలు కలిసి వారి పిల్లలు సంజ్ఞాపద్మం, అర్షాపద్మం, అరిదన్‌వేలు స్వాగతం పలుకుతుండగా అందమైన ఆ ఇంటిలోకి అడుగుపెట్టాము.

భోజనాలు ముగించుకొని ఏడు గొలుసుకట్టు చెరువులను చూడటానికి బయలుదేరాము. పెద్దచెరువు, కొర్రల చెరువు, ఎర్రచెరువు, నల్లచెరువు, ఒట్టు చెరువు, శెట్టి చెరువు, వలయ చెరువు అనే ఈ ఏడు చెరువులను తమిళనాట పాలించిన తెలుగు నాయక రాజులు తవ్వించారట. ఇప్పటికీ ఈ చెరువుల కింద 6,500 ఎకరాలు సాగవుతుందని తెలిసింది. ఈ ఏడు చెరువులలో నల్ల చెరువు, ఎర్ర చెరువులను చూశాము.

అక్కడినుండి తిరుమూర్తి గుడికి వెళ్ళాము. తిరుమూర్తి గుడిని కట్టించిన 'ఎద్దలప్పనాయుడు' తెలుగురాజే. తమిళనాడులోని తెక్కణపు తావును ఏలిన తెలుగు నాయకరాజులకింద 76 మంది పాలెగాండ్లు (సామంతరాజు) ఉండేవారు. వారిలో 64మంది తెలుగురాజులే. తిరుపూరు జిల్లా మటంగుంట తాలూకాలోని 'తళి' ఒకపాలెయపట్టు. ఆ 'తళి' పాలెయపట్టును ఏలినవాడు ఎద్దలప్పనాయుడు. గొప్ప పరిపాలనాదక్షత, రాజనీతిజ్ఞత, శౌర్య పరాక్రమములు కలిగినవాడు. అతడు బ్రిటీష్ వారిని ఎదిరించి నిలిచినవాడు. బ్రిటీష్ వారితో జరిగిన యుద్ధంలో ఎద్దలప్పనాయుడు ఓడిపోయి కొండలలోనికి పారిపోయాడు. తర్వాత అక్కడ ఉండే 'కొళయ' అనే గిరిజనులను కూడగట్టి, వారికి శిక్షణ ఇచ్చి, వారికి నాయకుడుగా మారి తిరిగి బ్రిటీష్‌వారిపై యుద్ధం చేసినాడు. బ్రిటీష్‌వారు కుయుక్తులలో ఎద్దలప్పనాయుడిని బంధించి ఉరితీశారు. తళి ప్రాంతంలోకి సామాన్య జనం ఆయన వీరగాథలను, ఆయన చేసిన గొప్ప పనులను నేటికి కతలు, కతలుగా చెప్పుకుంటుంటారు.

తిరుమూర్తి గుడికి వెళ్ళేదారిలోనే ఒక పెద్ద మర్రిచెట్టు చుట్టు ఎదలప్పనాయుడు. అతని ఆరుగురు రాణులు, సైన్యము పరివారమునకి చెందిన మరియు అతడు పూజించిన దేవతా శిల్పాలను అమర్చినారు. ఆ శిల్పాలలో చిరంజీవియై యున్న ఎద్దలప్పనాయుడిని, అతని ఆరుగురు రాణులను చూసి ఎంతో సంతోషించాము. తన ఆరుగురు రాణుల మధ్య నిలబడ్డ ఎద్దలప్పనాయుడి విగ్రహం రాజసంతో వెలిగిపోతూ ఉంది. సమాజం కోసం తపన పడిన ఆ మహానుభావుడ్ని శిల్పాలలోనన్నా చూసే భాగ్యం దక్కింది గదా అని ఆనందించాము.

వసంత్‌గారు ఎద్దలప్పనాయుడి వీరగాథలను చెబుతుండగా వింటూ ఆయన కట్టించిన తిరుమూర్తి గుడిని చూశాము. విశాలమైన మండపాలు, ఎత్తైన కొండలమధ్య గుడి ఉంది.అక్కడ ఒక పెద్ద కొండరాయికి పసుపుముద్దలేసి కొడుతున్నారు. అలా కొడుతూ ఏదైనా ఒక కోరిక కోరుకుంటే తప్పక జరిగి తీరుతుందట. స్థానికులు కొందరు ఒకానొకప్పుడు అక్కడ జైన విగ్రహాలు ఉండేవని, అవి కానరాకుండా ఉండటానికే, అలా పసుపుముద్దలేసి కొడుతుంటారని చెప్పారు. కొండ

దిగువనే ఉన్న ఆ గుడి పచ్చని ప్రకృతిలో సేదతీరుతున్నట్లుగా ఉంది. ఆ కొండ మీదనే ఎంత దూరం నుండి చూసినా కనిపించే శివలింగాకృతిలో ఉన్న ఒక కొండ రాయి ఉంది. కొండల మీదనుండి చల్లని నీటిధారలు పడుతున్నందున నిండు వేసవిలో గూడ ఆ ప్రాంతమంతా చల్లగా ఉంది. గుడికి వచ్చిన భక్తులలో ఎక్కువమంది ఆ తావు వెలుగును మాట్లాడుతున్నందున తమిళనాడులోని గుడికి పోయినట్లుగా అనిపించలేదు.

అక్కడినుండి వసంత్‌గారి కొబ్బరితోటకు వెళ్ళాము. మొదటి సారిగా నేను అక్కడనే రుద్రాక్ష చెట్టును, చెట్టుకున్న రుద్రాక్షలను చూశాను. తిరిగి ఇంటికి వస్తూ అక్కడక్కడ ఆగి మన తెలుగువారిని పలకరిస్తూ ఇల్లు చేరాము.

తెల్లవారి గురువారం పొద్దున్నే వసంత్‌గారి కుటుంబంతో కలిసి వారి స్నేహితుడు విశ్వనాధనాయుడుగారి కుమార్తెకు 'ఓణీ'లిచ్చే వేడుకకు వెళ్ళాము. వేడుకలో ఎటు విన్నా చెవులకింపైన తెలుగు పలుకులు 'దండాలు, దండాలు, రండ, రండ, కూసోండ, బాగుండారా, కూడు తినండ, వక్కాకు వేసుకోండ – అనే ప్రేమపూర్వక పలకరింపులు. వేడుకకు వచ్చిన వాళ్ళందరు చక్కగా పలకరిస్తుంటే సంతోషం పట్టలేకపోయాము. కొండల దిగువన ఉన్న కొబ్బరితోటలో జరిగిన ఆ వేడుకలో తృప్తిగా తెలుగు భోజనాన్ని తిని అక్కడినుండి అమరావతి ప్రాజెక్టు చూడటానికి వెళ్ళాము.

అమరావతి ప్రాజెక్టును, దానికి దగ్గరలోనే ఉన్న మొసళ్లపార్కు చూసి పొద్దు గుంకుతూ వుండగా దారిలో వున్న తెలుగువాళ్ళ పల్లెలను చూస్తూ, 'దీపాలపల్లి'లోవున్న వసంత్‌గారి పెద్దమ్మ ఇంటికి చేరాము. దీపాలపల్లిలోని మొత్తం 300 కుటుంబాలలో రెండు కుటుంబాలు తప్ప మిగిలిన ఊరంతా తెలుగు మాట్లాడేవారే! తెలుగు అక్షరాలు నేర్చుకోవాలని తపిస్తున్నవారే. తెలుగువాణి ఈ ఊరిలో కూడా తెలుగు తరగతులు జరపనున్నదని తెలిసి సంతోషించాము.

అక్కడినుండి ఉడుములపేట వసంత్‌గారింటికి బయలుదేరాము. దారిలో ఆగి ఉడుములపేటకే ప్రత్యేకమైన బొరుగులను రుచిచూశాము. ఇక్కడ బొరుగులతో (పేలాలు) 22 రకాలు చేస్తారట. అందులో కొన్ని రకాలను రుచి చూశాము. దేనికవే ప్రత్యేకమైన రుచి. మసాలాపెట్టి కూర్చిన చెక్కల రుచి చెప్పనేలేము. ఎవరికి వారు తిని చూడాల్సిందే. రాత్రికి కవిత చేసిన ప్రత్యేకమైన జంతికలు ఎంతో ఇష్టంగా తిని మధురమైన "తెన్‌దెలుగుతల్లీ, చెందెలుగు తల్లీ" పాటవిని పడుకున్నాము.

మరునాడు 6 గంటలకే లేచి బయలుదేరాము. కవిత తమ్ముడు విద్యాశేఖర్ దారిలోని విశేషాలు వివరిస్తున్నాడు 'పొల్లాచ్చి'లో టిఫిన్ చేసిన తర్వాత మా కారు అడవుల మధ్య ప్రయాణిస్తూ 'మంకీఫాల్స్' దగ్గర ఆగింది. అక్కడినుండి ఎత్తైన కొండలను ఎక్కుతూ ఆ కొండల మధ్య కొలువైయున్న 'బాలాజీ'ని చూశాము. అంత ఎత్తులో ఆస్వామి గుడి అందంగా, ప్రశాంతంగా అక్కడే ఉండిపోవాలన్నంత హాయిగా ఉంది. ఆ కొండల మీద అంతటా 'టీ ఎస్టేట్స్' ఉన్నాయి. తర్వాతి 'ఆళియార్ డామ్' చూశాము. 'వాల్పారా'లో అన్నం తిని ఫోటోలు తీసుకున్నాము. తేయాకు తోటలలో పనిచేస్తున్న కూలీలను పలకరించి తేయాకు సేకరణ, టీ పొడి తయారీ విధానముతెలుసుకున్నాము. అక్కడ పండిన శ్రేష్టమైన మిరియాలు, తేయాకు కొనుక్కుని తిరుగు ప్రయాణమైనాము. నాలుగు గంటలకే చీకటి పడినట్లుగా దారి కనిపించనంతగా మబ్బులు ముసురుకున్నాయి. చిరుజల్లులు, మబ్బుల నడుమ కారు ప్రయాణం ఒక మధురానుభూతిని కలిగించింది. ఏడు గంటలకు ఇల్లుచేరాము.

ఆకాశం మేఘాలతో నిండిపోయి ఉంది. మబ్బులు దూది పింజల్లా తేలిపోతున్నాయి. పొద్దున్నే నిద్రలేచిన మమ్మల్ని వానజల్లులు పలకరించాయి. బయటకెళదామంటే ఒకటే వాన. ఈలోగా మావారు విద్యాశేఖర్ వెళ్ళి తత్కాల్‌లో తిరుగు ప్రయాణానికి టిక్కెట్స్ బుక్ చేసుకుని వచ్చారు ఈలోగా కవిత కోరిక మేరకు నేను, రత్న కలిసి హైదరాబాద్ బిర్యానీని తయారుచేశాము. చక్కని విందుభోజనం చేసి ఉడుములపేటలో షాపింగ్‌కు బయలుదేరాము. అక్కడినుండి స్టిచ్చింగ్ యూనిట్ చూసి వచ్చాము.

ఆదివారం రమేష్‌గదిలో అందరం కలిసి వండుకోవటంలోను, తినటంలోనుగల ఆనందాన్ని అనుభవించాము. ఇక రైలుకు సమయమవుతూ ఉంది. రమేశ్ దగ్గర వీడుకోలు తీసుకుని వసంత్ గారింటికి చేరి మా సామాను సర్దుకున్నాము. అడుగు ముందుకు పడటంలేదు. ఆ చల్లని వాతావరణం, అంతకన్నా చక్కని ప్రేమ పూర్వక ఆతిథ్యం ఒద్దికైన ఆ పిల్లల అనురాగం మమ్మల్ని కదలనివ్వటంలేదు. ఇంకా రెండు రోజులుండండి అనివాళ్లు అడుగుతుంటే వాళ్ళ సహృదయతకు కళ్ళు చెమ్మగిల్లాయి. బరువెక్కిన మనసులతో, ఎన్నో మధురానుభూతులను మూటగట్టుకుని, అక్కడున్న మన తెలుగువారి సంస్కారానికి, తెలుగులిపిని నేర్చుకోవాలనే వారి తపనకు చెయ్యెత్తి నమస్కరిస్తూ ఆ కుటుంబం దగ్గర వీడ్కోలు తీసుకున్నాము. మా వూరికి రమ్మని ఆహ్వానించాము. విద్యాశేఖర్ మమ్మల్ని తిరుపూరు స్టేషన్‌లో రైలు ఎక్కించాడు. వదల్లేక, వదల్లేక మన తెలుగు ప్రాంతాన్ని వదిలి హైదరాబాదు బయలుదేరాము.

**రచయిత చరవాణి: 90101 53505**

## 'జర్మనీలో కవితాయాత్ర' ఆవిష్కరణ



డాక్టర్ ఎన్. గోపి రచించిన 'జర్మనీలో కవితాయాత్ర' గ్రంథాన్ని ఎన్‌బిటి సమావేశ మందిరంలో, మానేరు రచయితల సంఘం ఆధ్వర్యంలో వేములవాడ శాసనసభ్యులు డాక్టర్ చెన్నమనేని రమేష్ ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో రచయిత్రి డాక్టర్ ఎం. సుజాతారెడ్డి, నేటి నిజం సంపాదకులు బైస దేవదాస్, కవి గోపి, డాక్టర్ ఎన్. రఘు, సభాధ్యక్షులు ఎన్.బి.టి. తెలుగు ఎడిటర్ డాక్టర్ పత్తిపాక మోహన్ ఉన్నారు.

- శ్రీ బొర్రా గోవర్ధన్

## తెలుగమ్మ ఒడిలో బౌద్ధం - 4

# ఈ నేలను తడిపిన తొలి ధర్మతొలకరి

గత సంచికలో చూశాం; భిన్నత్వంలో ఏకత్వానికి బౌద్ధం ఏ విధంగా దోహదం చేసిందో. భరత ఖండాన్నే కాదు, దానితోపాటు ఆంధ్రజాతిని కూడా ఎలా బలమైన జాతిగా తీర్చిదిద్దిందో. కులాలు, ప్రాంతాల పేరుతో భిన్నాభిన్నమైన తెలుగువారిని ఒకే ధార్మిక చట్రంలోకి ఎలా తీసుకువచ్చిందో.

**అందరికన్నా ముందున్న తెలుగు వారు:**

అశోకుని కాలంకంటే ముందే మన తెలుగునేలమీద బౌద్ధ ప్రభావం ఎంతగా ఉందంటే, అప్పుడే కాదు, ఆ తర్వాత వెయ్యేళ్లవరకూ దక్షిణ భారతదేశానికి బౌద్ధకేంద్రంగా మన తెలుగునేల విరాజిల్లింది. బౌద్ధం ప్రపంచవ్యాపితం కావడానికి కూడా తెలుగునేలే బీజాలు వేసింది. ఎందరెందరో తెలుగు భిక్షువులు ప్రపంచం నలుమూలలకీ వెళ్ళి బౌద్ధాన్ని వ్యాపింపచేశారు.

ఇంకా ఖచ్చితంగా చెప్పుకోవాలంటే...

బుద్ధుడు పుట్టిన ప్రదేశంగానీ, బుద్ధుడు తన జీవిత కాలంలో నడయాడిన ప్రదేశాలుగానీ, బుద్ధుని బోధనల్ని స్వయంగా విన్న ప్రాంతాలుగానీ... ఇవేవీ, బౌద్ధాన్ని తెలుగు నేలంత బలంగా వ్యాప్తి చేయలేకపోయాయి.

బుద్ధుని ప్రధాన శిష్యులు, ప్రధాన అనుచరుల్లో తెలుగువారు లేరనే చెప్పాలి.

కానీ, బౌద్ధతత్త్వాన్ని ఆకళింపు చేసుకోవడంలోగానీ, బౌద్ధతత్త్వసారాన్ని గ్రహించడంలోగానీ, దాని ఆనుపానులు తెలియడంలోగానీ - తెలుగువారు వారందరికంటే ముందే ఉన్నారు.

అందుకు కారణం ఒకటే...

బౌద్ధం, ఆనాటికి వచ్చిన తత్త్వాల్లో ఒక గొప్ప నూతన తత్త్వం. బుద్ధుని కాలానికి మూడు వేదాలున్నాయి. వాటి సారం, అంతస్సారం తెలిసినవారూ ఉన్నారు. కొన్ని ముఖ్యమైన ఉపనిషత్తులూ ఉన్నాయి. ఉపనిషత్తుల తత్త్వ బోధలు తలకెక్కిన తాత్త్వికులూ ఉన్నారు. ఇవికాక, అసిత కేశ కంబలి, ప్రకృధ కాత్యాయన్, సంజయ వేలట్ఠి పుత్రుడు, పూర్ణ కాశ్యపుడు, మక్కలగోశాలి, నిగంధనాధుడు(వర్ధమాన మహావీరుడు) లాంటి ఆరుగురు దర్శనకారులూ ఉన్నారు. వీరికి తోడు యోగవిధానం, చార్వాకం కూడా ప్రబలంగానే ఉంది.

ధార్మిక క్షేత్రంలో ఈ తాత్త్విక ధోరణులన్నీ తమ తమ సిద్ధాంతాల ప్రచారంలో తలమునకలై ఉన్నాయి.

ఇవ్వన్నీ - వైదిక సంప్రదాయం , వైదికేతర సంప్రదాయం అనే రెండు భాగాలుగా విడిపోయి ఉన్నాయి.

**మంత్రాలు- తంత్రాలు:**

వైదిక సంప్రదాయమే మంత్ర తంత్ర సంప్రదాయం. ఇందులో పూజలు, యజ్ఞాలు, యాగాలు, క్రతువులు, బలులు, మంత్రాలు ఇవే ప్రధానమైనవి. వైదిక సంప్రదాయాన్ని నమ్మేవారు, వేదాలు చెప్పిన స్వర్గాన్ని నమ్ముతారు. చనిపోయాక మనుషులు స్వర్గానికో, నరకానికో పోతారని నమ్ముతారు. స్వర్గాన్ని పాలించే దిక్పాలకులకి, వారి అధినాయకుడైన ఇంద్రునికి మొక్కుబళ్ళుతీరుస్తారు. ఇలా తీరిస్తే మనం చేసిన పాపాల్ని మరచిపోయి, మనల్ని స్వర్గానికి రానిస్తారని నమ్ముతారు. ఇందుకోసం యజ్ఞయాగాలు నిర్వర్తించి వేలాదిగా జీవుల్ని బలిలిచ్చేవారు. ఈ బలులతో మాంసం, మద్యం అందుకున్న దేవతలు సంతృప్తులై, తమ మీద 'దయ' తలుస్తారని భావిస్తారు.

దీన్నే మనం వేద సంప్రదాయం, లేదా వైదిక సంప్రదాయం అంటున్నాం. వైదిక సంప్రదాయంలో 'జీవుడు' తిరిగి పుట్టడు. చచ్చి స్వర్గానికి పోయి, అక్కడే ఉండిపోతాడు. అంతే...తిరిగి పుట్టడు. అంటే ఈ సంప్రదాయంలో పునర్జన్మ లేదు.

**తర్కాలు- తత్త్వాలు:**

ఆ తర్వాత వచ్చింది తాత్త్విక సంప్రదాయం. వైదికేతర సంప్రదాయం. దీనిలో స్వర్గం, నరకం ఉండవు. దేవుడు వ్యక్తిగా (ఇంద్రుడో,చంద్రుడో,వరుణుడో...) ఉండడు. 'ఆత్మ' , 'పరమాత్మ' ఉంటాయి. ఆత్మ తాను చేసిన పాప పుణ్యాల బేరీజుని బట్టి మరలా మరలా పుడుతూ ఉంటుంది. ఏలాంటి పాపం అంటని ఆత్మ సరాసరి పరమాత్మలో లీనమైపోతుంది. అంటే ఈ సంప్రదాయంలో - స్వర్గం, నరకం, ఇంద్రుడు(దేవుడు), యజ్ఞయాగాలూ,మంత్ర తంత్రాలూ పోయి - వీటి స్థానంలో ఆత్మ,పరమాత్మ,పాపం,పుణ్యం, పునర్జన్మ అనే కొత్త ధార్మిక విధానం వచ్చింది. ఈ విధానాన్ని ప్రచారం చేసినవి ఉపనిషత్తులు. ఇలా ఉపనిషత్తులు వేదవిధుల్ని వ్యతిరేకించినా, ఆత్మ,పునర్జన్మ పేరుతో మానవాతీత శక్తుల్ని మరింత బలపరచాయి. అయినా ఉపనిషత్తుల తత్త్వాన్ని వేద విరోధ తత్త్వంగానే భావిస్తారు. నాస్తిక దర్శనాలుగానే(నాస్తికో వేదనిందక) చెప్తారు.

**కార్యాలు- కారణాలు:**

మనం ఇంతకు ముందు చెప్పుకున్న ఆరు దర్శనాలు కూడా ఉపనిషత్తుల్లా వేదకర్మకాండల్ని వ్యతిరేకించినవే.

అయితే బౌద్ధం ఉపనిషత్తుల్ని కూడా తోసివేసింది.

బౌద్ధం ఆత్మను అంగీకరించలేదు. అలాగే వేదం చెప్పిన కర్మకాండల్నీ ఒప్పుకోలేదు. స్వర్గ,నరకాల్నీ, పునర్జన్మనీ తోసివేసింది. 'కర్మ' సిద్ధాంతానికి

పునాదులు వేసింది. 'కర్మ' సిద్ధాంతం అంటే మనం ఇప్పుడు చెప్పుకుంటున్న పాప పుణ్యాల, పునర్జన్మల కర్మసిద్ధాంతం కాదు. ఇది కార్యకారణ సంబంధం మీద ఉన్న కర్మసిద్ధాంతం. "మనం చేసిన పనికి ఫలితం, ఇక్కడే, ఇప్పుడే" ఉంటుందని చెప్పే కర్మ సిద్ధాంతం. ప్రత్యక్షంగా ఋజువుకు నిలిచే కర్మ సిద్ధాంతం.

అంటే..... ఆనాటికి మొత్తం 3 ప్రధాన తత్త్వాలు ఈ నేలమీద నెలకొని ఉన్నాయి.

ఒకటి: హింసాపూరిత యజ్ఞయాగాలతో నిండిన వైదిక సంప్రదాయం.
రెండు: ఆత్మ, పరమాత్మ, పునర్జన్మల ఉపనిషత్తుల వాదం.
మూడు: ఆత్మను, పునర్జన్మనూ ఒప్పుకోని, కార్యకారణ వాదమైన బౌద్ధం.

ఇవికాక– చార్వాకం (నాస్తిక దర్శనం) కూడా బలీయంగానే ఉండేది.

**బ్రాహ్మణ వాదం :**

'భగవంతుణ్ణి' నమ్మడానికో, దేవతలకు దేవుళ్ళకు మొక్కు బడులు చెల్లించడానికో – పెద్దగా తాత్త్విక పునాది అవసరం లేదు. నమ్మితే చాలు. – కాబట్టి పండితుల దగ్గరనుండి, పరమ పామరుల వరకూ అందరికీ తేలిగ్గా ఒంటబట్టేది 'నమ్మకం' మాత్రమే.

'నమ్మడానికి' తత్త్వంతోగానీ, తర్కంతో గానీ పని లేదు.

'నమ్మడం' ఎంత తేలికో...'నమ్మకాన్ని వదిలించుకోవడం' అంతకష్టం.

మానవ మస్తిష్కంలో ఉన్న అతి గొప్ప 'మాయాజాలం' ఇది.

నమ్మకానికి ఆలోచనతోకానీ, వివేచనతోకానీ పనేలేదు. కాబట్టి దేన్నైనా 'నమ్మడం' తేలిక.

అందుకే దేవతల, దేవుళ్ళ ఆరాధనలూ, నివేదనలూ ఇన్నేళ్ళయినా బతికున్నాయి. బలీయంగా ఉన్నాయి.

వేదాలకి భిన్నమైన 'గొంతుకను' వినిపించినప్పటికీ, ఉపనిషత్తుల వాదం ప్రజల వైదికాచార నమ్మకాలముందు నిలువలేక పోయింది. గెలవలేక పోయింది. చివరికి తనే తన దారి మార్చుకుని వైదిక సంప్రదాయంతో మొదట 'ఐక్య సంఘటన' కట్టి , చివరికి 'విలీన'మైపోయింది.

వైదికం కర్మకాండలు , ఉపనిషత్తుల తత్త్వం ఈ రెండూ కలగలసి మనువాద పునాదిపై బ్రాహ్మణ'వాదం'గా అవతరించాయి.

బుద్ధుని అనంతరం తలెత్తిన ఈ బ్రాహ్మణవాదం భారతదేశంలో దావానలంలా వ్యాపించింది.

ప్రజలు... ఈ కొత్త 'నమ్మకం'లో పడిపోయి ఉన్నప్పుడు... తెలుగునేల మీద కూడా ఈ 'నమ్మకాలు' బలీయంగా ఉన్నప్పుడే... బౌద్ధం కూడా ఇంకా బలీయంగా ఇక్కడ వేళ్ళూనుకొంది. ఇదే ఇక్కడ, ఇప్పుడు మనం ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన, గుర్తించాల్సిన చారిత్రక అంశం.

**అజరామర ఘట్టం:**

బౌద్ధ చరిత్రలోనే కాదు. తెలుగునేల చరిత్రలో కూడా ఇది అజరామర ఘట్టం. 'నమ్మకం' మీద నిలబడి బతికే దైవ భావాన్ని కాదని, తత్త్వం మీద నిలబడిన ఒక శాస్త్రీయ, ధార్మిక విధానాన్ని తలకెత్తుకోవడం అనేది సామాన్య విషయం కాదు. పైగా ఈ విధానం (బౌద్ధం) తాత్త్విక పునాది కలిగింది. విజ్ఞానం, వివేచనకు సంబంధించింది. అంతకుమించి, ఇంకా ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన సంగతి కూడా ఒకటుంది.

అది, మానవ సమాజ 'నడతకి' సంబంధించింది.

ఇది పాఠకులకు 'కొద్దిగా ప్రక్కకు పోతున్నాం' అనుకున్నా సరే, తప్పకుండా ఆ ప్రక్కకు పోయి చెప్పుకోవాల్సిన విషయం.

**బలహీనతలు – బలాలు :**

భూమ్మీద అన్ని జీవుల్లా మనిషి కూడా ఒక జీవే. ఆక్రమించుకోటాలూ, అన్యాయాలు, హింసా, విధ్వంసం, కామం, క్రోధం, మోహం ఇవ్వన్నీ మనిషికి సహజాతాలే. వీటితోపాటు ఇతర జీవ స్రవంతిలో లేని 'దయా'గుణం అనేది మనిషికి మాత్రమే ఉంది. ఇదే మానవీయత.

మనిషిలో ఉన్న పాశవికమైన పశుస్వభావమైన గుణాలన్నింటినీ ఏదో ఒక మేర బ్రతికిస్తూనో, పెంచి పోషిస్తూనో, నడిపిస్తుంది 'దైవ'భావం. ప్రపంచంలో ఇతర మతాల్లా మన వైదిక భావజాలం కూడా అదే పని చేసింది. చేస్తుంది. ఏదో ఒక మేర 'మన బలహీనతల్ని' అది బలపరుస్తుంది. వాటికి ఊతం ఇస్తుంది. మనలో ఉన్న ఒక్కొక్క బలహీనతను సమర్థించుకోడానికి ఒక్కొక్క దేవతో, దేవుడో, ఆత్మో పరమాత్మో ఉంటాడు – మన బలహీనతల్ని వారిలో చూసుకొని, లేదా వాటితో బేరీజు వేసుకుని, 'ధైర్యంగా' బతికేస్తూ ఉంటాం.

ఆ విషయాలిక్కడ ప్రత్యేకంగా వ్రాయను – మీరే మీలో ఉన్న కొన్ని బలహీనతల్ని ఓ కాగితం మీద రాసుకుని – ఆ బలహీనతలకు ప్రతి రూపాలైన దేవతలు ఎవరెవరో వెతికి రాసుకోండి –మీకే తెలిసి పోతుంది.

కానీ, బౌద్ధం మనలో ఉన్న ఆ బలహీనతలన్నీ తొలగించుకొని, మనలో ఉన్న 'మానవీయతనే' పెంపొందించు కోమంటుంది. అందుకే అది ధర్మం, సత్యం, అహింస, ప్రేమ, దయ, కరుణ, మైత్రి"– లాంటి మానవీయ ధర్మాల గురించే బోధిస్తుంది.

నిజానికి బలహీనతలతో బ్రతకడంకంటే బలహీనతల్ని జయించి బతకడం చాలా కష్టం. బలహీనతల బ్రతుకు తాత్కాలిక ఆనందానికి, బలహీనతల్ని జయించిన బ్రతుకు శాశ్వతానందానికి కారణం అవుతుందని కనిపెట్టి, ఆ ధర్మమార్గాన్ని చూపింది బౌద్ధం. –

ఒక దేవతకు ఒక వేటపోతును నరికి నివేదించడం చాలా తేలిక. మనలోఉన్న ఒక చెడ్డగుణాన్ని నరికి అవతల పారేయడం చాలా కష్టం.

కాశీకి పోయినవారు ఏదోఒక కోరికను వదిలిపెట్టాలట. చాలామంది బంగాళదుంపలకూరనో,వంకాయపులుసునో...నేనిక ముట్టను అని వారికి ఇష్టం లేనివాటిని వదిలివస్తారు. సారాయి, లంచం, మోసం అనే నైతిక నియమాల్ని వదిలిరారు.

తిండి నొదిలినంత తేలిక కాదు దుర్గుణాన్ని వదలడం. అలాగని అసాధ్యం కూడా కాదు.

'మానవీయత' అనేది దైవనివేదనకాదు , ఆత్మనివేదన. అంటే– బౌద్ధ ఆచరణ. బౌద్ధ ధర్మ అవలంబన అంత తేలికైన విషయం కాదు.

మరి అలాంటి 'మానవీయ నడతని' తలకెత్తుకుందంటే... ఈ నేల ఎంత గొప్పది కాకపోతే ఆపని చేయగలదు!

అందుకే మానవీయ సిద్ధాంతాన్ని తలకెత్తుకోవడం అనేది చరిత్రలో అజరామర ఘట్టం.

ఆ పని మన తెలుగునేల చేసింది. మానవతా కుసుమాలు విరబూయించింది!

తెలుగునేల 'బౌద్ధానికి' ఒక వెయ్యేళ్లు కేంద్రంగా నిలబడిందంటే... దాని చారిత్రక పాత్ర అంత తేలిగ్గా మరచిపోయేది కాదు. తెలుగు నేల గొప్పతనానికి, తెలుగు జాతి మంచితనానికి, తెలుగు వారి తాత్త్విక సామర్థ్యానికి ఇది నిలువెత్తు నిదర్శనం.

**బౌద్ధ ప్రభావానికి లోనుకాని అతీతులెవరూ లేరు:**

చివరికి, వైదిక బ్రాహ్మణ భావజాలం కూడా బౌద్ధానికి లోనై పోయింది. అదీ, ఇక్కడ గమనించాల్సిన అంశం.

బౌద్ధం జీవహింసను వ్యతిరేకించింది. యజ్ఞ యాగాల్లో జరిగే హింసను తీవ్రంగా అడ్డుకుంది. అయితే, కేవలం మాంసాహారం మీద బ్రతికే ప్రజల్ని హింసావాదులని బౌద్ధం చెప్పలేదు. వారి ఆహారం మీద నిషేధం విధించలేదు. మోక్షం కోసమో, ముక్తికోసమో, పాపప్రక్షాళన కోసమో, యజ్ఞ యాగాల పేరుతో జరిగే జంతువధల్ని మాత్రం వ్యతిరేకించింది.దాన్ని హింస అంది.

ఈ బౌద్ధ దృక్పథంవల్ల అహింసాపూరిత పూజావిధానం ఒకటి కొత్తగా పుట్టుకొచ్చింది.

యజ్ఞజ్వాలకు బదులు..... ''ప్రమిదలు'', ''దీపాలు'' వెలిగించడం, యజ్ఞంలో అర్పించే రక్తానికి బదులు... సాంబ్రాణిధూపం వేయడం, జంతుతలలు ఖండించడానికి బదులు... కొబ్బరి కాయలు కొట్టడం, మాంస నివేదనకు బదులు... గారెలు, నైవేద్యాలు, పూలు, పండ్లు సమర్పించడం ఇలాంటి 'అహింసా'పూజావిధానం అంకురించింది.

ఈ నూతన విధానం. ఆంధ్రదేశంలోనే జరిగింది. చివరికి ఈ విధానాన్ని ఇక్కడి బ్రాహ్మణ మతం కూడా తీసుకుంది. అంతే కాదు అది ఇంకాస్త ముందుకు కూడా పోయింది.' బౌద్ధులు యజ్ఞ యాగాల్లోనే జంతుహింస వద్దని చెప్పారు. కానీ మేము ఇక ఆహారంగా కూడా మాంసం ముట్టం ' అనే కొత్త ఆహార విధానాన్ని ఇక్కడ బ్రాహ్మలు ప్రకటించారు.

( ఇటీవల –ఆర్.టి.సి. కార్మికులు 43% ఫిట్‌మెంట్ అడిగితే 44% ఇచ్చి చంద్రబాబుని కె.సి.ఆర్ మించిపోయినట్లు –)

అంటే... బౌద్ధ భావజాలాన్ని, దాటిపోవాలని వారెంతగా తెగించాల్సివచ్చిందో అర్థమవుతుంది. అంటే... బౌద్ధం ఇక్కడ అంతగా పాతుకుపోయింది. ప్రభావాన్ని చూపింది.

వారు ఇలా ఇక్కడ 'శాకాహారులుగా' మారిపోవడం అనేది, బౌద్ధం వల్ల ప్రభావితులై కావొచ్చు లేదా బౌద్ధాన్ని మించిపోవాలనీ కావొచ్చు – ఇలా హింసాపూరిత వైదిక సంప్రదాయం ఇక్కడ పూర్తి అహింసా పూజావిధానంలోకి మారిపోయింది. (వేదాల్లో, పురాణాల్లో, రామాయణ, భారత ఇతిహాసాల్లో– ఎక్కడా... అహింసా పూరిత నివేదన కనిపించదు.)

అంటే... రక్తం రుచి మరిగిన వైదిక దేవుళ్ళు... నైవేద్యం, పప్పు, నెయ్యి, ఫల, పుష్పాలతో సరిపెట్టుకోవాల్సి వచ్చిందన్నమాట.

వైదిక దేవుళ్ళకి , బౌద్ధ పూజావిధానంలో పూజలు మొదలయ్యాయన్నమాట.

ఈనాటికీ, తెలుగు నేలమీద ఎన్నో గ్రామాల్లో గ్రామదేవతలకి నైవేద్యాలు, గారెలు, పూలు, పండ్లతో జరిపే జాతర్లు ఉన్నాయి.

ఇలాంటి జాతర్లు ఆంధ్రదేశంనుండి కళింగకు, అక్కడినుండి ఉత్తరాదికి ప్రాకాయి. ఆ తర్వాత అశోకుడు ఇలాంటి పూజావిధానాన్ని జాతర్లని ప్రోత్సహించాడు. జంతు బలులు లేని జాతర్ల గురించి శాసనాలు వేయించాడు.

**అశోకుని శాసనం: (మొదటి శిలాశాసనం)**

> **"నా రాజ్యంలో ఎవరైనా, ఏ ప్రాణినైనా చంపే హోమాలు చేయరాదు. జాతర్లు చేయరాదు. ఇలాంటి జాతర్లలో ఎన్నో తప్పులున్నాయని ప్రియదర్శికి తోచింది. జంతు బలులు లేని కొన్ని జాతర్లు మాత్రం ప్రియదర్శికి ఇష్టమే......."**
> (ప్రియదర్శి అంటే అశోకుడే)

**గోవధను నిషేధించిన బౌద్ధం:**

యజ్ఞయాగాలూ, జాతర్లలో జరిగే జంతువధనే కాదు, 'గోవధను' మొదట నిషేధించింది బౌద్ధమే. గోవధవల్ల వ్యవసాయానికి కావలసిన, అవసరమైన జంతు సంపద తగ్గిపోతుందని, వ్యవసాయం కుంటుబడిపోయి, రైతాంగం దెబ్బతింటుందనే ఆలోచనతో మాంసాహారాన్ని నిషేధించని బౌద్ధం, ఆహారంగా అయినప్పటికీ "గోవధను" నిషేధించింది.

దానికి కారణం ఆవు మాత్రమే 'పవిత్రమైన జంతువు, మిగిలినవి నీచమైన జంతువులు'' అని కాదు– వ్యవసాయానికి, సమాజ ఆర్థికాభివృద్ధికి అవసరమైన ఆవుల్ని రక్షించుకోవాలనడం ఒక సామాజిక అవసరం. బాధ్యత కూడా.

గోవధనిషేధాన్ని గురించి ఈ దేశంలో మనకు లభించే మొట్టమొదటి ఆధారం– **సుత్తనిపాతం** లోని బ్రాహ్మణ **ధర్మసుత్తం** లో ఉంది.

"తల్లిదండ్రులు, అన్నదమ్ములు, ఇతర బంధువుల్లా ఆవులు కూడా మాకు ఇష్టమైనవే. మా వ్యవసాయానికి ఆధారం అవే. మాకు అన్నాన్ని, బలాన్ని, కాంతిని, సుఖాన్నిచ్చే దాతలు అవే. ఈ విషయం తెలుసుకున్న జ్ఞానులు గోవధ చేయరు." – ఇలా బౌద్ధులు, గోవధను వ్యతిరేకించారు. ఇక్కడ గోవధ అంటే వ్యవసాయానికి ఉపకరించే పశు సంతతి అని అర్థం చేసుకోవాలి. అయినా, వైదిక ధర్మాచార్యులు మాత్రం గోవధను సాగిస్తూనే ఉండేవారు.గోమాంసాన్ని తింటూనే ఉండేవారు.

గోవధను బుద్ధుని కాలం నుండి (అంటే అశోకునికి ముందే) బౌద్ధులు వ్యతిరేకించినా, ఆ తర్వాత ఐదారు వందల సంవత్సరాలదాకా బ్రాహ్మణులు గోవధ చేస్తూనే వచ్చారు.

మొదటగా వైదిక వాఙ్మయంలో కనిపించే గోవధనిషేధ విషయం –

"యజ్ఞం చేసే బ్రాహ్మణుడు మాత్రమే ఆ సమయంలో 'ఆవు

మాంసం' తినకూడదు" అని **శతపథ బ్రాహ్మణం** లో ఉంది. మరలా అందులోనే ఇలా కూడా ఉంది : "ఆవుమాంసం శరీరానికి బలాన్నిస్తుంది. అందుకే నేను ఆవు మాంసం తినక తప్పదు"-అని యాజ్ఞవల్క్యుడు అంటాడు.

అంటే కొందరు "తినొచ్చు" అని, కొందరు "తినకూడదు" అని, ఇలా రెండు రకాల వాదాలూ శతపథబ్రాహ్మణంలో ఉన్నాయి.

అయితే,క్రీ.శ. 7వ శతాబ్దానికి, అంటే అశోకుని తర్వాత వెయ్యేళ్ళకి, భవభూతి వ్రాసిన ఉత్తరరామ చరిత్రలోని 4వ అంకంలో-

"శ్రోత్రియ బ్రాహ్మణుడు అతిథిగా వస్తే- నల్ల ఆవుదూడ మాంసంతో చేసిన మధువర్కం ఇవ్వాలి' అని ఉంది. ('నామాంసోమధుపర్కో భవతి- మాంసంలేక అది మధుపర్కమేకాదు- అశ్వలాయన గుహ్యసూత్రం-1-4)

ఏతావాతా తేలిందేమంటే....

బ్రాహ్మణులు శాకాహారులుగా మారింది తొలుత తెలుగు నేల మీదే. (జైన సంప్రదాయం బలీయంగా ఉన్న గుజరాత్‌లో తప్ప ఉత్తరాదిన ఈనాటికీ శాకాహారం బలీయంగా లేదు.)

వీరు ఇలా మారడానికి కారణం- బౌద్ధప్రభావం వల్లనైనా కావొచ్చు లేదా బౌద్ధాన్ని మించిపోవాలనే తలంపు కావొచ్చు.

అందుకే... చరిత్రలోని ఒక మలుపుకు ఈ తెలుగునేల శ్రీకారం చుట్టిందని చెప్పుకునేది. అందుకు కారణం బౌద్ధమేనని ఒప్పుకునేది.

ఒకటి: పండితులు, మేథావులు, ప్రాజ్ఞులు, వాదోపవాద పటిమ గల ఘనాపాటీలు మాత్రమే ఆకళింపు చేసుకోగల ఒక నూతన తాత్త్విక దృక్పథాన్ని తలకెత్తుకుని, దాన్ని పామర జనానికి అందేలా చేసిన నేలగా మన తెలుగునేల కీర్తి అజరామరం.

రెండు : నిరంతరం యజ్ఞయాగాలు, హింసలు, జంతు వధలతో నిండిపోయిన బ్రాహ్మణ భావజాలం మీద కూడా బలీయమైన ప్రభావాన్ని చూపడం అసామాన్యం.

చరిత్రలో ఈ రెండు పనులను ఈ తెలుగునేల మీద బౌద్ధం చేసింది. చేసి చూపింది.

అందుకే బౌద్ధం ఈ నేలను తడిపిన తొలి ధర్మతొలకరి.

**రచయిత ఫోన్: 9390600157**

# అమ్మభాష

ఆ॥ జనని జన్మభూమి స్వర్గము కన్నను
శ్రేష్ఠమని తొలికవి చెప్పినాడు
అమ్మభాషకూడ అంతటిదే కాన
దాని నిలుప వలయు వాని సరస

**ఆచార్య పి.ఎల్. శ్రీనివాసరెడ్డి**
9441493777

# సంపాదకుణ్ణి అడగండి

***అడక:*** ***మీ పత్రికలో కథల్ని జిల్లాలవారీగా ఎందుకు పేర్కొంటున్నారు... కడప కత అనీ, చిత్తూరు కత అనీ...?***

**మారుపలుకు:** తెలుగులో మాండలికాల్ని ప్రాంతాలపేర తెలంగాణ, రాయలసీమ, ఆంధ్ర, ఉత్తరాంధ్ర అంటూ నాలుగుగానే చెప్పడం శాస్త్రీయం కాదని మేం చెప్పదలచుకొన్నాం. అనేక రాజకీయ, సామాజిక, ప్రాకృతిక కారణాలవల్ల నుడితీరు తావు తావుకూ మారుతూ ఉంటుంది. కనీసంగా జిల్లాను గుర్తుగా పెట్టుకొని ఆ వైవిధ్యాన్ని గుర్తింపజేయడమే మా ఉద్దేశం. తెలుగువారు ఎక్కడ బతుకుతున్నా వారు మాట్లాడే నుడి తీరులోనే కతలను వ్రాసి పంపాలనడం అందుకే. తెలుగు ఎంత వైవిధ్యంతో బలంతో ఉన్నదో తెలుగువారందరకూ తెలియాలనేదే మా ఉద్దేశ్యం. పత్రికాభాషగా పేర్కొనబడుతున్న నిబంధనను కతలకు వర్తింపచేయడం వల్ల రచయిత స్వేచ్ఛను కోల్పోతాడనీ, ప్రకటనా సామర్థ్యాన్ని కోల్పోతాడనీ, పాత్ర మాట తీరును మార్చి, పత్రికా భాషపేర ఒక కట్టడి చేయడంవల్ల అమ్మనుడి ఎదగదని చెప్పడమే మా ఉద్దేశం.

***అడక:*** ***కథను చెప్పడం, పాత్రను వర్ణించడం వంటివి అందరికీ అర్థమయ్యే పత్రికాభాషలో వ్రాసి, పాత్రల మాటల్ని మాత్రం వాళ్ల పలుకు తీరులో తెలిపితే బాగుంటుందేమో ఆలోచించండి.***

**మారుపలుకు:** మీరు చెప్పేదాన్ని మేం కాదనడంలేదు. అది రచయిత ఇష్టం. కాని, ఇక్కడ కొన్ని ప్రశ్నలు తలెత్తుతాయి. పత్రికాభాష అంటే ఇదే అనే నిర్వచనం ఏమన్నా ఉందా? తెలుగునేలపై ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమాలకు ఇదొక కారణం కాదా? ఒక ప్రాంతపు మాటతీరు వ్రాతలో మరొక ప్రాంతంవారికి అర్థం కానంత పరిస్థితి అసలు ఉందా? యాసల్ని పూర్తిగా వ్రాతలోకి తేలేకపోవచ్చుగాని పలుతావుల పలుకులను నిషేధించే హక్కు ఎవరికుంది? ఆ పలుకుతీరును, పలుకులనూ పత్రికలద్వారా ఎక్కువగా ప్రచారం చేస్తేనేకదా తెలుగునుడి పెరిగేది? ఆలోచించండి.

**కథల్లో భాషగురించి కొందరు రచయితలు, చదువరులు కొంత వివరణ కోరుతూ అడుగుతున్న వాటికి ఇక్కడ బదులిచ్చాము. ఈ అంశాలపై ఇంకా స్పష్టత కావలసివస్తే నేరుగా మాట్లాడండి.**

**-- సంపాదకుడు**

గోదావరి లోయలో
కొండరెడ్ల
బతుకు కతలు - 4

# ఆటపాటలు వినోదవస్తువులు

**- శ్రీ పల్లాల బొర్రంరెడ్డి**

1. కిర్రు కోస = కిర్రోం కొక్కిడి
2. డిమ్మ
3. సంగు
4. డోళ
5. కనికెలు = గతులువేసేవి



**సొండెవిల్లు:** ఇది మూగజీవులను లేపి ఉత్సాహావరిచే సాధనం. వెదురు బద్దతో చేస్తరు. కుడివైపు ఉన్న వెదురుబద్ద చివరకట్టిన తాడు పట్టి, ఎడమవైపు ఉన్న రెండు వెదురుబద్దల చివర పట్టి, నోరు ఆగలించి, కొసలు కలిపితే, మంచి స్వరం వినిపిస్తది. సొండలు అనగా కింది మీది పెదవులు ఎలా ఆడించితే అలా పాడవచ్చు.





**కెంటకూర:** కెంటకూర అనగా వీణను పోలిఉంటది. వెదురు బద్దలు చేసి, బద్దలకి రెండువైపుల కన్నం ఉంచి ఆ కన్నంలో సన్న వెదురు పుల్లలు ఉంచుతరు. వాటి చివర రాగితీగెలు కట్టుతరు. ఆ పుల్లలు రాగితీగె బిగింపు కొరకు టింగుమని మోగుటకు. మొదటి భాగంలో కొబ్బరిచిప్పకి మేక చర్మం ముడుచుతరు. అది తాంబూర రూపంలో ఉంటది.



**చికువిల్లు:** ఆవుతోక వెంట్రుకలతో విల్లురూపంలో తయారుచేసిన వెదురుబద్ద. దీనితో కెంటకూర ఆ తీగెలమీద చికువిల్లు మీటుతరు. నచ్చినస్వరం - రాగం వచ్చును. ఇది కోడికూతజామున పాడించుతరు.



**డోళ:** పిండిపండగరోజున వాయించి దేవతలను ఆనందపర్చుతరు. ఈ డోళ శబ్దంవిని ఆరోజున సోమ, మంగళవారం దేవతలు కొలువుతీరుతరు. మనుషులను దేవతలు పూని శివం దూలుతరు. దీనిని వెజ్జుతుల్లడం అంటరు. ఈ పండుగ ప్రతిసంవత్సరం చేస్తరు. ఈ పండుగ చేసినతర్వాత చిక్కుడుకాయలు చోడిపిండిఅంబలి, కందిపప్పు తింటరు. పండుగ చేయకుండ అవి తినరు.



డోళ వరుసగ ఎత్తుకొని కొడతరు. సంగ పక్కముఖంలో ఎడమచేతి వ్రేళ్ళతో సంగ సంగమని కొడతరు. చేతివ్రేళ్ళతో డిమ్మ(ముడ్డి)పక్క డిమ్మకర్రతో దుంగు దుంగుమని కొడతరు. డిమ్మపక్క ఆవుచర్మంతో ముడుచుతరు. సంగపక్క మేకచర్మంతో ముడుచుతరు. కర్రలను గుండ్లుగచేసి వాటిని డోళడుంకమూతిలో దిగగొట్టి వాటిమధ్య తొక్కలను మడిచి ముడుచుతరు. ఈ డోళలను, పెద్దవేగిస మానులను నరికి డొళ్ళగొట్టి, కన్నంపెట్టుతరు. నును పు చేసిన వెదురుబద్దలు రెంటితో కన్నికె దెబ్బలు కన్నెకె దెబ్బలు - కన్నెకి దెబ్బలు అంటు గతి, సుతి వేసికొడతరు. డోళలశబ్దానికి వేడి(డు)కబస ఒక ఉరుమి ఉర్మతది. గుండెలు అదిరిపోతవి. ఈ డోళలు ఆదివారం భోగిఅని, ఆరోజునుండి సోమ, మంగళ, బుధ, లక్ష్మి, శుక్రవారంవరకు వాయించుతరు. మరల పిండిపండుగ వచ్చేవరకు వాటిని వాడరు, వాయించరు. ఈ వాయిద్యంను పిండిపండుగ రోజున మాత్రం వాడుతరు. ఇతర పండుగలకి వాడరు.






కనికె

పండుగకు చుట్టుపక్కల గ్రామాలవారు సరదాకి వస్తరు. వారికి గ్రామములో ఉన్న అన్నిరోజులు భోజనాలు పెట్టాలి. ఇతర గ్రామాలనుండి వచ్చినవారుకూడ వెజ్జుతుల్లడంలో పాల్గొంటరు. ఈ పండుగ గంగరాజు, ఎర్రమార్గం, మావిలి, రాచకొడుకులు, రాచకూతుర్లు, గన్నిగెలు ఉన్న గ్రామంలో ఈ కొలువు చేస్తరు. ఈ డోళగతులు 'తప్పితె గరగలు, పాతకోట భరతం, బొడ్డుకింద బొక్క... దెబ్బలగూంటం' అని దర్వులు వెదురుపుల్లలతో కొడతరు. డిమ్మకూడా లయకి తగినట్లు వాయించుతరు.



### ఆ రోజుకె సరసాలు, సరదాలు

మన్నెప్రాంతంలో రెడ్ల పండుగలు, పెండ్లిలు ప్రతి సంవత్సరం జరుగుతవి. అవి –

**పిండిపండుగ:** ఆదివారం భోగి, సోమవారం దేవతలకి కోళ్ళు, మేకలు పూజారి బలిస్తడు. ఆదివారం రాత్రి అంత ఆడవారు –

'చందమామయ్యో ఆ కొండపల్లెన ఏమేమి పండు

నాచేతి చినగాజు నెలబడ్డదప్పా – మనవేగు జాముగ వెనకరా చెల్లె

ముద్దుల మనమరిది ముందిరిడప్పా – రెడ్డివారింటి వెనుక పువ్వులమ్మ పువ్వులో' అంటూ పల్లవి ఎత్తి పాడతరు.

మగవారు డోళలు కొడతరు. వెజ్జు తుల్లుతరు. ఆ రాత్రి అంత ఆనందంగ అగ్గిపర్వతాలు బద్దలుగొట్టినట్లు సరదాలు బయటకి వస్తవి. చంటిబిడ్డతో సహా ఆనందంగ వేడిక చూస్తుంటరు.

**గంగాలమ్మ పండుగ:** మంగళవారం మధ్యాహ్నం గంగాలమ్మకి మేకలు, కోళ్ళు పూజారి బలిస్తడు. మంగళవారంరాత్రి, బుధవారంరాత్రి ఆడ–మగల తేడలు లేకుండ గంగలమ్మ దృష్టిలో ఉంచుకొని పచ్చిబూతు పాటలు, కోలటంపాటలు పాడుతరు. ఏ మగవాడు ఆక్షేపించడు, అడ్డురాడు. ఆ రెండురోజులవరకె మన్ననలు, మర్యాదలు, ఎగతాళిపాటలు, కన్నుకొట్టడం, గిల్లుకొడం, పాతగ ఎరిగినవారు ఒకరికొకరు ఇష్టపడి లెగిసిపోడం, కావలసినవారు పెండ్లి నిర్ణయాలకి ఒప్పందాలు పడడం జరుగుతది.

ఈ పాటలు నిండునూరేళ్ళు నిలిచి జీవించటానికి పునాదులు. ఈ పాటలు పాడినప్పుడు ఆడినప్పుడు కులం, అన్న, తమ్ముడు అప్ప, వదినె, మరిది, బావ, మామ, అల్లుడు ఎవరు ఏమి అనుకోరు. అందరు పాడుతరు, అందరు తాగుతరు. కామవాంఛతో కూడిన పాటలు, బూతుపాటలు ఈ పండుగరోజులు ఉన్నంతవరకే. పండగ అయిపోయి మరల ఆ పండగవచ్చేవరకు ఆ పాటలు ఆ ఊసులు వినిపించవు. నృత్యం చేయరు, పాటలు పాడరు. పెండ్లికి ఆడమగ కలసి నృత్యం చేయుచు మువ్వలదుడ్లు పట్టి ఆడుతరు.

జీవితాంతం అల్లుకుని ఉన్న కష్టాలు, బాధలు, సుఖాలు ఉన్నప్పటికి, ఆ పెండ్లిరోజులు మాత్రమే పెద్ద, చిన్న, పడుచు, ముసలివారికి తారతమ్యం లేక పాడవచ్చు, అడవచ్చు. మరల పెండ్లి రోజుకే తిరిగి సంభాషణలు. మధ్యకాలంలో నృత్యాలు, ఎగతాళిలు, బండబూతులు వినిపించిన, బూతుపాటలు వినిపించిన పెద్దలకి తప్పులు చెల్లించాలి. కులానికి విందులు చెల్లించాలి. ఊరు వీడి పారిపోవలె. లాగించడం, ఎత్తుకుపోడం, మగనాలుపోడం ఉంటవి. కొందరు ఎంచుకొని పెండ్లి చేసుకుంటరు, కొందరు ఎత్తిమోసి పెండ్లి చేసుకుంటరు. ఇవి అన్ని కులంవాడితో, కులందానితో మాత్రమే సంబంధాలు ఉంటవి. ఇతర కులాలవారితో ఇటువంటి అక్రమ పద్ధతులు ఉండవు. ఒక వేళ ఉన్న యెడల మెర్రి, వెలి జరుగుతది.

అన్నం తిన్నట్లు, దాహానికి నీళ్ళు తాగినట్లు, నిద్రవచ్చినప్పుడు పడుకున్నట్లు – అన్నంపెట్టినప్పుడు తిన్నట్లు – కామవాంఛ తీర్చుకుంటారు తప్ప, కామవాంఛను బయటపెట్టరు. అది బయటికివస్తే సిగ్గు, ప్రపంచంలో తలెత్తి తిరగలేనిది. దానిని ఎంత లోపల లోతుగ దాచి ఉంచితే అంత మంచిదని వారి భావం.

ఈ మధ్యకాలంలో మన్నెప్రాంతాలకి ప్రయాణసదుపాయాలు ఏర్పడి, గిరిజనేతరులు బతుకు తెరువుకు వలసవచ్చి క్రమశిక్షణతో మౌనముగ ఉన్న మన్నె స్త్రీలను, మబ్బుచాటు మంచువంటి తీయటి మాటలు నూరిపోసి పాడుచేయడంతో వారి బంగారు బతుకులు మంచు విడిచిన మేఘాలవలె సమాప్తి అయిపోతున్నవి.

**రచయిత ఫోన్ : 08864 244873, 8500935424**

*29వ పేజీ తరువాయి... **'అమ్మవంటిల్లు'***

వుండే తన రెక్కల గూడుని, అలంకరణగా నిలిచిన పొజుట్టును, వేలాడే రెండు వుట్లను పదేపదే తడిమి చూసింది. ఎందుకైనా మంచిదని వుట్లను కిందికి దింపించింది. కృష్ణలీలగా అమ్మ ఆ ఉట్లతాళ్ళను ముడుతూ, ఆ... అంది. వాటిని ఒక సంచిలో జ్ఞాపకాల పెట్టెలో పెట్టినట్లుగా భద్రంగా ఉంచేసింది.

అమ్మ, నాయనలు ముహుర్తం రోజున కొబ్బరి కాయలు కొట్టి పునాది పూజలు చేశారు. గడ్డపారతో సుతారికొంత తవ్విన గోతిలో పసుపుకుంకుమలు చల్లి, పూలు వేశారు. వాళ్ళిద్దరి కళ్ళలో నీరు ఆగకుండాఉబికి వచ్చింది. పాత వైభవం కనుమరుగవుతున్న తప్పని మలుపుదశను వారిద్దరు తట్టుకోలేకపోతున్నట్లు తెలిసిపోయింది. నలుగురు కొడుకులు, కోడళ్ళు, మనవలు, మనవరాళ్ళు, ఇద్దరు, కూతుర్లు, పరివారమంతా శాంతపరచాము. అందరం పాత ఇంటి జ్ఞాపకాలను నెమరువేసుకున్నాం. తలా మాకు ఇరవై ఏళ్ళకు మించిన అనుబంధం పాత ఇంటితో పెనవేసుకుని పోయింది. మా అందరికి కొత్త ఇళ్ళు వస్తున్నాయన్న సంతోషం, మమ్ములను ఎకసక్కంగా ఎక్కిరించినట్లయింది. మా అమ్మ మాత్రం తనకు కన్నతల్లిలాంటి వంటింటినిఅదేపనిగా రెప్పార్చకుండా చూస్తావుంది. ఇంటినికూల్చే పదిమంది కూలీలు వచ్చి వంటింటి గోడపై గడ్డప్పారతో పోట్లు వేస్తుంటే, అమ్మ తట్టుకోలేక తెగ బాధపడిపోయింది. ఆపండి, ఆపండి అనికేకలేస్తు అరిచింది, ఎంత వారించినాలాభంలేకపోయింది. అమ్మ వంటింటి వైపే పిచ్చిపిచ్చిగా చూస్తు తెలివి తప్పి కిందపడిపోయింది. అమ్మా,అమ్మా అంటూ అందరం అరిచాం. అనుమానమొచ్చిన మా నాయన అమ్మ నాడి పట్టి చూచాడు. హఠాత్పరిణామానికి అందరం నోర్లు వెల్లబెట్టాం. అమ్మ కంటిగుడ్లు వంటింటివైపే చూస్తున్నాయి. అమ్మ గుడ్లుతేలేసింది అంతె ఇగ లెవ్వలేదు.

**రచయిత ఫోన్ : 94417 97650**

కొంగునాడు కత

– చిరంజీవి మార్టూరి సంజ్ఞా పద్మం

# టెంకాయల దొంగ

నేను అప్పుడు "సామి నెజంగానే ఉండాడా ఉవా" అంటా అడిగితి.
"సామి లేడంటే ఆ దొంగని ఓరు పట్టుండుతురు... సరి, నాకు నిదరవచ్చె, నే పోయి పండేను" అంటా ఉవా పోయి పండేసె.
అనిక నేను అమ్మ దగ్గిర అడిగితి "ఏమ్మా సామిదా ఆ దొంగను పట్టిచ్చెనాండా మా" అంటా అడిగితి.
"ఏడ సామి పట్టిచ్చింది. వాండు సారాయిని తాగేసి మబ్బుల వచ్చి పండేసినాండు" చెప్పింది మా అమ్మ.

**నాండు**, ఒకే వాన, బైట కాలు పెట్టేదానికి లేదు. నేనూ నా తమ్ముండు అరీ, నా చెల్లెలు అచ్చూ అందురా ఆటాడేదానికి ఎడము లేకుండా లోగనే కూసుండి ఉండితిమి. అబ్బ ఇంట్లా లేడు. టీవీని మేస్తే దాంట్లా ఒక నడుపూ చూసేనట్ల లేదు. దాన్నించి, మా అమ్మ దగ్గరికి పోయి కత చెప్పమని అడిగితిమి.

దానికి మా అమ్మ, ''ఇంటిని ఊడవనే లేదు, ఒకే దుమ్ముగాఉండాది. కూడు వేరే వండాల. నేనుదా అంగడికి పోయి కూరాకు తీసికొనొచ్చి వండాల. నే ఈడ కత చెప్పుకొని కూసుని ఉండితే, ఈ పనులు అంతా ఓరు చేస్తురు" అని తిట్టింది.

"సరి మా, నీకు నిండా పని ఉండాది అని మాకు తెలుసు, దానిని మాదగ్గిర చెప్పద్దు. వేము నీకూడా పని చేస్తే, అప్పుడు కతచెప్పుతువా" అని అడిగితిమి.

"చెయ్యండ, అనిక చూసుకోవచ్చు" అనింది అమ్మ.

సరి అంటా అరీ అచ్చూ సైకిల్లా పొయి కూరాకు తీసుకొనొచ్చి అమ్మ దగ్గిర ఇచ్చిరి. నేను చీంపిరి ఎత్తుకొని ఇల్లంతా ఊడిచేస్తిని. అమ్మ కూడు వండేకి ఆరంభించింది. ఇంట్లా బిడ్డలం ముగ్గురూ అమ్మా ఊవా, అయిదుగురుదా ఉండాము. దానికని మా అమ్మ కూరాకు మట్టుందా ఎణిపింది. అన్ని పనులూ ముగించికాని అందరూ కూసుండి తింటిమి. నాండు కూరాకు నిండా బాగుండింది.

''ఇదిఏంటి కూరాకుమా నిండా బాగుండాది"అని అడిగితిని.

"అంగడిలా ఏంటి కూరాకు చిక్కు చిరికూరాకుదా. దీనికే ఇట్ట చెప్పేవు, చేనుకుపోయి పీంకొని వచ్చే కూరాకయితే ఇంకా బాగుండు" చెప్పింది అమ్మ.

"చేనులాఏంటి ఏంటికూరాకులు చిక్కు మా?" అడిగినాండు అరి.

నిండా కూరాకులు ఉండురా. గురుకూరాకు, దొండకూరాకు, చెంచలకూరాకు, కుమటకూరాకు, కుప్పకూరాకు, కాంచికూరాకు, వల్లకూరాకు, పొన్నగన్ని కూరాకు, పులిమంజి కూరాకు ఇట్ట ఎంతనో వగలు ఉండాయి. ఒకో కూరాకు ఒకో రుసి" అని చెప్పింది అమ్మ.

"ఈ కూరాకు, వేము తీసుకొని వచ్చిందాన్నించి ఇంత బాగుండాది" అని





పొయి అడగండ" అంటూ చెప్పింది అమ్మ.

అప్పుడు మేము ఉవా దగ్గిరికి పోయి "ఉవా ఊవా ఏదో కతచెప్పు" అని అడిగితిమి. అమ్మకి అమ్మను మా తావులా 'సామ' అని పిలుస్తురు. అయితే మేము మట్టుము మా సామను 'ఉవా' అని పిలుస్తుము. అట్ల ఏల పిలిచేము అనేది ఇంకోసారి చెప్పేను.

''ఏదోఅంటే ఏమికత చెప్పేది'' అడిగింది ఉవా.

పాట

## వాగు మధువై - అరక నగవై

పll **కొ**మ్మ చాటున కోయిలమ్మ<br>
రెమ్మ మాటున తేనెబొమ్మ<br>
పాడెనదిగొ పరవశమ్మున<br>
పరిమళించెను పూలవనము

చll నింగి మోమున రంగు రంగుల<br>
ముగ్గులల్లెను మబ్బు తునక<br>
తొంగి చూచిన విద్యులతల<br>
మొగ్గ తొడిగెను వెలుగులతిక

చll చినుకు చినుకు చేయికలిపి<br>
పరుగులెత్తెను వాగు మధువై<br>
పొంగి పొంగి మెరక తడిపి<br>
అరక అధరపు మొలగ నగవై

చll కరిగి కరిగి మేఘమాల<br>
కరుణతోడ వరుణమాయె<br>
వొరిగి వొరిగి వర్ణమాల<br>
ధరణి నుదుటన తిలకమాయె

- వై. హెచ్.కె. మోహన్ రావు
సెల్‌నం. 94401 54114

తోడనే అరి లేసి "పులికత చెప్పు, సింగం కత చెప్పు, ఫైటు, సింగంకత చెప్పు, ఫైటు కత చెప్పు" అంటూ దుమికినాండు.

"అట్టన్నీ ఏకతావద్దు, ఏదో మంచి సోంబేరి కత చెప్పు" అంటా అడిగింది నా చెల్లెలు.

వాళ్ల మాటలు విని మా అమ్మ నవ్వి "వాళ్ల వాళ్లకు తగినమాదిరి కతలుఅడిగి ఉండారు చూడు మా" అనింది ఉవా తోడ.

"అట్టా కతలన్నీ ఏంటికి, నిజంగానే నడిసిన కతని చెప్పేను, వినండ"అని ఉవా. మేమంతా "చెప్పు చెప్పు" అంటా ఉవా దగ్గిరికి పొయి కూసుంటిమి. ఉవా కతను ఆరంబించె.

"మావూరు మడుకుపల్లిలా మనకొక టెంకాయతోపు ఉండింది". అంటూ ఉవా ఆరంభించే లోగానే అరి నడువులా దూరి ''మామిడి తోపు లేదా ఉవా'' అంటూ అడిగినాండు. ఏలంటే అరికి మామిడిపండు అంటే నిండాపట్టు.

"ఇట్టన్నీ దూరిదూరి మాటాడితే, నేను కతచెప్పను రా" అనింది ఉవా.

''గెమ్మట ఉండురా'' అంటానేనూ అచ్చూ చేరి అరిని బెదిరిస్తిమి. మళ్లీ ఉవా ఆరంభించె.

"ఆ టెంకాయతోపులా దినమూ ఒక దొంగ వచ్చి టెంకాయిల్ని దొంగిలిచ్చుకొని పోతా ఉండె. ఆ దొంగని పట్టేదానికోసరం తాత చెన్నా బంగారుసామినాయుడు, ఇద్దరు మనుసుల్ని కావిలికి పెట్టినాండు".

"అది ఏంటి పేరు ఉవా, తాతపేరు అట్టఉండాది" అడిగింది అచ్చు.

"ఆకాలాన తెలుగువాళ్లు అదిమాదిరి పేర్లుదా పెట్టుతురు. పేరుకు ముందరాట ఇంటి పేరునూ చేర్చి చెప్పుతురు. అదిదా మన వాడిక" చెప్పింది ఉవా.

"ఇంటిపేరు అంటే ఏమి ఉవా, మన ఇల్లుకు పేరు ఉండునా" అడిగినాండు అరి.

"ఇల్లుకుఉండే పేరు కాదురా. తెలుగు మాటాడేవాళ్లకు కుటుంబానికి ఒకపేరు ఉండు. దానిని దా ఇంటిపేరు అనేరు. కొంగాళ్లకి ఇంటిపేరంతా ఉండదు. మా ఇంటిపేరు చెన్నావారు. మీ ఇంటిపేరు మార్తూరివారు. సరి సరి చెప్పేది వినండ" అంటా కతను తొడరింది ఉవా.

''కావిలివాళ్లు ఉంటేనూ దినమూ టెంకాయిలు దొంగతనం పొయికొనే ఉండాయి. ఆ దొంగానూ చిక్కలేదు. రాత్రిపూట ఆడ ఏమి నడిసికొని ఉండాదో తెలవనే లేదు. మాకు అందురికీ కావిలికి పెట్టుండేవాళ్ల పైకి దా సందేహంగా ఉండింది. ఒకవేళ వాళ్లేంది దొంగిలించుకొంటాఉంటే ఏమిచేసేది అంటూ బంగారుతాత ఒకరాత్రి నిదరపోకుండా కావిలి ఉండినాండు. అప్పుడునూ ఆ కిలాడి దొంగ చిక్కలేదు.

మీ తాతకు ఒకే కోపం వచ్చి, మన తోంటకు దగ్గిర ఉండే దొంది వినాయకుడు గుడికిపొయి, 'నువ్వంతాఒక సామినా, నీకళ్లకు ముందరనే దొంగిలించుకొని పొయికాని ఉంటే, నువ్వు చూసుకొనే ఉండావు. బాగా పెద్ద దొంది మట్టుము ఉండాదే, వాడిని పట్టేకి ఏమికష్టం. శుద్ద గుడ్డిసామిగా ఉండావు' అంటా తిట్టేసి ఇంటికి వచ్చేసె.

మరుసదినం తెల్లార్తో మన తోంట పన్నమనిసి బయిటికిపొయి వచ్చేనప్పుడు, దొంది వినాయకుడు గుడి మటాన ఒకండు టెంకాయిలతోడ పండికొని ఉండేది చూసినాండు. తోడనే 'దొంగ, దొంగ, రండ, రండని కూసినాండు. దానిని వినిన బంగారు తాత, కొందురు మనుసుల్ని కూడా పిలుసుకొని గుడి దగ్గరికి పరిగెత్తి పొయినాండు. ఇంతసద్దు చేసికొని ఉంటేనూ ఆదొంగ లేవలేదు. తాత వాడి దగ్గరికి పొయి లేపితేనూ లేవనేలేదు. దొంది వినాయకుడికిపోసే మాదిర నాలుగైదు పంటిల నీళ్లు చేంది పోసినొక లేసినాండు.

అందురూ చేరి వాండిని ఒక మానులా కట్టిపెట్టి బాగా సాతిరి. బాగా పెట్టుపెట్టి తన్నులుతన్ని అయినాక కరంటు మానుపైకి ఎక్కమనిరి. వాండు ఏడిసికొని 'నన్ను మన్నిచ్చుకోండా నాయండ్లా. నే ఇంక పెద్ద పల్లాముకు పడారపక్క ఒక అడుగుకూడా ఎత్తిపెట్టను. నన్ను వుడిసేయండ సాములా. ఇన్ని దినాలాల్లా నేందు దాఏమో నాకు కన్ను తెలవకుండా పోయె' అని చెప్పుకొని, పెద్దోళ్లు చిన్నోళ్లూ అందురి కాళ్లమిందా పడినాండు. ఏల, మీ మావ అప్పుడు ఇంకా దవుసరుకూడావెయిలా, వాండి కాళ్లకు కూడా మొక్కినాండు.

అప్పుడు మీ బంగారుతాత పాపమంటా చెప్పి, వాండికి టీ తీసిచ్చి, బన్నుకుకాసు ఇచ్చి, 'ఇంక ఈడకాలెత్తి

## నారద జయంతి సందర్భంగా
# ఉత్తమ పాత్రికేయులకు పురస్కారం



మే 31 సాయంకాలం 6గంటలకు విజయవాడ – హోటల్ ఐలాపురంలో నారద జయంతి సందర్భంగా కీర్తిశేషులు వడ్లమూడి రామమోహన్‌రావు స్మారక పురస్కారాలను ఐదుగురు జర్నలిస్టులకు ఇచ్చారు. వారు శ్రీ ఎంవిఎస్ ప్రసాద్ (సీనియర్ జర్నలిస్ట్), శ్రీ లక్కవరపురామమూర్తి (ఉత్తమ జర్నలిస్ట్), శ్రీ వంజా రూబెన్ బెసాల్‌టెల్ (ఉత్తమ ఫోటో జర్నలిస్ట్), కె. మనోహర్ రెడ్డి (ఉత్తమ వీడియో గ్రాఫర్), శ్రీసరస్వతుల రామనరసింహం 'సరసి' (ఉత్తమ కార్టూనిస్టు) ఈ అవార్డులను పొందారు. సభకు శ్రీ నార్ల వినయకుమార్, అధ్యక్షత వహించగా, శ్రీ నందకుమార్ ప్రధాన వక్తగా పాల్గొన్నారు. కార్యక్రమాన్ని నిర్వహాక డాక్టర్ దుగ్గరాజు శ్రీనివాసరావు, డాక్టర్ టి. శ్రీనివాసరెడ్డి, శ్రీ రామశాయి నిర్వహించారు. పురస్కార గ్రహీతల ఫోటోల, వీడియోల, కార్టూన్ల ప్రదర్శన ఆకట్టుకొంది.

పద్యాలు

# కమ్మనైన తెలుగు

ప॥ **ఉ**గ్గుబాలతో ఊసుల బుగ్గగిల్లి
జోలపాడి ఊయలలూపి లాలితోడ
బొజ్జ నిమిరినట్టి జనని ఒజ్జభాష
కమ్మనైన తెలుగు మన అమ్మనుడిర

ప॥ **పు**డమి తల్లిని వానలు తడిపినట్లు
పూలచెట్లకు తావిని పులిమినట్లు
తెలుగుమాటలు విన మేను పులకరించు
కమ్మనైన తెలుగు మన అమ్మనుడిర

ప॥ **జ**ననికంటె గొప్ప యెవరు జగతియందు
అన్యభాషలు నేర్చిన హాయిరాదు
తల్లినుడులను మించిన తావిలేదు
కమ్మనైన తెలుగు మన అమ్మనుడిర

**- రాఘవ మాస్టారు, బెంగళూరు**
సెల్‌నం. 09741407099

పెట్టితివంటే నీకాలును కొట్టేస్తుమురా' అంటా చెప్పి వాండిని అంపిపెట్టె."

"అనిక" అనినాండు అరి.

''అనిక ఏమి అనిక. కత ముగిసిందిరా" అనింది ఉవా.

"ఏమి ఉవా, సామిదా ఆ దొంగకు కన్ను తెలవకుండా చేసినాండా" అంటూ అడిగిందిఅచ్చు.

"అవురా, దొంది వినాయకుడికి అంత శక్తి" అంటా చెప్పింది ఉవా.

నేను అప్పుడు "సామి నెజంగానే ఉండాడా ఉవా" అంటా అడిగితి.

"సామి లేడంటే ఆ దొంగని ఓరు పట్టుండుతురు... సరి, నాకు నిదరవచ్చె, నే పోయి పండేను" అంటా ఉవా పోయి పండేసె. అనిక నేను అమ్మ దగ్గిర అడిగితి "ఏమ్మా సామిదా ఆ దొంగను పట్టిచ్చెనాండా మా" అంటా అడిగితి.

"ఏడ సామి పట్టిచ్చింది. వాండు సారాయిని తాగేసి మబ్బుల వచ్చి పండేసినాండు" చెప్పింది మా అమ్మ.

1) ఎడము : చోటు
2) నడుపు : కార్యక్రమం
3) ఓరు : ఎవరు
4) అనిక : తర్వాత
5) మట్టుం : మాత్రం
6) తోడనే : వెంటనే
7) పట్టు : ఇష్టం
8) గెమ్మట : ఊరకే
9) కొంగాళ్లు : తమిళులు
10) తొడరు : కొనసాగించు
11) దొంది : బొజ్జ
12) పన్నమనిసి : పాలేరు
13) పంటి : బిందె
14) మబ్బు : మత్తు

**కత గురించి :ఈ కత తెన్నాడు (తమిళనాడు)లోని కొంగునాడు తావు తెలుగుకత. తెన్నాడులో కొంగు, మొరసు, చోళ, తొండ, పాండె అనే అయిదు తీరుల తెలుగు వాడుకలో ఉంది. తెన్నాటి పడమర పక్క ఉంటుంది కొంగునాడు. కొంగు తెలుగులో వచ్చిన తొలికత నడుస్తున్న చరిత్రలో 'తరుగరి' పేరుతో అచ్చయింది. అయితే అది నుడిమార్పు (అనువాద) కత. నేరుగా వచ్చిన తొలి కత ఇదే. ఈకతను రాసిన అమ్మాయికి పన్నెండేళ్ల ఈడు. 'తెలుగువాణి' నాలుగయిదునెలల కిందట ఉడుమలపేటలో జరిపిన తెలుగు తరగతికి వచ్చి తెలుగురాతలను నేర్చుకొనింది. బడి చదువులతోపాటు కతలపొత్తాలను కూడా మక్కువతో చదివే ఈ అమ్మాయి, తన తల్లినుడిలో తన తావునుడిలో తొలికతను రాసింది. మరిన్ని కతల్ని రాసి తెలుగునానుడి (సాహిత్యం)లో పేరు తెచ్చుకోవాలని కోరుకుందాం.**

**రచయిత ఫోన్: 04252227001**

– 'శక్తి' శివరామకృష్ణ

బతుకుతెరువులను పట్టించుకోకుండా భాషను బతికించుకోలేం

# తీరప్రాంత మత్స్యకారుల భాష-సాధికారత

మే నెల సంచిక తరువాయి

**ఆగ్నేయం, దక్షిణం రెండు దిక్కులు**

1. పళవేర్కాడు మొగుదారం : పళవేర్కాడునే తెలుగువాళ్లు ప్రళయకావేరి అంటారు. మొగుదారం అంటే ముఖద్వారం
2. సంబరిసి పుళి మొన : పుళి అంటే పల్లె, పాళెం లాగా గ్రామనామపు చివరిభాగం.
3. దోనిరేవు : గ్రామం
4. మునసామి మొన లాకు : బకింగ్హాం కెనాల్కు, సరస్సుకు నడుమ ఉన్న లాక్
5. అవురువాకం : గ్రామం
6. అవురువాకం కొడ
7. పొన్నేరు కాలవ
8. అన్నామలై చేరి : గ్రామం
9. అన్నాం చేరి కొడ
10. చిన్ని కాలవ
11. పెద్ది కాలవ
12. జడరాయ కోయిల్
13. నాలు కొట్ట : నాలుగు గుడిసెలు
14. చెరుంబూరు కొడ
15. ఆరణి కాలవ : అరుణానది నే ఆరణి అంటారు
16. కల్లూరు : గ్రామం
17. కల్లూరు మొనతర
18. పుదుకుప్పం : జాలర్ల గ్రామం
19. జోనగ పాళెం : గ్రామం
20. పెరియ మాంగోడు : గ్రామం
21. చిన్న మాంగోడు : గ్రామం
22. పొన్నెమ్మ మొనతర
23. కురివి తిట్టు : కురివి అంటే పిట్టలు
24. చిల్లర కాలవ
25. నడి తిట్టు
26. పణకాయి తిట్టు : పణకాయి అంటే తాటికాయ ఇక్కడ ఇసుకదిబ్బ పైకి కనిపించదు. కానీ సరస్సులోపలే ఎత్తుగా ఉంటుంది.
27. మొన : ఇక్కడ తీపి నీరు దొరుకుతుంది.
28. కారికాడు కొడ
30. సున్నాంబు కుళం కొడ : సున్నాంబుకుళం అంటే సున్నపుగుంట
31. సున్నాంబు కుళం : గ్రామం పేరు
32. సాలెమ్మ కొడ
33. సేత్తు మొన : సేత్తు అంటే బురద
34. మదుకాలు : గ్రామం
35. మల్లిమేడు : గ్రామం
36. వల్లిమేడు కొడ
37. మూత్తం కాలవ : దీనినే చిలక కాలవ అని కూడా అంటారు. ఇది ఆంధ్రా, తమిళనాడులకు సరిహద్దు.
38. రామాపురం : గ్రామం
39. పెరువేడు కుప్పం : జాలర్ల గ్రామం
40. బాలాజి కుప్పం : జాలర్ల గ్రామం
41. కోలా మొనతర
42. నొచ్చికుప్పం : సరస్సు అంచు జాలర్ల గ్రామం
43. నొచ్చికుప్పం కొడ
44. కల్లేది మేడు : గ్రామం
45. ఎన్టీఆర్ నగర్ : సరస్సు అంచు జాలర్ల గ్రామం
46. బత్తీన కుప్పం :
47. రక్షణ కుప్పం :
48. పుదుకుప్పం మొనతర :
49. పుదుకుప్పం : సరస్సు అంచు జాలర్ల గ్రామం
50. భీములవారి పాళెం : గ్రామం
51. బాట కుప్పం : సరస్సు అంచు జాలర్ల గ్రామం
52. లక్ష్మీపురం : ఒకప్పటి జాలర్ల గ్రామం. ఇప్పుడు ఊరు లేదు.
53. భీములవారి పాళెం రేవు
54. బాలక్రిష్ణాపురం : సరస్సు అంచు గ్రామం
55. ఊట కాలవ
56. కాసంగాడు కుప్పం : జాలర్ల గ్రామం
57. కాసంగాడు కుప్పం కాలవ
58. పూడి కుప్పం : జాలర్ల గ్రామం
59. పూడి కుప్పం మొనతర
60. తడ కుప్పం : జాలర్ల గ్రామం

61. నడి కుప్పం : జాలర్ల గ్రామం
62. సెల్వా కుప్పం : జాలర్ల గ్రామం
63. ఉప్పు పాళెం : ఉప్పు పండిస్తుండిన చోటు. ఇప్పుడు పండించడం లేదు
64. కరిపేటి కాలవ
65. రామకిష్టారెడ్డి కాలవ
66. వెట్టన కాలువ మొనతర : వెట్టన అంటే తవ్విన అని అర్థం.
67. వెల్లమన్ను మొనతర
68. ఇసక దిబ్బ
69. నక్కల కాలవ : కాళంగి నది చీలిక
70. సొసేదు : సొసైటీ భూమి కాళంగినదిని ఆనుకొని ఉన్న వ్యవసాయ భూమి
71. అర్సా కాలవ : కాళంగి నది చీలిక. అర్సా అంటే ఒరుసుకోవడం.
72. ఉప్పు కాలవ మొనతర
73. పాత పడవల రేవు
74. వాతేరి మొన
75. వాటంబేడు కాలవ
76. నల తుంగ : పశువులు మేసే చోటు
77. వాటంబేడు

## వాటంబేడు కుప్పం వాళ్లు చెప్పిన గాలుల రకాలు

1. కచ్చాం కాత్తు : కాత్తు అంటే గాలి అని అర్థం. కచ్చాంకాత్తు తూర్పు నుంచి వీస్తుంది. తైనెల నుంచి చిత్తిరి నెల వరకూ అంటే నడిజనవరి నుంచి నడి మే నెల వరకూ వీచే గాలి. ఉదయం పూట సుమారుగా 10,11 గంటల నడుమ మొదలై, రాత్రి 10,11 గంటల వరకూ వీస్తుంది. ఆరోగ్యాఇనకి మంచిది.
2. కోడ కాత్తు : ఇది దక్షిణపు దిక్కు నుంచి వీచేగాలి. కచ్చాంకాత్తు వీచే కాలంలోనే అర్థరాత్రి నుంచి మొదల ఉదయం 10 గంటల వరకూ వీస్తుంది. ఇది కూడా ఆరోగ్యానికి మంచిది. దీనిని తెన్నాకోడ కాత్తు అని కూడా అంటారు. తెన్ అంటే దక్షిణం.
3. వడకోడ కాత్తు : ఆడి నెల నుంచి పెరటాసి నెల వరకూ అంటే మే చివరి నుంచి ఆగస్టు, సెప్టెంబరు నెలల వరకూ వీచేగాలి. పగటిపూట నైరుతి మూలనుంచి వస్తుంది. రాత్రిపూట పడమర, వాయువ్య మూలల నుంచి వస్తుంది. రాత్రిపూట వీచే గాలిని 'వాడ' అని అంటారు. ఇవి ఆరోగ్యానికి చెడ్డగాలులు.
4. కొండకాత్తు లేదా కొండకోడ : కార్తీక నెల నుంచి సుమారు 3 నెలల పాటు వీచే చలిగాలి. ఇది అపాయకరమైన గాలి.
5. మూలకాత్తు : కొంతకాత్తు వీచే కాలంలో అప్పుడప్పుడూ వీస్తుంది. ఈ గాలి వస్తే వెంటనే వాన కురుస్తుంది. తుఫానులు కూడా వస్తాయి.
6. మారుకాత్తు : తుఫాను సమయంలో ఈ గాలి తోలితే, తుఫాను తెరపిచ్చినట్లు
7. సుడికాత్తు : సుడిగాలి వేసవిలో వాడగాలి కాలంలో ఈ గాలి వస్తుంది.

(వాడకాత్తు (వడగాలి) కాలంలో పోటు ఎక్కువై సరస్సులోకి నీళ్లు ఎక్కువగా వస్తాయి. ఈ పోటును కత్తెరపోటు అంటారు) (సరస్సులో పాటుకు నీళ్లు తగ్గితే, దగ్గర్లో వాన రాబోతుంది అంటారు).

## రాత్రిపూట వేటకు వెళ్లినప్పుడు చూసుకొనే చుక్కల గుర్తులు.

1. తక్కిడ వెళ్లి : తులా నక్షత్రం
2. విడింజి వెళ్లి : వేగు చుక్క
3. కట్లు వెళ్లి : దొంగల మంచం లేదా సప్తర్షి మండలం
4. గుంపు వెళ్లి : పిల్లలకోడి
5. సోత్తు వెళ్లి : సాయంకాలం 7 గంటలప్పుడు పడమర దిక్కున పెద్దగా ఉండే నక్షత్రం.

## ప్రళయ కావేరి సరస్సులో దొరికే చేపల రకాలు

1. సాలామీను, ఇది పెరిగి బాగా పెద్దదయితే కెండమీను అంటారు : తెలుగులో మొయ్య చేప
2. కొళల్ మీను : తుల్లు చేప
3. కాలాయ్ మీను : మాగ చేప
4. కొదువాయి మీను : కొదువాయి చేప
5. సెల్లు కోలా : చిన్న ముక్కోలాసు
6. పల్లు కోలా : పెద ముక్కోలాసు
7. అల్లాత్తి : అలువాయి
8. ఓద్దై : ఓద
9. మదుగండ : ముళ్ల చేప
10. ఇరుంకెళిత్తి : ఈంజెల్ల (ఇది కుడితే విషం)
11. వెళ్ల కెళిత్తి : తెల్ల జెల్ల
12. మావురాయి : మావురాయి (మాయన్నకు ఉండే మూడు ముళ్లు నాకుంటే, ఏనుగు మింద పొయ్యేవాడిని ఎక్కిపొడుద్దును' అంటుందంట ఈచేప)
13. తేల్ మీను : తేలు మాయి (దీనికి మూడు ముళ్లు ఉంటాయి. వాటితో కుడుతుంది)
14. పాము మీను : పాము చేప
15. వాలగ : వాలగ
16. జిలేబి మీను : జామాలు చేప
17. పసువ : పసువ
18. కుత్తువ పొడి : కుత్తువ పొడి (చాలా సన్న చేపలు, వలస పక్షులు

## నాడు, నుడి, నానుడి

తెలుగు మాటల సమగ్ర ఆకర గ్రంథాన్ని తయారుచేయాలని తలపెట్టాం

ఈ కృషిలో మీరూ భాగస్వాములు కావచ్చు.

## మీకు స్వాగతం పలుకుతున్నాం

మన గ్రామాలు, చుట్టుప్రక్కల స్థలాలపేర్లు, ఇంకా వాడుకలోగల 'నాడు'ల రాజకీయ పర్యావరణ, ప్రత్యేకతలు – అడవి, సముద్రం, వ్యవసాయం మీద జీవిస్తున్న వారి పద సంపద, పర్యావరణంతోపాటు సాంకేతిక ప్రగతివల్ల వాటిలో వచ్చిన మార్పులు; వీటిని మరింత తెలుసుకోవాలన్నా, గుర్తుచేసుకోవాలన్నా జిల్లాలవారీగా, కనీసం ప్రాంతం వారీగా ఒక్క ఆకరమూ లేదు. ఇందువల్ల చదువుకున్నవారిలో తెలుగువాసన అంతరిస్తుంది. రచనలలో మాండలికాలు వాడడం గుడ్డిలో మెల్ల. అయితే ఆ బతుకుతెరువులను 'సాధికారిత' వైపు నడిపించలేవు.

కాబట్టి ఈ 'నాడు, నుడి, నానుడి'లను ప్రాచీనాంధ్ర భూగోళం, గ్రామ స్థలనామాలు, వృత్తి పదకోశాలు, చాటు పద్యాలు, సామెతలు, జానపద గేయాలను అనేక గ్రంథాలనుండి సేకరించి, ముందుగా ప్రాంతానికి 100 పుటల సమాచారం సేకరించుకుని జిల్లా లోని భాషాభిమానులతో చర్చించి ఈ కృషికి తుదిరూపం ఇవ్వాలనే పద్ధతిని ఎంచుకున్నాం.

ఈ పద సంపద ఆయా వృత్తులకు చెందినది కాబట్టి, ఆయా ప్రభుత్వ శాఖలలో అధికారులు, శాస్త్రవేత్తలను సంప్రదించడం తప్పనిసరి. వారి సహకారం కొత్త పాతల కలయికను తెలుసుకోవడానికి ఉపయోగపడుతుంది.

**ఈ కృషి ఉద్యమస్థాయిలో కొనసాగించడానికి, తెలుగు భాషాభిమానుల సహకారం కోరుతూ, ఈ కృషిలో పాల్గొనదలచిన వారిపేర్లను ఇవ్వవలసిందిగా కోరుతున్నాం. సంప్రదించవలసిన ఫోన్ నెం: 9441427977 / 9100931658.**

***బతుకుతెరువులను పట్టించుకోకుండా భాషను బతికించుకోలేం.***

తింటాయి)

19. మొట్టసపొడి : మొట్టస పొడి (")
20. ముళ్లారి : ఎద్దుచేప
21. సెలుపిటి : దేవుడి నాలిక
22. ఓర్రై : ఓర
23. తెరటి : తెరటి
24. ఇలవ : ఇలవ
25. కీస : కీస
26. ఊడా : ఊడా
27. మట్టియ : మట్టిచేప
28. కెలంగ : కెలంగ
29. ఉడుపాచి : ఉడుపాచి
30. సీలువ : సీలువ
31. చెంగిని కెండ : చెంగిన మొయ్య
32. ఎరాలు : ఎరాలు
33. ఇసకమీను : ఇసకపుర్రి
34. కొరముట్టి : కొరమేని
35. కోట ఎర : రాజు రొయ్య
36. వెల్ల ఎర : తెల్ల రొయ్య
37. కదంబు ఎర : కదంబ రొయ్య
38. సెముకు ఎర : సెముకు రొయ్య
39. వలుంబు ఎర : వలుము రొయ్య
40. కల్లు ఎర : రాతి రొయ్య

### ఒడపాళెం గ్రామం
### పూడి రాయదొరువు పంచాయితీ, నిడుగుర్తి తపాలా, వాకాడు మండలం, శ్రీ పొట్టిశ్రీరాములు నెల్లూరు జిల్లా
### వడకు (ఉత్తరం) దిక్కు

1. క్రిష్ణాపట్నం మడ : ఇక్కడ 45 బారల లోతు ఉంటుంది. 'మడ' అంటే సముద్రపు నీళ్ల లోపలనే ఒకరకం చెట్లు ఉండే ప్రాంతం.
2. ఈ మడ రానురాను 45 బారల నుంచి 16 బారలకు తగ్గుతుంది. ఇక్కడకు నేరుగా క్రిష్ణపట్నం ఓడరేవు ఉంటుంది.
3. ఐదు బారలు
4. కడలోర భూమి : సముద్ర పొరంబోకు
5. పంబలి పారు లేదా వార పారు : ఇక్కడ ఐదు బారల లోతు ఉంటుంది
6. దరి

### తూర్పు దిక్కు

1. లైట్ హౌస్ మడ : ఇక్కడ 45 బారల లోతు ఉంటుంది. 1 బార=5 అడుగులు

2. రాను రాను 7 బారలకు తగ్గుతుంది.
3. తర : సముద్రం లోపలే ఉండే ఇసుక దిబ్బను తర అంటారు. ఇక్కడ లోతు 2 నుంచి 2.5 బారలే ఉంటుంది. ఇక్కడ అలలు లేస్తుంటాయి పడవలు తిరగబడే ప్రమాదం ఉంది.
4. కప్పలి : పెద్ద నౌకను కప్పలి అంటారు. కప్పలి మునిగిపోయిన ప్రాంతం 3 బారల లోతు
5. కప్పలి తర్వాత ఏడు బారల లోతు వస్తుంది. ఇక్కడ అడుసు ఎక్కువగా ఉంటుంది.
6. ఐదు బారలు
7. దరి
8. కరాకు : తీరం, ఇక్కడ వలలు పెట్టుకొనేదానికి చిన్న కట్టడం ఉంది.
9. బాట : తీరం నుంచి గ్రామంలోకి వచ్చే దారి. బాటకు రెండువైపులా పట్టాపొలాలున్నాయి. ఇక్కడ సవక (సరుగుడు) చెట్లను సాగుచేస్తారు.
10. గ్రామం : పట్టపు కాపులు, ఓడ బలిజలు అనే రెండు కులాల జాలర్లు నివసిస్తున్న గ్రామం.
11. రెండు సుడుగాళ్లు : సుడుగాడు అంటే వల్లకాడు
12. పెద్ద పాళెపమ్మ దేవళం
13. కోడాలపల్ల తాత (మునేశ్వరుడు) దేవళం
14. కన్నికలు ఉండే చోటు
15. దక్షిణ అరువాయి : అరువాయి అంటే సముద్రపు నీళ్లు, వాననీళ్లు కలిసే చోటు
16. ఉప్పు కాలువ : బకింగ్ హాం కెనాల్
17. ఉత్తర అరువాయి : ఈ అరువాయి ఇప్పుడు ఇసుకమేటవేసి దిబ్బ అయిపోయింది.
18. కొత్తూరు : పడవలు పెట్టుకొనే చోటు. ఒకప్పుడు ఇక్కడ ఊరు ఉండేది, 1984 తుఫాను వలన ఊరు ఖాళీ అయింది. ఇక్కడ సవక తోటలు ఉండాయి.

**తెక్కు (దక్షిణం) దిక్కు**

1. మంజామొన పారు : 16 బారల లోతు
2. శ్రీహరికోట
3. కప్పలి : ఇక్కడ 2 బారల లోతు ఉంటుంది. అలలు కొడతాయి. కప్పలికి ఎదురుగా పూడికుప్పం అనే గ్రామం ఉంటుంది.
4. ఐదు బారలు
5. దరి

(త్తై, మాసి (జనవరి సగం నుంచి మార్చి వరకూ) నెలలలో మాత్రమే 45 బారలలో మేల మర (పైగేలం)తో వేట చేస్తారు. అప్పుడు కోడకాత్తు (తెల్లవారి 3 గంటలు)లో లోపలికి పోయి, కొండకాత్తు (సాయంత్రం 4 గంటలప్పుడు)లో దరికి వస్తారు. మిగిలిన నెలలంతా దరి నుంచి ఏడుబారల వరకూ వేటాడుతారు. (45 బారల దగ్గర దొరికే చేపలు : కలవ, సెంగర, గొరక, కులి, సొర, రాపొర, తేలపొర, కులుంపార, కున్న, కడవర, ఆకంపార, వరిపార, చెంబడ, చుక్కల ఎంట్రకాయ, ఏటి ఎంట్రకాయ)

(దరి నుంచి 7 బారలలోపు దొరికే చేపలు : కానాం కచ్చాళ్లు, కచ్చాళ్లు, కాలా వంజరం, వవ్వాలు (చందవ), మొవ్వ, కెళతి (జెల్ల), కురువిమీను (బుర్ర సుక్కలు), డిస్కో చేపలు, వాల, కరువాల, సోర, తిరుకి (టేకి), ఊడాన్, కెండ (మొయ్య), సూరమీను, వరిపార, తేలపార, కడవుర, ఉల్లం, గొరక, చెముకు రొయ్య, టైగర్ రొయ్య, చెన్నాకుని (కూనరొయ్య పొట్టు), కోలాసు చేప)

(వలల రకాలు : ఐలావల, వంజరం వల, వవ్వాలు వల, రొయ్యల వల, కానాం కచ్చాళ్ల వల, సన్నసుక్కల వల, రింగువల, మావులాసివల (గిల్నెట్‌వల))

(సముద్రంలో దక్షిణం నుంచి ఉత్తరానికి పోయే ప్రవాహాన్ని 'తెండివెళ్లం' అనీ, ఉత్తరం నుండి దక్షిణానికి పోయే ప్రవాహాన్ని 'వన్నివెళ్లం' అనీ అంటారు)

(ఓడపాళెంలోని గ్రామదేవతలు : పెద్దపాళెపమ్మ, చెల్లెమ్మ, పొక్కాలమ్మ, అంకాళమ్మ, పూండియమ్మ, కనుపూరు ముత్యాలమ్మ, పోలేరమ్మ, మహలక్ష్మమ్మ, నాగాతమ్మ, నాగూరయ్య, మారెమ్మ, ఆచారి తాత, కోడాల పల్ల తాత, కన్నికలు)

రచయితది: మారేడుమిల్లి గ్రామం, తూర్పుగోదావరి జిల్లా,
ఫోన్లు: 08864244873, 85935424

**పూర్తయింది**



**అమ్మనుడిని ప్రేమించలేనివాడు,**
**అమ్మనూ దేశాన్నీ ప్రేమించలేడు.**

**కళ్ళుంటే అక్కరనుబట్టీ ఏ కళ్ళజోడయినా పెట్టుకోవచ్చు. తల్లినుడిలో దిట్ట అయితే ఇతర నుడులెన్నయినా తేలికగా నేర్చుకోవచ్చు.**

# అండమాన్ నికోబార్ దీవుల్లో తెలుగువారు

- డాక్టర్ కె. లక్ష్మీనారాయణ,
శ్రీ ఎం. దశరధరామయ్య, శ్రీ కాళిదాసు పురుషోత్తమ్

**మా** అండమాన్ పర్యటనలో అండమాన్ 'ఆంధ్రా అసోసియేషన్'కు వెళ్లాము. పోర్ట్‌బ్లెయిర్ నడిబొడ్డున హిందీ, బెంగాలీ అసోసియేషన్‌ల చేరువలోనే ఈ సంస్థ కార్యాలయం ఉంది. షుమారు 600 మంది కూర్చొనడానికి అనువైన సభాభవనం, వేదిక ఉన్నాయి. అసోసియేషన్ ముందు అంగళ్లకు, గదులకు అద్దెకిచ్చారు. సంఘం మేడమీద ఆఫీసుగదిలో సంఘ ఆర్గనైజింగ్ సెక్రటరి మేడసాని శ్రీనివాసులుగార్ని (09933283892) కలిశాము. ఆయన చాలా ఆదరంగా మమ్మల్ని ఆహ్వానించారు. వారినుండి ఆంధ్రా అసోసియేషన్ కార్యకలాపాలను గురించి వివరాలు తెలిశాయి.

ఇప్పుడు అండమాన్, నికోబార్ ద్వీప సమూహాల్లో ఇంచుమించు 60 వేలమంది తెలుగువారున్నారు. బెంగాలి, హిందీ, తమిళుల తర్వాత తెలుగువారే దీవుల్లో అధిక సంఖ్యాకులైన ప్రజలు. ప్రధానంగా శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి జిల్లాలు, ఒంగోలు, నెల్లూరు జిల్లాలనుంచే




తెలుగు ప్రజలు అండమాన్ దీవులకు తరలివచ్చారు. వీరుకాక సెల్యూలార్ జెయిల్లో నేరస్థులుగా, రాజకీయఖైదీలుగా శిక్షలు అనుభవించి, దీవుల్లో స్థిరపడిన కొద్దిమంది తెలుగువారుకూడా ఉన్నారు. ఇట్లా స్థిరపడ్డవారికి ప్రభుత్వం భూములిచ్చింది. వారంతా వ్యవసాయం చేస్తూ సుఖజీవితం గడుపుతున్నారు. షుమారు వేయిమంది వరకు తెలంగాణానుంచి వలసవచ్చిన తెలుగువారు కూడా ద్వీపసముదాయంలో స్థిరపడ్డారు.

పోర్టుబ్లెయిర్‌లో శ్రామికులలోఅత్యధిక సంఖ్యాకులు తెలుగువాళ్లే. ఎ.పి.డబ్ల్యు, అటవీశాఖ, ఛాత్తమ్ సామిల్‌లలో పనివాళ్లు, శ్రామికులు తెలుగువాళ్లే. ప్రభుత్వోద్యోగుల్లో పైవర్గాలలో పెద్ద పెద్ద అధికారులుగా ఉన్న తెలుగువారు తక్కువే. ఆ దృష్టితో చూస్తే అల్పసంఖ్యాకులైన మలయాళీలు ఉన్నతోద్యోగాల్లో ఉన్నారు.

ఒక్క ఆంధ్రా అసోసియేషన్ మాత్రమేకాదు. బెంగాలి, హిందీ తదితర భాషా సంఘాలు కూడా 1964 ప్రాంతంలో అండమాన్-నికోబార్ ఛీఫ్ కమీషనర్ బి.ఎన్. మహేశ్వరి - ఐ.ఏ.ఎస్ ప్రోత్సాహంతో ఏర్పడ్డాయి. అన్ని సంఘాలకు వారు స్థలం ఇచ్చినట్లున్నారు. అన్ని సంఘాలు పోర్ట్‌బ్లెయిర్‌లోని ఒకే కూడలిలో ఉండడం చూశాము.

ఆంధ్రాసంఘం వారి సభాభవనం 1990లో నిర్మించి తెలుగువారి పెళ్లిళ్లకు, ఇతర కార్యక్రమాలకు ఈ హాలును తక్కువ అద్దెకే ఇస్తారు. ఇతరులకు షుమారు 7వేలు వసూలు చేస్తారు. ఈ అద్దెలతో సంఘం స్వయంపోషకంగా నిర్వహించబడుతోంది. ఉగాది, సంక్రాంతి, రాష్ట్రావతరణ వంటిముఖ్యమైన రోజుల్లో సాంస్కృతిక కార్యక్రమాలు, సభలు జరుపుతారు. ఆంధ్రా అసోసియేషన్ ఒక గ్రంథాలయాన్ని నిర్వహిస్తోంది. తెలుగు విశ్వవిద్యాలయంవారు పుస్తకాలు విరాళంగా ఇచ్చారు. అయితే సాధారణ పాఠకులు చదివేనవలలు, కథా సంపుటాలు, వార,మాస, దినపత్రికలు ఆ గ్రంథాలయంలో లేవు. ఒక విధంగా గ్రంథాలయం అంత ప్రోత్సాహ జనకంగా నిర్వహించబడడంలేదు. ఈనాడుపత్రిక తప్ప మరే తెలుగు దినపత్రిక పోర్టుబ్లెయిర్‌లో లభించకపోవడం విచారకరం. మన పత్రికలవాళ్లు ఆంధ్రా అసోసియేషన్‌కు తమ పత్రికలను పోస్టుచేస్తే బాగుండును.

అసోసియేషన్ వేసవిలో ఏటా తెలుగు నేర్పే కార్యక్రమం నిర్వహిస్తుందట. ఈ మే నెలలో తరగతులు నిర్వహిస్తారు. విచిత్రం ఏమంటే, తెలుగువారిని పెళ్లాడిన ఇతర భాషా స్త్రీలు ఆ తరగతులకు ఎక్కువ హాజరవుతారట! అండమాన్‌లో వర్ణాంతర, భాషేతరుల మధ్య వివాహాలు ఎక్కువగానే జరుగుతాయని, పెద్ద పట్టింపు ఉండదని విన్నాము.

ద్వీపాలకు తెలుగు కళాకారులు రావడం, పోవడం తక్కువ. తెలుగు పిల్లలకు, ఇతర భాషీయుల వలెనే తెలుగువారి నృత్యం కూచిపూడి నేర్పించాలని కోరిక ఉందని, అది వల్ల పడలేదని శ్రీనివాసులు విచారం వ్యక్తపరచారు. ద్వీపాల్లో తెలుగు మాధ్యమంలో బోధించే ప్రాథమిక, మాధ్యమిక ఉన్నత పాఠశాలలు కూడాఉన్నాయని, డిగ్రీలో తెలుగు సబ్జెక్ట్ ఉందని తెలిసింది. మేం ద్వీపాల్లో పర్యాటకులుగా తిరిగినన్నిరోజుల్లో కొన్ని విషయాలుతెలిశాయి. తెలుగువాళ్లుమాత్రం ఎక్కువగా హిందీలోనే మాట్లాడడానికి ఇష్టపడుతున్నారు. పై తరగతులవాళ్లు శ్రామికవర్గంతో గుర్తింపు పొందడానికి విముఖులని మాకుతోచింది. పై వర్గాలవాళ్లు10వ తరగతివరకు హిందీ/ఇంగ్లీషు మాధ్యమంలో పిల్లల్ని చదివించి, ఇంటర్‌నుంచి విశాఖలోనో, విజయవాడలోనో కార్పొరేట్ కాలేజీలలో పిల్లల్ని చదివించుకుంటున్నారు. ఆంధ్రా అసోసియేషన్‌లో జీవితసభ్యులు షుమారు 600 మంది, సాధారణ సభ్యులు 200 మంది ఉన్నట్లు తెలిసింది. జీవిత సభ్యత్వనురసుం 205/- రూపాయలు, సాధారణసభ్యుత్వరుసుం 30/- రూపాయలు. పోర్ట్‌బ్లెయిర్‌లో గొప్ప పారిశ్రామికవేత్తగాపేరు పొందిన శ్రీసూర్యారావు ఇప్పుడు ఆంధ్రా అసోసియేషన్ అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు. 2013-2014 మధ్య సమైక్యాంధ్ర ఉద్యమాన్ని సమర్థిస్తూద్వీపాల్లో తెలుగువాళ్లు ప్రదర్శనలు వగైరా కార్యక్రమాలు చేపట్టినట్లు తెలిసింది.

పుస్తక పరిచయం

## బ్రాహ్మణవాదం - మూలాలు




డా॥ కత్తి పద్మారావు నడుస్తున్న చరిత్ర చదువరులకు చిరపరిచితుడు. తెలుగు సాహిత్యంలో ఆధిపత్య ధోరణులపై ఆయన వ్యాసాలపై ఎంతో చర్చ జరిగింది. ఉద్యమకారుడుగా, రచయితగా, కవిగా నిరంతర చైతన్యంతో సాహిత్య సృజన చేస్తున్న కత్తి పద్మారావుగారినుంచి తాజాగా వచ్చిన మరో గ్రంథం 'బ్రాహ్మణవాదం-మూలాలు'. ఆ పుస్తకానికి ముందుమాటలు తానే ఇలా వ్రాసుకొన్నారు. " 'బ్రాహ్మణవాద మూలాలు' గ్రంథం వ్రాసి ఒక దశాబ్దం దాటింది. అయితే ఎప్పటికప్పుడు ఆధునిక గ్రంథాలు చదివి సవరిస్తూ వచ్చాను. ఒక వర్ణానికో, కులానికో వ్యతిరేకంగా వ్రాసిన పుస్తకం కాదిది. 'బ్రాహ్మణవాదాన్ని' ఒక ఆధిపత్య వాదానికి ప్రతీకగా తీసుకొన్నాను. అన్ని మతాలను బ్రాహ్మణవాదం శాసిస్తూ వుంది. ఒక చార్వాక సిద్ధాంత అనుయాయిగా ఈ గ్రంథం వ్రావాను. ఇది విశ్లేషణాత్మక గ్రంథం. ఈ గ్రంథం వ్రాసే సందర్భంలో భారతీయ వాఙ్మయానికి సంబంధించిన ఎన్నో మూల గ్రంథాలు అధ్యయనం చేశాను. పాశ్చాత్య దేశాలనుండి వచ్చిన గ్రంథాలు కూడా చదివాను. పూలే, అంబేద్కర్, పెరియార్ గ్రంథాలు నా భావజాలాన్ని శాస్త్రీయం చేయడానికి ఎంతో ఉపకరించాయి. చార్వాక, బౌద్ధ, జైన, సాంఖ్య, దర్శనాలూ అధ్యయనం చేశాను. ఏ విధమైన పక్షపాత ధోరణి లేకుండా నిష్పక్షపాతంగా ప్రమాణబద్ధంగా నేను విశ్లేషించుకొంటూ వెళ్ళాను."

495 పుటల ఈ పుస్తకంలో ఆచార్యుడు, రచయిత కె.ఎస్. చలం, ఆచార్య కంచె ఐలయ్య, బహుజన మేధావి బి.ఎస్. రాములు వ్రాసిన విలువైన పరిశీలనలు కూడా ఉన్నాయి. వెల-రు.300లు. ప్రతులకు: కత్తి స్వర్ణకుమారి, లోకాయత ప్రచురణలు, పొన్నూరు, ఫోన్: 98497 41695.

---

మేము పోర్ట్‌బ్లెయిర్‌లోగాని, మరొకచోటగాని, భాషాసమస్యను ఎదుర్కోలేదు. దాదాపు ప్రతివాళ్లకూ హిందీ, బెంగాలి, తమిళం, తెలుగు వచ్చు. ఆటోవాళ్లు, టీషాపులవాళ్లు, హోటల్లో పనిచేసే కార్మికులు అందరూ మాతో తెలుగులోనే వ్యవహరించారు. అక్కడి ప్రజలు చాలా నెమ్మదివాళ్లు, అల్ప సంతోషులు అని కూడా అనిపించారు. ఒక్క కారుడ్రైవరు కూడా మేం భోజనానికి పిలిస్తేరాలేదు. మర్యాదపూర్వకంగానే రామని సూచించారు. చాలాచోట్ల సువనీర్లు అమ్మేవాళ్లు, కాఫీహోటళ్లు నిర్వహించేవాళ్లు, వాటర్‌స్పోర్ట్సులో పనిచేసే కార్మికులూ తెలుగువాళ్లే.

పోర్ట్‌బ్లెయిర్ చాలా పరిశుభ్రంగా ఉంది. ఏ బీచ్‌లోను, కాగితం ముక్క ప్లాస్టిక్ వ్యర్థాలు కన్పించలేదు. తోపుడుబళ్ల వ్యాపారస్తులు కూడా చెత్తను ఎక్కడంటే అక్కడ పడేయడం చూళ్లేదు. ఈమధ్య పోర్ట్‌బ్లెర్ నగరపాలకసంఘానికి తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా ఒక ముస్లిం కుర్రాడు ఎన్నికైనట్లు తెలిసింది. మేం పోర్టు బ్లెయిర్‌లో ఉండగా విశాఖనుంచి ఎయిర్ ఇండియా మొదటి విమానం వచ్చింది. తెలుగువాళ్లు చాలా సంతోషించారు. మద్రాసులో ఓడలోనో, విమానంలోనో దిగి విశాఖవంటి ప్రాంతాలకు వెళ్లేవాళ్లకు ఇది గొప్ప ఊరట. ద్వీపవాసులకు విమానం, ఓడ ప్రయాణాల్లో రాయితీ ఉంది. తమిళనాడు, కేరళవంటి రాష్ట్రాలు తదితర భాషలు మాట్లాడే ద్వీపవాసులకు ఇంజనీరింగ్, మెడికల్ కాలేజీల్లో కొన్ని సీట్లు కేటాయించినట్లు తెలుస్తోంది. ఇటువంటి సౌకర్యం ఎప్పుడో మనరాష్ట్రం కూడా కల్పించి, రెండేళ్లతర్వాత తొలగించారట. అటువంటి ఏర్పాటుఉంటే బాగుంటుందని ఇక్కడి తెలుగువాళ్ల అభిప్రాయం.

దీవుల్లో మత్స్యపరిశ్రమ, పోక వంటి పంటలు పండించడం తప్ప ఉపాధి కల్పించే పరిశ్రమలేవీ లేవు. అత్యధిక సంఖ్యలోప్రజలు టూరిజం పరిశ్రమలో ఏదో ఉన్న ఉద్యోగం చేసుకుంటారు. లేదంటే గవర్నమెంట్ ఉద్యోగాలు. నవంబరు ఆఖరు నుంచి మే చివరి వరకు టూరిజం పరిశ్రమ ఉంటుంది. తర్వాత ఆరునెలలు కుండపోత వర్షాలు. మళ్లీ నవంబరు చివరి వరకు పనులుండవు. చాలారకాలకూరలు, పళ్లు, మెయిన్‌లాండ్‌నుంచి రావాల్సిందే. అయినా, భోజనం, టిఫిన్లు హోటళ్లలో కారుచవుక. చేపలు, మాంసంతినేవాళ్లకు ఇంకా తక్కువ రేట్లలో భోజనం దొరుకుతుంది. నెల్లూరుజిల్లానుంచి వచ్చిన కోళ్ల పరిశ్రమనిర్వహిస్తున్న వ్యక్తులు, రిసార్ట్స్ నిర్వహిస్తున్న వ్యక్తులుఈటూర్‌లో పరిచయం అయ్యారు. అన్నట్టు ద్వీపాల్లో చిన్న నేరాలు కూడా లేవు. హనీమూన్ వెళ్లేవాళ్లూ, సాధారణ పర్యాటకులు క్షేమంగా, నిర్భయంగా తిరిగి చూడదగిన ప్రదేశాలు. అండమాన్-నికోబార్ దీవులు.

**ఫోన్: 9247564044 (కాళిదాసు పురుషోత్తమ్)**

---

## జాతీయ స్థాయి కవితల పోటీ

కళల దండోరా పత్రిక 2వ వార్షికోత్సవం సందర్భంగా సాంస్కృతిక, నాటక కళా ఉత్సవాలను నిర్వహిస్తున్నారు. అందులోభాగంగా జాతీయ స్థాయిలో తెలుగు కవితల పోటీని నిర్వహిస్తున్నారు. కవితలను 25 లైన్లలోపు రాసి పంపాలి. "కళ ప్రజలకోసం, కళాకారుని జీవన గమనం, సమాజ అభివృద్ధిలో కళ" అనే ఇతివృత్తాల్లో ఏ అంశమునైనా తీసుకొని, తమ కవితల్ని రాసి పంపాలి. వచ్చిన కవితలలోంచి ఉత్తమమైన 20 కవితల్ని ఎంపిక చేసి జూలై మాసంలో నిర్వహించే కళలదండోరా 2వ వార్షికోత్సవసభలో ప్రకటిస్తారు. ప్రథమ బహుమతిరు.5,000/-లు, రెండవ బహుమతి రు.3,000/-లు, మూడవ బహుమతి రు.2,000/-లు, ప్రత్యేక బహుమతిగా రూ.1,000/-లు, 16 కవితలకు ప్రోత్సాహక బహుమతి క్రింద రు.500/-లు ఇస్తారు. 29-6-2015లోగా తమ కవితలను అంగలకుర్తి ప్రసాద్, సంపాదకులు, "కళలదండోరా" మాసపత్రిక, డోర్.నెం.35-03-69/(31/16/ఏ) సంజయ్‌గాంధీకాలని, సి.యస్.ఆర్.శర్మకాలేజి వెనుక, ఒంగోలు-523 001, సెల్:9492509969 చిరునామాకి పంపాలి. వివరాలకు మొగిలి దేవప్రసాద్:9030748819, ఇండ్ల ప్రభాకర్:9502313415 సంప్రదించగలరు.

ప్రకృతి-4

# సమన్యాయం !

– డా॥ కొప్పుల హేమాద్రి

**మొ**క్కల్లో – స్వజాతిని ఇబ్బంది పెట్టడం ఉండదు. అంటే, ఒక కరక్కాయ చెట్టు అదే జాతికి చెందిన మరో కరక్కాయచెట్టును ఇబ్బందికి గురిచెయ్యదు. ఒక ఉసిరిచెట్టు మరో ఉసిరి చెట్టుకు ఎట్టిహానీ తలపెట్టదు. కాని, కొన్ని జాతులు 'ఇతర జాతి' మొక్కలను ఆశ్రయించి పరాన్నజీవుల్లా బ్రతకడం కనిపిస్తుంది. మరి కొన్నయితే, వేరేజాతి మొక్కలు పెరగకుండా తమ వేళ్ళద్వారా ఆ మొక్కలపై రసాయన (విష) ప్రయోగం చేసిగాని, మరే ఇతర పద్ధతిలోగాని కట్టడి చెయ్యగలవు. ఉదాహరణకు 'వయ్యారిభామ' లేక 'పిచ్చి మాచిపత్రి' అనే కలుపు మొక్క అటువంటిదే. దాని శాస్త్రీయనామం 'పార్థీనియం హిస్టిరొఫరస్'. అది తన వేళ్ళనుండీ, కుళ్ళిపోయిన ఆకులనుండీ తయారయ్యే విష పదార్థాలను ప్రయోగించి, చుట్టుపక్కల పెరిగే ఇతర జాతి మొక్కలకు తగినంత మోతాదులో పోషకాలు దొరక్కుండా చేసి, తద్వారా తన జాతిని వృద్ధి చేసుకుంటుంది. అయితే, 'తాడి తన్నేవాడొకడైతే – తలదన్నేవాడు మరొకడ'న్నట్లు 'తిక్క తగిరిస' (కేసియా యూనిఫ్లోరా) అనే మరో ఏక వార్షికపు మొక్క – దట్టంగా నారు పోసినట్లు పెరిగి, వయ్యారిభామతో సహా – మరే ఇతర జాతి కలుపు మొక్కల్నీ తమతోబాటు పెరగకుండా కట్టడి చేస్తుంది.

ఇక్కడ 'జాతి' అంటే ఏమిటో కొంత వివరణ అవసరం. మనం అన్నం వండుకు తినే బియ్యాన్ని – బాస్మతి, మసూరీ, బుడమ బియ్యం, సన్నాలు– ఇలా ఎన్ని పేర్లు పెట్టుకుని పిలుచుకున్నా అవన్నీ 'ఒరైజా సాటివా' అనే గడ్డి(వరి) మొక్కకు చెందినవే. అలాగే, ప్రపంచంలో ఇప్పుడు ఉన్న మానవులు– వారి భౌతిక స్వరూపం, అలవాట్లూ, అలంకారాలు, అమ్మనుడులూ ఎలా ఉన్నా– వారంతా 'హోమో సెపియన్స్' (Homo sapiens) అనే జాతికి చెందినవారే! 'హోమో' (Human Being మానవుడు) అనే ప్రజాతి (genus: జీనస్)ని శాస్త్రవేత్తలు ఆరుజాతులు (species: స్పీసిస్)గా వర్గీకరించారు. వాటిలో హోమో నియాండర్తలెన్సిస్ (Homo neanderthalensis), హోమో హేబిలిస్ (Homo habilis), హోమో ఫ్లోర్సిన్సిస్ (Homo floresiensis), హోమో ఎర్గాస్టర్ (Homo ergaster), హోమో ఎరెక్టస్ (Homo erectus) అని పిలువబడే అయిదు జాతులు కాలగర్భంలో కలిసిపోయి, 'శిలాజాలు'గా మాత్రమే మిగిలిపోయాయి. ఇక సజీవంగా మిగిలింది 'హోమో సెపియన్స్' అనే జాతి (బుద్ధిజీవి Thinking Man) మాత్రమే! అంటే, మనమన్నమాట!

మొక్కల్లో – ఇంతకు ముందు చెప్పినట్లు, స్వజాతి (same species) లో తమలో తాము కాలు దువ్వుకోడాలు, గిల్లికజ్జాలు పెట్టుకోడాలు ఉండవు. మానవుల విషయానికొస్తే – భూమిపై జీవిస్తున్నవారంతా ఒకే జాతి (హోమో సెపియన్స్)కి చెందినవారైనా – ఒకడు 'తక్కువ' వాడని, మరొకడు 'ఎక్కువ' వాడని తగవులాడుకోడం ఎంతవరకు సమంజసం?

మానవుడు ఆదిలో కందమూలాదుల సేకరణకు సైతం ఉదయం వెళ్ళి, పొద్దుపోయేదాకా అడవుల్లో నానా తంటాలు పడేవాడు. మరి ఈనాడో? అవసరానికి మించి పోగెయ్యడానికి అలవాటు పడ్డాడు. అందుకై తన నివాసం చుట్టూ వ్యవసాయ క్షేత్రాలను ఏర్పాటు చేసుకుని ఏటికేడాదీ ధరిత్రిని దున్నేస్తున్నాడు. ఉపరితలంలో దొరికే నీటితో తృప్తిపడక, భూగర్భజలాలను జలగలా – అంతకన్న దారుణంగా పీల్చేస్తున్నాడు! 'ఇవన్నీ ప్రకృతి విరుద్ధమైన చేష్టలని, అంతగా అవగాహనలేని రోజుల్లో మొదలుపెట్టి, అందలో పీకల్లోతు 'ఇరుక్కుపోయాడు! ఇప్పుడు బయటకు రావాలన్నా ఇబ్బందే! అయినా ఏదో మార్గం వెతుక్కోక తప్పదు. చూద్దాం. రాబోయే రోజుల్లో బుద్ధిజీవుల ఆలోచనలు ఏ తీరున సాగుతాయో!

రచయిత ఫోన్: 09848296865



## పుస్తక సమీక్షలు యువతరానికి కరదీపిక



శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణ.అరసం నేతగా, అభ్యుదయ రచయితగా సాహితీలోకానికి చిరపరిచితులు. ఆయన నాలుగు దశాబ్దాలుగా అరసంలో పనిచేస్తూనే తనలోని సృజనశక్తులను కోల్పోకుండా 'రేపటిలోకి' 'అనేక' 'నూరేళ్ళ పలుపులు' మొదలైన పుస్తకాలు రాసి సాహిత్య ప్రపంచంలో తన స్థానాన్ని పదిలపరుచుకొన్నారు. ఎన్నో కథా కవితా సంపుటాలకు సంపాదకత్వం వహించి సాహితీవేత్తగా తన ప్రత్యేకతను నిలబెట్టుకొన్నారు. ఇటీవల 'విదిత' వ్యాస సంపుటితో మరోసారి సాహిత్యపు లోతుపాతులెరిగిన విమర్శకునిగా స్థిరపడ్డారు.

రచయిత అనేక సాహిత్య సదస్సుల్లో చేసిన ఉపన్యాసాలు, వివిధ గ్రంథాలకు రాసిన సమీక్షలు, ముందుమాటలు, ప్రసిద్ధకవులపై రచయితలపై రాసిన వ్యాస సంపుటి ఇది. మామూలు పాఠకుడు కూడా చదవడానికి వీలుగా ఈ పుస్తకాన్ని 5 విభాగాలుగా విభజించారు.

అభిప్రాయ విభాగంలో ఉన్నవ, చాసో, వేములపల్లి శ్రీకృష్ణ, బొల్లిముంత, వాసిరెడ్డి సీతాదేవిల రచనలలోని విశిష్టతను వివరించారు. ఉన్నవ రచించిన మాలపల్లిని గురించి సామ్రాజ్యవాద వ్యతిరేకత, స్వాతంత్ర్యోద్యమం, హరిజనోద్యమం, మాలపల్లి నేపథ్యమని అంటూ, భాషా భావ విప్లవాలను ఏకకాలంలో సాధించిన ఉత్తమకృతి 'మాలపల్లి' అనిచెప్పారు.

తన కాలంలో లేదా తదనంతర కాలంలో ప్రభావం చూపిన రచయితనే మంచి రచయితగా పరిగణిస్తారు. అలాంటి రచయితే ఉన్నవ అని వివరిస్తూ ఉన్నవ ప్రభావంతో అందే నారాయణస్వామి 'పరివర్తనం' అనే కథ రాసారని, కరుణకుమార, మా గోఖలేలపై కూడా ఉన్నవ ప్రభావం ప్రసరించిందా అని కూడా ఆలోచించాలి అంటారు.

ఈ సాహిత్యవ్యాస సంపుటంలో గత శతాబ్దపు రచయితల గురించే కాకుండా సమకాలీన రచయితలు పాపినేని, గౌరునాయుడు, చింతాఅప్పలనాయుడు, విహారి, ఇనాక్, రాచపాళెం, దేవిప్రియ మొదలగు వారి రచనలపై సునిశితమైన విశ్లేషణలు వున్నాయి. తెలుగు భాషాభిమాని సాకం నాగరాజ తన అన్నయ్య డాక్టర్ వెంకట సుబ్బయ్యను స్మరించుకొంటూ ప్రచురించిన సాహిత్యసంచికలోని వ్యాసాల్లో ఎన్నో ఆసక్తికరమైన విషయాలు ఉన్నాయి. బందరునుండి పాఠ్యపుస్తకాలనుప్రచురించే ఎం. శేషాచలం కంపెనీ ఎమెస్కో పాకెట్ బుక్స్ పేరిట నెలకు నాలుగేసి వంతున ఒక్కోటి రెండు రూపాయిల వెలతో పాఠకులకు అందించడానికి ఈడెన్‌బర్గే కారణమని తెలియజేశారు.

ప్రఖ్యాత రచయిత్రి రంగనాయకమ్మ మహాప్రస్థానం తొలి ప్రచురణకర్త నళినీకుమార్, అభ్యుదయ రచయితలు పరకాల, గంగినేని, ఫిడేల్‌రాగాలు డజన్ కవి పఠాభి గురించిన విలువైన వ్యాసాలు చదివింపచేస్తాయి. తొలితరం అభ్యుదయ రచయిత్రి 'వట్టికొండ విశాలాక్షి' వ్యాసంలో ఆమె జీవితంలో జరిగిన సంఘటనలు ఎంతో ఆసక్తికరంగా చెప్పారు. అభిప్రాయ బేధాలవలన విశాలాక్షి గారి భర్త రంగయ్యగారు 'అరసం'కు రాజీనామా చేసి భార్యను కూడా రాజీనామా చేయమని అనడం, ఆమె తిరస్కరించడం, ఆకారణంగా ఇద్దరూ విడిపోవడం, ఆ తర్వాత కలిసి ఉండడం చదువుతుంటే ఉద్వేగం కలుగుతుంది. ఆ సందర్భంగా 'ఆవిడ ఏం చేయాలన్నా అతను ఒప్పుకోకపోతే మార్చడానికి ప్రయత్నిస్తాం. మారనపుడు విడిపోయి ఒంటరిగా జీవితానికి అలవాటుపడాలి. అప్పుడు ఆత్మాభిమానాన్ని కాపాడుకుంటాం.' అన్న మాటలు చదువుతుంటే అసలైన స్త్రీవాది ఆమె అనిపిస్తుంది. ఒక శతాబ్దం తెలుగు సాహిత్యం గురించి విహంగవీక్షణం ఈ పుస్తకం. సాహిత్యాభిమానులకు యువతరానికి, విద్యార్థులకు చక్కని కరదీపిక.

*- మందరపు హైమవతి,* ఫోన్: 94410 62732

## 'నిత్యజీవితంలో హేతుత్వం'




రాజమండ్రి గౌతమి గ్రంథాలయంలో 3-5-2015న రిటైర్డ్ ప్రిన్సిపాల్, హేతువాది శ్రీ పసల భీమన్న వ్రాసిన 'నిత్యజీవితంలో హేతుత్వం' పుస్తకం విడుదలైంది. ఆవిష్కర్త ప్రముఖ హేతువాది శ్రీ వెలమాటి సత్యనారాయణ. ప్రముఖ వారపత్రిక ప్రజాపత్రిక ఈ సభను నిర్వహించింది. దీనికి శ్రీ ఫణి నాగేశ్వరరావు అధ్యక్షత వహించారు. ప్రజాపత్రిక 88వ విశేష సంచికను ఆవిష్కరించే సందర్భంలో భీమన్నగారి పుస్తకం కూడా విడుదలయింది.

ప్రముఖ రచయిత శ్రీ డి.ఆర్. ఇంద్ర పుస్తక సమీక్ష చేశారు. ఈ పుస్తకంలో 13 వ్యాసాలున్నాయి. దీని మొదటి ముద్రణ 1985లోను, రెండవ ముద్రణ 1989లోను జరిగింది. ఇది మూడవముద్రణ. డాక్టర్ సంజీవదేవ్ ఈ పుస్తకాన్ని మెచ్చుకుంటూ భీమన్నగారికి వ్రాసిన జాబు కూడా ఇందులో ప్రచురించారు. హేతువాదం గురించిన ప్రాథమిక జ్ఞానంతోపాటు హేతువాదం విషయంలో ఉన్న అపోహలు గురించి, హేతువాద ఉద్యమ అవసరం గురించి, మానవవాదం గురించి, మూఢాచారాలగురించి, భావవిప్లవంగురించి వ్రాసిన వ్యాసాలు తప్పక చదవవలసినవి. హేతువాద దృక్పథంలో విద్యావిధానం, మానవ విలువలు, సమాజంలో ఉపాధ్యాయునిపాత్ర మొదలైన వ్యాసాలు విజ్ఞానదాయకంగా ఉన్నాయి. 'పిల్లల్ని పెంచడంలో మెలకువలు' అన్న వ్యాసం తల్లిదండ్రులు తప్పక చదవాలి. ఇప్పటివరకు భీమన్నగారు 10 హేతువాద పుస్తకాలు వ్రాశారు.

శ్రీ ఇంద్ర తన ప్రసంగంలో - ప్రభుత్వం గోదావరి పుష్కరాల కోసం ఎంతో ప్రజాధనం వృధా చేస్తున్నదని ఆవేదన వ్యక్తం చేశారు. పుష్కరాల సమయంలో గోదావరి నదిలో నీటికి విశేషమైన జీవశక్తి ఉంటుందని, అందుకే నదిలో స్నానంచేస్తే ఆ జీవశక్తి స్నానం చేసినవారికి కలుగుతుందన్న ప్రచారాన్ని భారతీయ శాస్త్రవేత్తలు ఖండించాలన్నారు. 84 పుటలు గల ఈ పుస్తకం వెల: రు. 70లు. ప్రతులకు 'జన విజ్ఞాన వేదిక' శ్రీ జి. మాల్యాద్రి, నెల్లూరు, మొబైల్ : 944503061, శ్రీ పసల భీమన్న, రాజమండ్రి. మొబైల్ : 949123276.

## కొత్త పుస్తకాలు




**నవ్యాంధ్ర రాజధాని ప్రాంత గ్రామాల చరిత్ర:** తెలుగువారి చరిత్రపై సాహిత్యంపై సాధికారికంగా వ్రాయగల ప్రఖ్యాత ఆచార్యులు యార్లగడ్డ బాల గంగాధరరావు గారు వ్రాసిన 60 పుటల పుస్తకం ఇది. రాష్ట్ర విభజన తరువాత మిగిలిన ఆంధ్రప్రదేశ్‌కు కొత్త రాజధాని నిర్మాణంకోసం ఎంపిక చేయబడ్డ ప్రాంతంలో ఇప్పుడు ఉన్న గ్రామాల భౌగోళిక, చారిత్రక, సాంస్కృతిక వివరాలను సంక్షిప్తంగా ఈ పుస్తకంలో వివరించారు. ప్రస్తుత రాజధాని నిర్మాణ పూర్వ విశేషాలను తెలుసుకోవాలన్న కోరిక ఉన్న వారంతా ఈ పుస్తకాన్ని చదవాలి. వెల: రు.50లు. ప్రతులకోసం రచయితను 98494 99169లో సంప్రదించండి.

---




**క్లాసికల్ - ప్రాచీన శ్రేష్ఠ భాషగా తెలుగు చరిత్ర - కొన్ని కొత్త చూపులు:** ద్రావిడ విశ్వవిద్యాలయం పూర్వ ఉపకులపతి ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ రచించిన ఈపుస్తకం ఫిబ్రవరి నెలలో విడుదలైంది. తెలుగు భాషాశాస్త్రవేత్త కీ౹౹శే౹౹భద్రిరాజు కృష్ణమూర్తిగారికి అంకితమిచ్చిన ఈ పుస్తకంలో పాశ్చాత్య 'ఓరియంటలిజం'; భారతీయ 'క్లాసికల్' భాషా భావన - పూర్వరంగం; తెలుగు - శాస్త్రగత - ప్రాచీనత; క్లాస్ - క్లాసిక్ - క్లాసికల్ - క్లాసిసిజం; క్లాసికల్ భాషోద్యమం; ముందు- వెనుక అనే నాలుగు అధ్యాయాలుగా విభజించిన ఈ రచనలు చదివితే క్లాసికల్ భాషగా తెలుగుకు గుర్తింపుకోసం జరిగిన పోరాట కారణాలను నేపథ్యాన్ని చరిత్రను శాస్త్రీయ విశ్లేషణలను కొంతవరకు అర్థంచేసుకోవచ్చు. జరిగిన ఉద్యమ లోతుపాతులను సమగ్రంగా రచించే ప్రయత్నం కొరవడిందనే చెప్పాలి. అయినా ఇది ఒక ఆకర గ్రంథంగా ఉపయోగపడుతుంది. వెల:రు.120లు. ప్రతులకు రచయితను 9441809566ను సంప్రదించండి.

---




**పోరాడి గెలిచిన తెలంగాణా:** పోరాడి గెలిచిన తెలంగాణా పుస్తకంలో రచయిత వేముల ప్రభాకర్ తాను ఉద్యమంతో జ్ఞానోదయం పొందానని తెలిపారు. తనవలె ఉద్యమంలో పాల్గొని ఆయా సందర్భాల్లో ఆవేశపూరితంగా చేసిన రచనలను సంకలనంగా ప్రచురించారు. ఆరాటం, పోరాటం, అంతిమవిజయం-శీర్షికలతో మొత్తం 60 కవితలను ప్రచురించారు. ఆయావేదికలపై చదివిన కవితల్ని సేకరించి, గ్రంథరూపంలో ప్రచురించిన వేముల ప్రభాకర్ అభినందనీయుడు. 1969 మొదలు 2013 వరకు జరిగిన ఉద్యమస్వభావం ఈ కవితల్లో కళ్లకు కట్టినట్లు కనబడుతుంది. ఉద్యమబాటలోని 60 మంది రచయితల భావావేశం, అసంతృప్తి, ఆవేదన స్పష్టమవుతుంది. వెల : 100 రూ. లభించుచోటు : వేముల రోహిత్, సికింద్రాబాద్ సెల్ : 9247040332.




**చిత్తూరు జిల్లా జానపద పరిమళాలు :** రెక్కలకష్టంతో గాని పొట్టగడవని స్థితి జానపదులది. ఇప్పటికీ సంప్రదాయాలు, పెద్దల కట్టుబాట్లు, రచ్చబండ తీర్పులు గ్రామస్థులు ఐక్యంగా ఉండటానికి తోడ్పడుతున్నాయి. పండుగ సందర్భాల్లో, పనులు చేసేటప్పుడు అలవోకగా పలికే మాటలే జానపదపాటలుగా ప్రసిద్ధి. గ్రామాల్లో తిండి సంపాదనకు ఊరూరు తిరిగే సంచారజీవులు ఉంటారు. వీరి సంభాషణల్లో, పాటల్లో ఆధునిక నాగరికత లక్షణాలు కనిపించవు. పాత్రికేయుడు, కవి దాసరి కృష్ణారెడ్డి పనిగట్టుకొని చిత్తూరుజిల్లాకు చెందిన జానపద పాటల్లోని మాండలికపదాలను ఏరి అకారాదిక్రమంలో అర్థాలు వ్రాసి, అకారాదిక్రమంలో సేకరించిన సామెతలను కూర్చి, ఆ ప్రాంతంలోని ఆచార వ్యవహారాలు, పండుగలు, పూజల్ని గూర్చి క్లుప్తంగా తెలియజేశారు. ఒక మంచి పనిగా భావించవచ్చు. ఇది చిన్న పుస్తకమే అయినా తేనెపట్టులాంటిది. పుస్తకం వెల : 75 రూ. ప్రతులకు: దాసరి కృష్ణారెడ్డి, పుంగనూరు, చిత్తూరుజిల్లా. సెల్ : 98853 26493.

---




**మనవి మాటలు:** ముందుమాటల సమాహారమే ఈ 'మనవిమాటలు' పుస్తకం. ఈ పద్ధతిని ఇంతకుముందు రచయితలు ప్రారంభించారు. దానిని ఎం.రవికృష్ణ పాటించారు. రచయిత మంచి చదువరి. చదివిన దానిని చక్కగా విశ్లేషిస్తారు. ప్రసిద్ధిచెందిన రచయితల వ్యాసాలను, దొరకని పుస్తకాలను సేకరించి గ్రంథరూపంలో పాఠకులకు అందజేయడం రవికృష్ణ ప్రత్యేకత. ఆ విధంగా చాలాగొప్ప పుస్తకాలు అందుబాటులోకొచ్చాయి. ఆయా గ్రంథావిష్కరణల ఛాయాచిత్రాలను మనవి మాటలు పుస్తకంలో ప్రచురించారు. తప్పక చదువవలసిన పుస్తకం. వెల : 80 రూ. పుస్తకం లభించుచోటు : ఎం.రవికృష్ణ, గుంటూరు. సెల్ : 94403 20580.

---




**అవలోకన:**యు.జి.సి.వారు విశ్వవిద్యాలయాల్లోను, కళాశాలల్లోను పనిచేసే అధ్యాపకులకు సెమినార్లు నిర్వహిస్తూ, వారు సమర్పించే పత్రాలను పుస్తకరూపంలో తీసుకురావడానికి అవకాశం యిస్తారు. కాని యు.జి.సి. వారి ధ్యేయం మాత్రం అంతగా నెరవేరడం లేదు. ఇటువంటి రోజుల్లో తాను సెమినార్లకు హాజరై సమర్పించిన పత్రాలకు తోడు ఇతర మేగజైన్లలో ప్రచురించిన వ్యాసాలను కలిపి డా౹౹ వెన్నిసెట్టి సింగారావు, "అవలోకన" పేరుతో పాఠకుల ముందుకు తీసుకురావడం సంతోషించవలసిన విషయం. 20 వ్యాసాలు సులభంగా చదవదగ్గవిగా ఉన్నాయి. వ్యాసాలు మూసపోసినరీతిలో కాకుండా వైవిధ్యంతో విమర్శకులు మెచ్చదగినవిగా ఉన్నాయి. వీటివెనుక అధ్యాపకుని కృషి కనబడుతుంది. అవసరమైన మేరకు లోతుగా విశ్లేషించి చెప్పడం హర్షదాయకం. సాహిత్యవ్యాసాలు, సాధారణ వ్యాసాలు, చారిత్రక వ్యాసాల సంపుటిగా అవలోకన ద్యోతకమవుతుంది. రచయిత ప్రతి వ్యాసంలో తన ఆలోచనను తెలియజేయడం బాగుంది. ఈ పుస్తకం వెల : రు.80 లు, ప్రతులకు : డాక్టర్ పి. సూర్యకుమారి, 0863-2352538, గుంటూరు - 522 006.

---


Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL 14381/7/1/2015 TC

# "మనిషికి ఎన్ని ఉన్నా, ఆరోగ్యం లేకుంటే - జీవితంలో ఆనందం లేనట్టే"

## హోమియో వైద్యంలో నివారింపబడు వ్యాధులు



**మానసిక వ్యాధులు :** జ్ఞాపకశక్తి తగ్గుట, ఆందోళన, అస్థిమితము, డిప్రెషన్స్, ప్రేమభంగము వలన కలిగే మానసిక అస్వస్థతలు, నిద్రలేమి, నిద్రలో గురక మొ॥నవి.

**శారీరకమైనవి :** చర్మవ్యాధులు, బొల్లి, పులిపిర్లు, నల్లమచ్చలు, సొరియాసిస్ (పొరలు ఊడు చర్మవ్యాధి) బోద, ఉబ్బసము, ఎలర్జీ (అన్ని రకములు) పోలియో, కోరింతదగ్గు, జీర్ణాశయ వ్యాధులు, వెంట్రుకలు ఊడుట, చిన్నతనములోనే నెరయుట, కండ్లకలక, న్యుమోనియా (ఊపిరితిత్తులలో నెమ్ము), పక్షవాతము, నరముల బలహీనత, దీర్ఘకాల తలనొప్పి, లివర్లు, పసికర్లు, గ్యాస్ట్రబుల్, సయాటికా, నడుమునొప్పి, హెపటైటిస్(బి), లుంబర్, సర్వికల్ నొప్పి.

**జననేంద్రియ వ్యాధులు :** వీర్యశక్తికి, నపుంసకత్వం నివారణకు, సంతానం కలుగుటకు, గర్భిణీ స్త్రీ సుఖప్రసవమునకు, ఎరుపుగాని, తెలుపుగాని అవుచున్న చికిత్స చేయబడును. సకాలములో రజస్వల కాకపోవుట, ఋతుశూల, గనేరియా "సిఫిలిస్ (సుఖవ్యాధులు)" మొ॥ వాటికి నిపుణతతో చికిత్స చేయబడును. ఎయిడ్స్ (హెచ్.ఐ.వి.)కి ప్రత్యేక నిరోధక, నివారణ చికిత్స చేయబడును.

### నా ప్రముఖ వైద్య, ఆరోగ్య గ్రంథములు

- హోమియో వైద్యం (1 & 2 భాగములు)
- ఇంగ్లీషు - తెలుగు మెడికల్ డిక్షనరీ
- యోగశాస్త్రం - ప్రథమ చికిత్స
- భారతీయ వైద్య విధానాలు
- హోమియో వస్తు గుణదీపిక
- సెక్స్ అండ్ హోమియో
- హోమియో దర్శిని
- ప్రకృతి వైద్యం
- మెడికల్ గైడ్
- హెల్త్ అండ్ బ్యూటీ
- వైద్య రత్నాలు
- సంపూర్ణ హోమియో వైద్యం

మరియు అనేక ఇతర గ్రంథములు

యునెస్కో అవార్డు గ్రహీత, మిలీనియం సోషల్ సర్వీస్ మెడల్ గ్రహీత, "ప్రజావైద్య సేవక్", "భిషక్ రాజా", "ఆరోగ్య రక్షక్", "దక్ష వైద్యశ్రీ" బిరుదాంకితులు. అనేక వైద్య, ఆరోగ్య గ్రంథముల రచయిత సి.వి. రామన్ అకాడమి, హైదరాబాద్ వారిచే "హోమియో విశారద" బిరుదాంకితులు


**Ln. డా॥ కె.వి.యన్.డి. ప్రసాద్ DHMS, M.H.S. (London)**

పాత గవర్నమెంట్ ఆసుపత్రి వెనుక, శ్రీ రాధాకృష్ణ కళ్యాణమండపం వద్ద, కొత్తపేట, తెనాలి.

☎ 08644 - 220832, Cell : 98484 09749

